


రూపధరుడి యాత్రలు - 1




[ట్రోయ్‌నగరపు రాజైన వర్ధనుడి కుమారుడు మోహనుడు, ప్రతాపుడనే గ్రీకురాజు భార్యను భువనసుందరిని ఎత్తుకుపోవటమూ; భువనసుందరిని తిరిగి తెచ్చుకునే నిమిత్తం గ్రీకులు నౌకలలో బయలుదేరి, ట్రోయ్‌నగరాన్ని ముట్టడించి, పదేళ్ళ యుద్ధం అనంతరం కొయ్యగుర్రం సహాయంతో ట్రోయ్‌నగరంలో ప్రవేశించి, నగరాన్ని తగల బెట్టటమూ, "భువనసుందరి" అనే గ్రీకు పురాణగాథలో చదివాం.

ట్రోయ్‌పైకి దండెత్తివెళ్ళిన గ్రీకువీరులలో ఒకడైన రూపధరుడు, యుద్ధానికి బయలుదేరబోయే సమయంలోనే, మరి ఇరవై సంవత్సరాలదాకా ఇంటికి తిరిగిరాడని జోస్యం చెప్పారు. ఈ ఇరవై సంవత్సరాలలో పది సంవత్సరాలు ట్రోయ్ ముట్టడిలోనే గడిచాయి. మరి పది సంవత్సరాలపాటు రూపధరుడు అతి విచిత్రమైన అనుభవాలకు గురి అయాడు. ఈ అనుభవాలను చిత్రించే కథ ఈ సంచికనుండీ ప్రారంభమవుతున్నది.]

రూపధరుడి నౌకలు ట్రోయ్‌తీరాన్ని వదలగానే ఎదురుగాలి సాగింది. నౌకలు దక్షిణ దిక్కుగా ప్రయాణించటానికి మారుగా ఉత్తరంగా వెళ్లి ఇస్మరోస్ తీరాన్ని తాకాయి. ఇది కికోనియను లుండే నగరం.

రూపధరుడి బలాలు నగరంమీద పడి దోచి, నగరాన్ని ధ్వంసం చేసేశాయి. సైనికులు నగరంలోని స్త్రీలనూ, పశువులనూ, సంపదలనూ పంచుకున్నారు. "మనం ఎంత త్వరగా బయలుదేరి వెళ్ళిపోతే అంత మంచిది!" అని రూపధరుడు చెప్పాడు. కాని సైనికులు అతని మాటలు వినే స్థితిలో లేరు. ఎందుచేతనంటే వారికి నగరంలో అంతులేని సారాయి దొరికింది.



67





మైన యుద్ధం జరిగింది. కికోనియనుల సంఖ్య హెచ్చు. పొద్దెక్కుతున్నకొద్దీ రూపధరుడి బలాలు తగ్గసాగాయి. చచ్చిపోయిన గ్రీకుల సంఖ్య నౌకకు ఆరుగురు చొప్పున ఉన్నది. మిగిలినవారు తమ నౌకలలో దూకి ప్రాణాలు రక్షించుకున్నారు.

వారు సముద్రంమీద కొద్దిదూరం వెళ్ళే సరికల్లా వాయువ్యదిశనుంచి ఝంఝా మారుతం సాగింది. భూమివైపునుంచీ, సముద్రంవైపునుంచీ కూడా నీలిమేఘాలు వచ్చి ఆకాశాన్ని ఆవరించాయి. రాత్రి ముంచుకు వచ్చింది. ఆ ఘోరుగాలికి తెరచాపలు ఉబ్బి పడవలు వాయువేగాన కొట్టుకు పోసాగాయి.

త్వరలోనే తెరచాపలు గాలి తాకిడికి తట్టుకోలేక చినిగి చీలికలైపోయాయి.

ఎవరి ప్రాణాలూ దక్కవని రూపధరుడికి భయం పట్టుకున్నది. అన్ని నౌకల తెరచాపలూ దించేసి, తెడ్లువేస్తూ తీరాన్ని చేర్చమని అతను తన సైనికులకు చెప్పాడు. నౌకలు తీరాన్ని చేరాక రెండు రోజులపాటు గ్రీకులు తమ ప్రాణాలను అరిచేతబట్టి తుఫాను నిలుపుదలకోసం ఎదురుచూశారు. ఆ రెండు రోజులూ వారు సూర్యకాంతి చూసి ఎరగరు.

అందరూ తప్పతాగి, సముద్రతీరాన పశువులను చంపి, కాల్చి, విందుచేసే ప్రయత్నంలో ఉండిపోయారు.

ఈలోపుగా నగరంనుంచి తప్పించుకుని పారిపోయిన కికోనియనులు ఇతర గ్రామాలకు వెళ్లి అసంఖ్యాకులైన యోధులను వెంటబెట్టుకు వచ్చారు. ఇలా వచ్చిన వారిలో రథాలమీద నిలబడీ, అవసరమైతే కింద దిగీ యుద్ధం చెయ్యగలవారు అనేక మంది ఉన్నారు.

తెల్లవారుజామున ఈ కికోనియను యోధులు మిడతలదండులాగా వచ్చి రూపధరుడి సైనికులపై పడ్డారు. ఘోర







చివరకు మూడోనాటి ఉదయం తూర్పున అరుణోదయం కనిపించేసరికి వారికి మళ్ళీ ప్రాణాలు తిరిగి వచ్చినట్టయింది. వారు మళ్ళీ తెరచాప స్తంభాలు ఎత్తి, కొత్త తెర చాపలు ఏర్పాటుచేశారు. వారి ప్రమేయం ఏమీ లేకుండానే నౌకలు గాలివాలున వేగంగా పోసాగాయి.

నాలుగురోజు లీవిధంగా ప్రయాణంచేసి రూపధరుడి నౌకలు మలియా అగ్రాన్ని చేరు కున్నాయి. ఈ అగ్రాన్ని చుట్టి ఉత్తరంగా వెళితే రూపధరుడు తన స్వదేశమైన ఇథా కాను చేరవచ్చు. గాలి ఉధృతం కొంచెం తగ్గినట్టు కనబడింది. నౌకలు అగ్రాన్ని చుట్టి ముందుకు సాగవలిసిందిగా రూప ధరుడు అజ్ఞ ఇచ్చాడు. కాని అంతలోనే మళ్ళీ ఝంఝామారుతం సాగి, నౌకలను కతీరా వైపుకు తీసుకుపోయింది.

తొమ్మిది రాత్రులూ, తొమ్మిది పగళ్ళూ రూపధరుడి నౌకలను వాయుదేవుడు బంతి ఆడాడు. పదవ రోజున వారు ఒక తీరాన్ని తాకారు. కాని రూపధరుడు ఈ తీరాన ఎక్కువ కాలం తన నౌకలతో నిలిచే అవకాశం లేక పోయింది.

ఎందుచేతనంటే, ఈ తీరాన ఉండే ప్రజలు ఒక రకం పళ్లు తింటారు. అవి తేనె రుచిగా ఉంటాయి, వాటిలో గింజలు గాని, టెంకలుగాని వుండవు. అవి తింటే మనుషులకు పాతవిషయాా లేవీ జ్ఞాపకం వుండవు; నల్లమందు తిన్నవాళ్లలాగా తన్మ యత్వంలో నిమగ్నులవుతారు.

కాని ఈ సంగతి రూపధరుడికి తెలి యదు. అతనూ, అతని అనుచరులూ తీరాన వంటచేసుకు తిన్నారు. తరవాత రూపధరుడు తనవాళ్ళను ముగ్గురిని పిలిచి, "ఈ తీరాన ఎలాటి మనుషులుంటారో చూసి రండి!" అని పంపాడు.

ఈ ముగ్గురు గ్రీకులకూ అక్కడి ప్రజలు అపకారమేమీ చేయకపోగా తాము తినే




69

ఫలాలను వారికికూడా ఇచ్చారు. అవి తిన గానే రూపధరుడి మనుషులు తాము వచ్చిన పని పూర్తిగా మరిచిపోయి పరమానందంలో మునిగిపోయారు.

ఎంతసేపటికీ తన మనుషులు తిరిగి రాకపోయేసరికి వారిని వెతుక్కుంటూ రూపధరుడు, మరికొందరిని వెంటబెట్టుకుని వచ్చి జరిగిన సంగతి తెలుసుకున్నాడు. అక్కడి ప్రజలు అతనికికూడా పళ్ళు తిన మని ఇచ్చారుకాని, రూపధరుడు వాటిని శంకించి తినలేదు. వాటిని తినిన తన మనుషులను అతను బలాత్కారంగా నౌకల వద్దకు తీసుకురావలిసి వచ్చింది. అప్పటికీ వారు, "మేము నీతో రాము. ఇక్కడే ఉంటాము! మమ్మల్ని వదిలెయ్యి! ఇక్కడే మాకు బాగున్నది!" అన్నారు.

రూపధరుడు వారిని తాళ్ళతో కట్టి నౌకలలో పడవేయించి, తాను ఇక ఆ తీరాన ఒక్కక్షణం ఉన్నా ప్రమాదమేనని గ్రహించి నౌకలను ముందుకు నడిపించాడు. ఈ నౌకలు కొన్ని రోజులు సముద్రంమీద ప్రయాణించి, తలవనితలంపుగా ఒక రాత్రి తీరాన్ని చేరాయి.

తాము ఎటువంటి ప్రదేశం చేరినదీ గ్రీకులు ఎరగరు. ఎందుచేతనంటే, ఆకాశాన చంద్రుడున్నప్పటికీ మేఘాలు దట్టంగా



ఉన్నాయి. అదీగాక సముద్రంమీద పొగ మంచు దట్టంగా వుండటంమూలాన అంత దూరంలో ఏమున్నదీ తెలియరాలేదు. మిగిలిన విషయాలు తెల్లవారి చూచుకోవచ్చునని, గ్రీకులు తెరచాపలు దించి, తమ నౌకలలోనుంచి తీరానికి వచ్చి, ఇసకలో పడుకుని మైమరిచి నిద్రపోయారు.

వారు తెల్లవారుతూనే లేచి, దీవిలాగా కనపడే ఆ ప్రదేశమంతా తిరిగి, అక్కడి ప్రకృతిసౌందర్యం చూసి అనేకరకాలుగా ముచ్చటపడసాగారు.

ఆ దీవిలో అన్ని రకాల ఫలవృక్షాలూ సమృద్ధిగా ఉన్నాయి, అంతులేని ద్రాక్షతీగలున్నాయి. నేల చాలా సారవంతమైనది, కాని ఎక్కడా వ్యవసాయం లేదు. అయితే జలసమృద్ధికి ఏమాత్రమూ లోటు లేదు. అందుచేత వ్యవసాయం అవసరం లేకుండానే ఆ భూమిమీద అన్ని రకాల ధాన్యాలూ పండించవచ్చు.

గ్రీకులు తమ నౌకలను వదిలి ఎంతో దూరం వెళ్ళకమునుపే వారికి అడవి మేకలు కనబడ్డాయి. వారు వెంటనే తమ నౌకలవద్దకు పరిగెత్తి విల్లులూ, అంబులూ, ఈటెలూ తెచ్చుకున్నారు. వాటితో కొన్ని మేకలను చంపి వండుకుని రోజల్లా తింటూనే వున్నారు. ఎందుకంటే రూప





ధరుడి వెంటవున్న పన్నెండు నౌకలలో ఒక్కొక్క నౌక వంతూ తొమ్మిదేసి మేకలు చొప్పున వచ్చాయి.

ఆ రోజు వారు నౌకలను విడిచి వెళ్లక పోయినా, దూరాన మనుషుల నివాసాలున్న లక్షణాలు వారికి కనిపించాయి. సాయం కాలంపూట వారికి అక్కడక్కడా వంట ఇళ్ల తాలూకు పొగ కనిపించింది; దూరాన మేకలూ, గొర్రెలూ అరుస్తూవున్న చప్పుడు స్పష్టంగా వినిపించింది.

రూపధరుడు తూర్పు తెల్లవారుతూనే తన మనుషులను పిలిచి, వారితో ఇలా చెప్పాడు: "నేను నా పడవను నడుపుకుని ఈ తీరంవెంబడి వెళ్లి ఈ దీవిలో ఉండే మనుషులు నాగరికులో, అడవిజాతివాళ్లో, వాళ్లకు ఒక సమాజం ఉందో లేదో చూసి వస్తాను. నేను తిరిగివచ్చేదాకా మిగిలిన పడవలూ, మిగిలిన మనుషులూ ఇక్కడే కదలకుండా ఉండండి!"

రూపధరుడి నౌక కొంతదూరం తీరం వెంబడే వెళ్లేసరికి ఒకచోట తీరానికి కొంత ఎడంలో ఒక ఎత్తయిన దిబ్బమీద ఒక గుహ కనిపించింది. దానిమీదుగా లతలు పెనవేసుకుని ఉన్నాయి. దానిచుట్టూ పెద్ద ప్రహరీగోడలాటిది ఉన్నది. ఇందులో పెద్ద పెద్ద కొండరాళ్లూ, బ్రహ్మాండమైన చెట్ల బోదెలూ ఉన్నాయి.

రూపధరుడు తన నౌకను గుహకు ఎదురుగా నిలిపి, తన నావికులలో పన్నెండు మందిని, ధైర్యసాహసాలుగలవారిని, ఏరుకుని, ఒక మేకతోలు తిత్తిలో సారా తీసుకుని గుహకేసి బయలుదేరాడు.

ఈ సారా అపురూపమైనది. రూపధరుడు ఇస్మరోస్‌పై దాడిచేసినప్పుడు అక్కడ ఉండే ఒక అర్చకుణ్ణీ, అతని భార్యా బిడ్డలనూ చంపక వదిలివేశాడు. అందుకు ప్రతిఫలంగా ఆ అర్చకుడు రూపధరుడికి అనేక తిత్తులలో అద్భుతమైన సారాయినీ,





వెండి బంగారాలనూ బహూకరించాడు. ఆ అర్చకుడు ఈ సారాను ఇరవై రెట్లు నీటిలో కలిపి తాగేవాడట. అప్పటికీ దాని మాధుర్యమూ, సువాసనా చెప్పనలవి కాకుండా ఉండేదట.

రూపధరుడూ, అతని అనుచరులూ త్వర లోనే గుహను చేరుకున్నారు. కాని గుహలో ఎవరూ లేరు. అది చాలా పెద్ద గుహ. అందులో అనేక అలవలు కట్టి ఉన్నాయి. వాటి నిండా గొర్రెపిల్లలూ, మేకపిల్లలూ, వయసువారీగా ఉన్నాయి. ఒకపక్క పాల మీగడ అచ్చులు పేర్చి ఉన్నాయి. అనేక భగోణీల నిండా పాలు ఉన్నాయి.

"ఈ మీగడ అచ్చులు పట్టుకుని మన దారిన మనం పోదాం!" అన్నారు రూప ధరుడి అనుచరులు.

"మనని అడ్డేవారు లేరు; ఈ గొర్రె పిల్లల్నీ, మేకపిల్లల్నీ తోలుకు పోదాం!" అన్నారు మరికొందరు.

కాని రూపధరుడు సమ్మతించలేదు. అందరూ తినగలిగినంత జున్ను మీగడ తిన్నారు. తరవాత ఆ గుహలో ఉండే మనిషికోసం ఎదురుచూడసాగారు.

చివరకు ఆ మనిషి రానేవచ్చాడు. మొదట అతన్ని గ్రీకులు చూడలేదు, పెళ పెళారావంతో ఏదో వచ్చి గుహలో పడింది. అది ఒక ఎండుమానుల కట్ట! తరవాత అసలు మనిషి వంగి గుహలోకి వచ్చాడు. పిల్లిని చూసిన ఎలుకల్లాగా గ్రీకులు చెల్లా చెదరుగా పారిపోయి దాక్కున్నారు.

ఆ వచ్చిన మనిషి తాటిచెట్టు ఎత్తు న్నాడు. అతని నుదుట ఒకే ఒక కన్ను నిప్పుకణికలా మెరుస్తున్నది.

ఈ మనిషి ఒక పెద్ద గొర్రెలమందను గుహలోకి తోలాడు. ఆ గొర్రెలు బాగా కొవ్వి ఉన్నాయి. తరవాత ఒక బ్రహ్మాండమైన బండరాయిని ఎత్తి గుహకు అడ్డంగా వేశాడు. ఇరవై జతల ఎద్దులు తోసినా కదలనంత

పెద్ద రాయి అది. ఆ తరవాత వాడు ఆడ గొర్రెలన్నిటికీ పాలు తీశాడు.

ఈ మనిషి ఫాలలోచను డనే జాతివాడు. ఈ జాతికి చెందినవాళ్లు అనేకమంది ఈ ప్రాంతంలో ఉన్నారు. వీరికి సామాజిక జీవితం లేదు. ఎవరి కష్టసుఖాలు వారివి. విసిరిపారేసినట్టు ఒక్కొక్కరూ ఒక్కొక్క గుహలో ఉంటారు. ఒకరిని గురించి ఒకరు పట్టించుకోరు.

ఈ ఫాలలోచనులు వ్యవసాయం చెయ్యరు. అక్కడి నేల చాలా సారవంత మైనది కావటంచేత వ్యవసాయం లేకుం డానే బార్లీ మొదలైన అహార ధాన్యాలు సమృద్ధిగా పండుతాయి.

ఈ రాక్షసులు ఏడాది కొకసారి ధాన్యం కోసుకువస్తారు. మిగతా సమయాలలో బీళ్ల మీదికి గొర్రెలనూ మేకలనూ తోలుకు పోయి రోజల్లా మేపుతారు. బలమైన పచ్చిక తిని ఆ జంతువులు బాగా కొవ్వుతాయి. వాటిని కాయటం తప్ప ఈ ఫాలలోచనుల కింకేమీ చేతకాదు.

ఈ రాక్షసులు అనేక తరాలుగా సముద్ర తీరాన ఉంటున్నప్పటికీ వారికి పడవలు నిర్మించటంగాని, సముద్రయానాలు చెయ్యటంగాని చాతకాదు. అందుచేత వారు నాగరికత కొంచెమైనా తెలియక కేవలం బర్బరజీవితం గడుపుతున్నారు.

గ్రీకులు ప్రవేశించిన గుహలో ఉండే ఫాలలోచనుడు తాను పితికిన పాలలో సగభాగం విరిచి జున్నుచేసి, బుట్టలో పెట్టుకున్నాడు. మిగిలిన పాలను తాగ టానికి కాబోలు భగోణీలలో పోశాడు. తర వాత వాడు పొయిలో నిప్పు రాజేశాడు. ఆ మంటలలో వాడి ఒంటికంటికి గ్రీకులు కనిపించారు.

ఆ రాక్షసుడు తన కంటిని అటూ ఇటూ తిప్పుతూ, "ఎవరు మీరు ?" అని గుహ దద్దరిల్లేలాగా అరిచాడు. [ఇంకా ఉంది]






## 2

[ట్రోయ్ పతనానంతరం ఇంటికి బయలుదేరిన రూపధరుడూ, అతని అనుచరులూ, నౌకలూ తుఫానులో పడి చాలారోజులు కొట్టుకుపోయి చిట్టచివరకు ఒక దీవిని చేరుకున్నారు. ఆ దీవిలో ఉండేవాళ్లను గురించి తెలుసుకోవటానికి బయలుదేరి, రూపధరుడు పన్నెండుమంది అనుచరులతో సహా ఒక గుహలో చిక్కుకున్నాడు. ఆ గుహ ఫాలలోచనులనే జాతికి చెందిన రాక్షసుడిది.]

ఆ రాక్షసుడి గొంతు వినేసరికల్లా గ్రీకులకు గుండెలు అవిసి పోయాయి.

రూపధరుడే సాహసించి రాక్షసుడితో ఈ విధంగా అన్నాడు :

"అయ్యా, మేము ట్రోయ్‌నుంచి తిరిగి ఇళ్లకు పోతున్న గ్రీకులము. దైవవశాన సముద్రంమీద పెనుగాలి వీచి మా నౌకలు మార్గం తప్పాయి. మేమిక్కడికి వచ్చి పడ్డాము. మా ప్రభువైన రారాజు జగద్విఖ్యాతి కన్నవాడు. ఆయన ఎన్నో దేశాలను జయించాడు, ట్రోయ్‌ని భస్మీపటలం చేశాడు. మేము మీకు అభ్యాగతులము. అభ్యాగతి దేవుడిలాటి వాడంటారు. కనుక తమరు మాకు తగురీతిగా ఆతిథ్యం ఇచ్చి, మమ్మల్ని అన్ని ఆపదలనుంచీ కాపాడవలసిందని మా ప్రార్థన!"

ఈ మాటలు విని రాక్షసుడు వికటాట్టహాసంచేసి, "ఓరీ మతిమాలినవాడా! మేము



దేవతలనూ గీవతలనూ లక్ష్యపెట్టేవాళ్లం కాము. మా ఫాలలోచనులముందు ఏ దేవతలూ అగలేరు, తెలిసిందా? ఇంతకూ మీ పడవను ఎక్కడ లంగరు వేశారు? దగ్గరలోనేనా, దూరాననా? ఆ సంగతి ముందు చెప్పు!" అన్నాడు.

రాక్షసు డీప్రశ్న ఎందుకు వేశాడో రూపధరుడికి అర్థమయింది. అతను యుక్తిగా, "మాకింకా పడవ ఎక్కడిది? అది మీతీరాన గల కొండలకు తగిలి ధ్వంసమైపోయింది. నేనూ ఈ నా అనుచరులూ తప్ప మిగిలిన వాళ్లందరినీ వరుణదేవుడు తన పొట్టన పెట్టుకున్నాడు!" అన్నాడు.



రాక్షసుడింకేమీ అనలేదు. వాడు చేతులు చాచి ఇద్దరు గ్రీకులను అందుకుని, నేలకు వేసి కొట్టిచంపి, వండుకుని ఎముకలు కూడా విడిచిపెట్టకుండా తినేశాడు. ఇది కళ్లారా చూసిన రూపధరుడికీ, అతని అనుచరులకూ ప్రాణాలు నీరసించిపోయాయి.

ఫాలలోచనుడు తన భోజనం పూర్తిచేసి అయిదారు కడవల పచ్చిపాలు తాగేసి, తన గొర్రెలమధ్యన చాచుకుని పడుకుని నిశ్చింతగా నిద్రపోయాడు.

రూపధరుడు కత్తిదూసి నిలబడ్డాడు. ఆ రాక్షసుడి రొమ్ము తడివి గుండె ఎక్కడ ఉన్నదీ తెలుసుకుని ఒక్కపోటుతో వాణ్ణి చంపేద్దామని అతను ఆలోచించాడు. కాని అంతలోనే అతని కొక సంగతి జ్ఞాపకం వచ్చింది. అదేమిటంటే, గుహకు రాక్షసుడు అడ్డంపెట్టిన రాయిని కదిలించటం తనవల్లా, తన అనుచరులవల్లా అయేపనిగాదు. ఇప్పుడు గనక తాను రాక్షసుణ్ణి చంపేసినట్టయితే, తానూ, తన అనుచరులూ ఈ గుహలోనే తిండికి మాడి ఘోరమైన చావు చావవలిసి ఉంటుంది. తమను రక్షించగలవారెవరూ ఉండరు. అందుచేత రూపధరుడు కత్తిని ఒరలో పెట్టేసి తన యథాస్థానంలో పడుకున్నాడు, ఆ రాత్రి అతనికి నిద్రలేదు.





తెల్లవారింది. రాక్షసుడు లేచి, నిప్పుచేసి, తన పశువులన్నిటినీ పాలుపితికి, దూడలను వదిలాడు. తరవాత మరి ఇద్దరు గ్రీకులను చంపి తినేసి, మందలను తోలుకుని గుహ బయటికి వెళ్లాడు. ఈసారి వాడు పెద్దరాయిని గుహకు అడ్డంగా పెట్టి, గ్రీకులు తప్పించుకుపోకుండా చేశాడు.



ఆ రాక్షసుడు తన మందలను మేపుకోవటానికి వెళ్లాక, రూపధరుడు కాలు కాలిన పిల్లిలాగా అటూ ఇటూ పచారుచేయసాగాడు. తన అనుచరులను చంపితిన్న ఈ రాక్షసుడిపైన ఎట్లా పగతీర్చుకోవాలా అన్న సమస్య అతన్ని బాధిస్తున్నది. ఏదైనా ఉపాయం తట్టేటట్టు చేయుమని అతను తన ఇష్టదేవత అయిన బుద్ధిమతిదేవిని ఎంతగానో ప్రార్థించాడు.

చివరకు అతనికి ఒక ఉపాయం తట్టింది. ఆ గుహలో ఉండే రాక్షసుడు, తనకు చేతికర్రగా ఉపయోగిస్తుందని, కణుపులు లేని నిడుపైన కర్ర ఒకటి తెచ్చి గుహలో ఉంచుకున్నాడు. అది ఇంకా పచ్చిగానే ఉన్నది. అది రమారమి తెరచాప స్తంభమంత లావున్నది. అంతే పొడుగుకూడా ఉన్నది. రూపధరుడు ఈ కర్రలో మనిషి ఎత్తు ముక్క కోయించాడు. దాని కొన సన్నగా చెక్కి, నిప్పులో కాల్చి గట్టిచేసి గుహలో ఉన్న పేడకుప్పలో దాచాడు. ఆ రాత్రి రాక్షసుడు నిద్రపోయేటప్పుడు ఆ కర్రమొనతో రాక్షసుడి ఒంటికన్ను కాస్తా పొడిచి, వాణ్ణి గుడ్డివాణ్ణి చేసెయ్యాలని రూపధరుడి ఆలోచన. ఇందుకుగాను ఒక్క మనిషి చాలడు. తనకు సాయపడటానికి తన అనుచరులలో మరి నలుగురిని రూపధరుడు ఎన్నుకున్నాడు.

సాయంకాలం కాగానే రాక్షసుడు తన మందలను తోలుకుని గుహకు తిరిగి వచ్చాడు. గొర్రెలనూ, మేకలనూ పాలుతీసినాక గుహద్వారం ఎప్పటిలాగే మూశాడు;





రాక్షసుడు రూపధరుడు అందించిన కొయ్యపాత్ర అందుకుని అందులోని సారాను గడగడా తాగేశాడు. వాడి కది చాలా రుచిగా కనిపించింది.

"ఈ సారా ఇంకా వుంటే పొయ్యి. నీ పేరేమిటోకూడా చెప్పు! నీకు మా ఆచారం ప్రకారం అతిథిసత్కారం చేస్తాను. ఇక్కడ మేముకూడా ద్రాక్షరసం తాగుతాము గాని, దానికీ రుచి లేనేలేదు!" అన్నాడు రాక్షసుడు.

రాక్షసుడీ మాట అన్నప్పటికీ రూపధరుడు తగు జాగ్రత్తమీదనే ఉన్నాడు. "నా పేరు ఉత్తుత్త మనిషి! అన్న ప్రకారం నాకు అతిథి సత్కారం చెయ్యాలిసుమా!" అన్నా డతను. అతను రాక్షసుడికి కొయ్యపాత్రతో మూడుసార్లు సారా ఇచ్చాడు.

"అయితే, ఉత్తుత్త మనిషీ, నిన్ను ఆఖరుకు తింటాను. మిగిలినవాళ్లందరూ అయిపోయేదాకా నీ జోలికి రాను. ఇదే మేము చేసే అతిథి సత్కారం!" అన్నాడు రాక్షసుడు. ఈ మాట అంటూనే వాడు మైకం వచ్చి గొడ్డులా పడిపోయి నిద్రపోసాగాడు.

రూపధరుడు పేడకుప్పలోనుంచి కర్రను తీసి దాని కొనను నిప్పులలో పెట్టి, తన అనుచరులకు ధైర్యం రాగలందులకు

తరవాత మరి ఇద్దరు గ్రీకులను పట్టుకుని చంపి తిన్నాడు.

ఈలోపుగా రూపధరుడు ఒక కొయ్యపాత్రలో తనవద్ద వున్న సారా నింపి, దాన్ని పట్టుకుని రాక్షసుణ్ణి సమీపించి, అతడితో ఈ విధంగా అన్నాడు:

"ఫాలలోచనా, ఇందు, ఈ సారాయి రుచిచూడు. నీకు నరమాంసం రుచి తెలుసు గాని సారా రుచి తెలియదు. ఈ దివ్యమైన సారాయిని నీకోసం తెచ్చాను. కాని నువు చాలా చెడ్డవాడివి. మామీద నీకు కాస్త అయినా కనికరం లేదు. ఇలా ప్రవర్తించినట్టయితే ఎవరైనా నిన్ను చూడ వస్తారా?"





ప్రోత్సాహ వచనాలు చెప్పాడు. కొద్దిసేపట్లో కర్ర కొన ఎర్రగా కాలింది. రూపధరుడి అనుచరులు మొండి ధైర్యం తెచ్చుకున్నారు. వారి సహాయంతో రూపధరుడు ఆ కర్రను రాక్షసుడున్న చోటికి తీసుకుపోయి, ఎర్రగా కాలే దాని కొనను రాక్షసుడి కంట్లో బలంగా గుచ్చేశాడు.

గుహ యావత్తూ దద్దరిల్లే పెడబొబ్బతో రాక్షసుడు లేచాడు. వాడు తన కంట్లో గుచ్చుకునివున్న కర్రను ఊడబెరికి దూరంగా పారేసి, ఇతర ఫాలలోచనుల కోసం కేకలు పెట్టసాగాడు. ఆ పరిసరాలలో ఉన్న గుహలలో నివసించే రాక్షసులు వాడి పెడబొబ్బలు విని పరిగెత్తుకుంటూ వచ్చారు. వాళ్లు గుహ బయటినుంచి, "ఏం జరిగింది? ఎందుకలా రంకెలు పెట్టి, అర్ధరాత్రివేళ మా నిద్రను చెడగొట్టుతున్నావు? ఎవరన్నా నీ మందలను ఎత్తుకుపోయారా? ఎవరన్నా నిన్ను బలంతోగాని, యుక్తితోగాని చంపుతున్నారా?" అని అడిగారు.

"అవునవును. నన్ను ఉత్తుత్త మనిషి యుక్తితో చంపుతున్నాడు," అన్నాడు గుహలో వున్న రాక్షసుడు.

"ఉత్తుత్త మనిషి చంపటమేమిటి? వెర్రివేషాలు వెయ్యక పడుకో. ఒంట్లో



సరిగా లేకపోతే తెల్లారే లోపల అదే సర్దుకుంటుంది!" అంటూ మిగిలిన ఫాలలోచనులు తమ దారిన తాము వెళ్లిపోయారు.

ఆ తరవాత గుహలో ఉండే రాక్షసుడు, చూడటానికి కన్ను లేదుగనక, తడువుకుంటూ గుహ ద్వారంవద్దకు వెళ్ళి, ఆ ద్వారానికి అడ్డంగా వున్న రాతిని ఎత్తి పక్కన పెట్టి, ద్వారానికి అడ్డంగా తిష్ఠవేసి, కావలి కూచున్నాడు.

గ్రీకులు బయటికి వెళ్ళటానికి యత్నిస్తే పట్టుకుందామని వాడి ఉద్దేశం.

కాని రూపధరుడు వాడనుకున్నంత అమాయకుడు కాడు. ఈ గుహలోనుంచి







రాక్షసుడి గుహలో వున్న గొర్రెలన్నిటిలోకీ పెద్దదైన ఒక పోతును తనకుగాను అతను ప్రత్యేకించుకున్నాడు.

కొంతసేపటికి తెల్లవారిపోయింది. గొర్రెలూ, మేకలూ మేతకోసం బయలుదేరాయి. గుహద్వారంలో కూచుని ఇంకా బాధతో మూలుగుతున్న రాక్షసుడు, బయటికి వెళ్ళే తన గొర్రెలనూ, మేకలనూ వీపులమీద తడవసాగాడు.

తన శత్రువులు వాటి అడుగున ఉంటారని ఆ మూఢుడుకి తట్టలేదు.

తన అనుచరులంతా దాటి వెళ్లాక, రూపధరుడు తనకోసం ప్రత్యేకించుకున్న గొర్రె అడుగుభాగాన, దాని బొచ్చును గట్టిగా పట్టుకునివుండి, దానితోబాటు బయటికి వచ్చాడు. ద్వారంవద్ద రాక్షసుడు ఆ గొర్రె పొటేలునుకూడా వీపుమీద తడివి, "రోజూ అన్నిటికన్న ముందు వెళ్ళేదానివి, ఇవాళ అన్నిటికన్న వెనకపడ్డావేమే, సోమరిపోతా? దుర్మార్గుడైన ఉత్తుత్త మనిషి నీ యజమానిని తప్పతాగించి, కన్నుపొడిచి గుడ్డివాణ్ణి చేశాడన్న విచారంతో కుంగిపోతున్నావా? వాణ్ణి తగిన విధంగా నేను శిక్షిస్తాలే! దిగులుపడకు!" అంటూ దానిని బయటికి వెళ్ళిపోనిచ్చాడు.

తానూ, తన అనుచరులూ బయటపడటానికి అనేక మార్గాలను అతను అదివరకే ఆలోచించిపెట్టాడు. వాటన్నిటిలోకీ అతనికి ఒక పద్ధతి ఉత్తమంగా కనిపించింది.

అదేమిటంటే: ఈ రాక్షసుడి గొర్రెలు తెగబలిసి, చాలా పెద్దవిగా వున్నాయి. వాటి ఒంటిమీద బొచ్చుకూడా బాగా పెరిగివున్నది. రూపధరుడు మూడేసి గొర్రెలను కలిపి కట్టి, మధ్యగొర్రె పొట్టకు తన అనుచరుణ్ణి ఒకొక్కక్కణ్ణి చొప్పున కట్టాడు. ఈ విధంగా తన మిగిలిన అనుచరులలో ఒకొక్కక్కడి కోసమూ మూడేసి గొర్రెలు ఏర్పాటుచేసి చిట్టచివరకు తాను ఒక్కడూ మిగిలాడు.







గొర్రెపోతు గుహ దాటి కొంత దూరం వెళ్లాక రూపధరుడు దాని జూలును వదిలి పెట్టి లేచి నిలబడ్డాడు. తరవాత అతను తన అనుచరులను ఒక్కొక్కరినే కట్లు విప్పి గొర్రెలనుంచి విడిపించాడు. ఈవిధంగా రూపధరుడి చాకచక్యంవల్ల రాక్షసుడి వాత పడకుండా ప్రాణాలతో బయటపడిన గ్రీకులు వేగంగా పరిగెత్తి తీరాన తమకోసం వేచి వున్న నౌకను చేరుకున్నారు.

రూపధరుడూ, మిగిలిన పన్నెండుమందీ ఏమైపోయారో అని ఆందోళన చెందుతూ నౌకలో కనిపెట్టుకునివున్న వారు, జరిగిన సంగతి తెలుసుకుని, రాక్షసుడికి ఆహారమై పోయిన తమ అనుచరులకోసం పెద్దపెట్టున శోకాలు పెట్టసాగారు.

రూపధరుడు వారి శోకాన్ని వారించుతూ, "ఇది శోకించటానికి సమయంకాదు. మనకు వ్యవధి లేదు. అందినన్ని గొర్రెలనూ, మేక లనూ పట్టుకు రండి. మనం బయలుదేరి పోదాం!" అన్నాడు. రూపధరుడి అనుచ రులు అలాగే చేసి నౌకను సముద్రంమీదికి తీసుకు పోసాగారు.

నౌక తీరంవదిలి కొంత దూరం వెళ్లింది. అప్పుడు రూపధరుడు రాక్షసుడి గుహకేసి తిరిగి ఎలుగెత్తి ఇలా కేక పెట్టాడు:

"ఓరీ పాపాత్ముడా! ఫాలలోచనా! నేనూ నా అనుచరులూ, సులువుగా నీకు లొంగుతామనుకున్నావురా? అతిథులను చంపి తిన్నందుకు నీకు తగిన శాస్తి జరి గింది! ఇకనైనా బుద్ధి తెచ్చుకోరా!"

ఈ కేక రాక్షసుడికి వినిపించింది. వాడు కోపావేశంతో ఒక పెద్ద కొండరాయిని, మట్టి పెళ్లను విరిచినట్టు విరిచి, రూపధరుడి గొంతు వినిపించిన దిక్కుగా విసిరాడు. ఈ రాయి రూపధరుడి నౌకకంటె దూరంగా వెళ్లి పడింది. అది పడిన చోట బ్రహ్మాండ మైన అల బయలుదేరి, రూపధరుడి నౌకను మళ్లీ తీరానికేసి తోసుకురాసాగింది.



రూపధరుడు అదుర్దాగా గడవేసి నౌకను మళ్లీ సముద్రంవేపు తోస్తూ, తెడ్లు జోరుగా వెయ్యమని తన అనుచరులకు కళ్లతో సైగ చేశాడు. ఈసారి నౌక పూర్వం కన్న రెట్టింపు దూరం వెళ్లాక రూపధరుడు మళ్ళీ రాక్షసుణ్ణి కవ్వించటానికి ఉపక్రమించాడు. ఊరుకోమని అతని అనుచరులు ఎంతగానో ప్రాధేయపడ్డారు; కాని అతను వారి మాట లక్ష్యపెట్టక ఎలుగెత్తి ఈ విధంగా అన్నాడు:

"ఓరీ రాక్షసాధమా! నీ కన్ను పోగొట్టిన దెవరని ఎవరైనా అడిగితే, ఆ పని చేసినవాడు రూపధరుడని చెప్పు! వాడు ట్రోయ్‌ని జయించిన వీరుడని చెప్పు! వాడిది ఇథకాదేశమని చెప్పు!"

ఈసారి రాక్షసుడు మరొక పెద్ద కొండ రాయి విరిచి తన బలంకొద్దీ గురిగా విసిరాడు. అది రూపధరుడి నౌకకు చాలా సమీపంగా వచ్చి పడింది. అయితే ఈసారి దానినుంచి బయలుదేరిన అల రూపధరుడి నౌకను తీరానికి మరింత దూరంగా తీసుకు పోయింది.

త్వరలోనే రూపధరుడూ అతని అనుచరులూ మిగిలిన నౌకలను చేరుకున్నారు. ఆ నౌకలలో వుండిన గ్రీకులు తమ అనుచరుల క్షేమంకోసం ఎంతో బెంగపడి వున్నారు. వారికిప్పుడు పరమానందం కలిగింది. కాని రాక్షసుడికి ఆహారమైపోయిన వారికోసం వారంతా దుఃఖించారు.

తరవాత రూపధరుడు తెచ్చిన గొర్రెలను చంపి అందరూ సమంగా పంచుకుని తిని, ఉత్సాహంగా సారా తాగి గ్రీకులు పగలల్లా వెళ్ళబుచ్చి, ఆ రాత్రికి తీరానే పడుకుని నిద్రపోయారు. మర్నాడు తెల్లవారుతూనే రూపధరుడు, నౌకలన్నీ లంగరు ఎత్తి ప్రయాణం సాగించవలిసిందిగా ఉత్తరు విచ్చాడు. అవన్నీ సముద్రంమీద మళ్ళీ బయలుదేరాయి. (ఇంకా వుంది)






## 3

[ట్రోయ్‌నుంచి ఇంటికి బయలుదేరిన రూపధరుడు తుఫానులో చిక్కుకుని ఫాలలోచనులనే ఒంటికంటి రాక్షసులుండే దీవికి చేరుకున్నాడు. అతను పన్నెండుమంది అనుచరులతో సహా ఒక ఫాలలోచనుడి గుహలో చిక్కుకుపోయాడు. ఆ రాక్షసుడు అతని అనుచరులలో కొందరిని చంపి తినేశాడు. చిట్టచివరకు రూపధరుడు తన యుక్తి చేత ఆ రాక్షసుడి కన్ను పొడిచి, తన అనుచరులతో సహా బయటపడ్డాడు. తరవాత అతని నౌకలు ఆ దీవిని వదిలి ప్రయాణం సాగించాయి.]

రూపధరుడి నౌకలు త్వరలోనే నౌకా ద్వీపాన్ని చేరుకున్నాయి. ఈ ద్వీపం సముద్రంపైన తేలి ఉంటుందని ప్రతీతి. దీనిపైన ఒక అభేద్యమైన కంచుకోట ఉన్నది. ఈ కోటలో ఏలే రాజుపేరు చిత్రాశ్వుడు. దిక్పాలకులు ఈయనకు మిత్రులు. ఈయనకు ఆరుగురు కుమారులూ, ఆరుగురు కుమార్తెలూ ఉన్నారు.

ఈ చిత్రాశ్వుడు రూపధరుడికీ, అతని అనుచరులకూ స్వాగతమిచ్చి వారిని ఒక మాసంపాటు తన అతిథులుగా ఉంచుకున్నాడు. ట్రోయ్‌యుద్ధం గురించీ, ఆ యుద్ధంలో విజయం పొందిన గ్రీకువీరులను గురించీ ఆయన రూపధరుడిద్వారా విపులంగా తెలుసుకున్నాడు. మాసం రోజులూ ఇలాగే గడిచిపోయాయి.





దిగ్బంధంచేసి, ఆ తిత్తిని రూపధరుడి కిస్తూ, "నాయనా, నీ పడవలను సురక్షితంగా మీదేశం చేర్చటానికి ఉపయోగపడే ఒక్క మారుతాన్ని మాత్రం విడిచిపెట్టి, మిగిలినవాటిని ఈ తిత్తిలో ఉంచాను. అందుచేత నీ ప్రయాణం సూటిగా సాగుతుంది. ఇంటికి చేరినదాకా ఈ తిత్తిలో ఉండే మారుతాలు పైకి రాకుండా కాపాడుకుంటే చాలు, నీకు ఎట్టిఆపదా జరగదు!" అని చెప్పాడు.

రూపధరుడు ఆయనకు కృతజ్ఞత తెలుపుకుని, మారుతాలు గల తిత్తిని తన వద్దనే ఉంచుకుని, తన అనుచరులతో సహా నౌకలలో బయలుదేరాడు. చిత్రాశ్వుడు చెప్పినదంతా అక్షరాలా జరిగింది తొమ్మిదిపగళ్లూ, తొమ్మిదిరాత్రులూ అగకుండా ప్రయాణం జరిగింది. పదవనాటి ఉదయం సముద్రంమీద ఇథకాతీరం కనిపించింది. ఆ తీరాన గల చలిమంటలను కూడా రూపధరుడు పోల్చగలిగాడు.

తిరిగి స్వదేశం కళ్లబడగానే రూపధరుడికీ, అతని అనుచరులకూ కలిగిన ఆనందానికి మేరలేదు. ఇంక కొద్ది గడియలలో నౌకలు తీరాన్ని చేరుకుంటాయి ఆ తరవాత ఎవరి ఇళ్లలో వారుంటారు!

చివరకు ఒకనాడు రూపధరుడు చిత్రాశ్వుడితో, "మేము ఇంకెంత కాలం మీకు అతిథులుగా ఉండం? మాకు సెలవిప్పించండి. అంతేకాదు, మా ప్రయాణం సక్రమంగా సాగగలందులకు మీరు చేతనైన సహాయం యావత్తూ చేయాలి. మేమిప్పటికే సముద్రాలమీద చాలా కష్టాలు పడి ఉన్నాం," అన్నాడు.

చిత్రాశ్వుడిందుకు ఒప్పుకున్నాడు. వాయుదేవుడి వరంవల్ల ఈ చిత్రాశ్వుడికి సప్తమారుతాలూ లోబడి ఉంటాయి. అందుచేత అయన ఒక్క మారుతాన్ని తప్ప మిగిలిన ఆరు మారుతాలనూ ఒక తోలుతిత్తిలో








నౌకాద్వీపాన్ని వదిలాక రూపధరుడు కన్నుమూసి ఎరగడు. మారుతాలు గల తిత్తిని భద్రంగా తన చేతుల్లోనే ఉంచుకుని, తొమ్మిదిరోజులూ కాపాడాడు. "ఇంక ఇంటికి చేరినట్టే!" అన్న ధిలాసా మనసుకు తోచేసరికి, అతనికి ఎక్కడలేని నిద్రా ముంచుకువచ్చింది. తమ నౌకలు అన్నీ తీరాన్ని చేరేలోపుగా కొంచెంసేపుపాటు ఒక్క కునుకు తీద్దామనుకుని రూపధరుడు నడుమువాల్చాడు.

అతను కన్నుమూశాడో లేదో, అవెంటనే అతని అనుచరులలో గుసగుసలు బయలు దేరాయి.

"ఆ తిత్తిలో ఏముంటుందంటావు?" అన్నాడొకడు.

"ఇంకేముంటుంది? బంగారమూ, రకరకాల బహుమానాలూనూ!" అన్నాడు ఇంకొకడు.

"ఈ రూపధరుడికి అందరూ స్నేహితులే! అందరూ బహుమానాలిచ్చేవారే! మన మొహాల నేమీ లేదు," అన్నాడు మూడోవాడు.

"అది కాదురా! ఈయనగారితోబాటు మనమూ పదేళ్లపాటు ఇల్లూవాకిలీ వదిలి, పెళ్లాంబిడ్డలకు దూరమై, యుద్ధంచేశాం గదా, అక్కడ దోచుకున్నదాన్లో ఎంతవంతు తీసుకుని ఇంటికి వస్తున్నాడో చూడు! మనమేమో వట్టిచేతులతో వస్తున్నాం! ఆ దోపిడీ చాలక ఈయనకు దారిపొడుగునా బహుమానాలు కూడానూ!" అన్నాడు నాలుగోవాడు.

"అసలా తిత్తిలో ఏముందో చూద్దాం రా!" అన్నాడు అయిదోవాడు.

ఇందుకు అందరూ సరేనంటే సరే నన్నారు. తిత్తి మూతి వెండితీగెతో చాలా గట్టిగా బిగించి ఉంది. రూపధరుడి అనుచరులు ఎంతో కష్టపడి ఆ తీగెను ఒక్కొక్క చుట్టే ఊడదీశారు.



అంతలోనే ఆ తిత్తి మూతినుంచి కాల వాయువులు భయంకరమైన వేగంతో, చప్పుడుతో బయటికి వచ్చేశాయి. ఆ గాలుల ధాటికి పడవలన్నీ భయంకరంగా ఊగిసలాడిపోయాయి. పడవల్లో ఉండే వాళ్లు చెట్లు విరిగిపడ్డట్టు పడిపోయి, మొహాలు చేతులతో కప్పుకున్నారు.

ఈ ప్రళయఘోషకు రూపధరుడు నిద్ర లేచాడు. కాని అతను కళ్లు తెరవలేక పోయినాడు, ఏమి జరుగుతున్నదీ చూడలేక పోయినాడు. ఈ ఝంఝామారుతం ఉధృతం తగ్గిపోయేసరికి రూపధరుడి నౌకలు తిరిగి నౌకాద్వీపతీరాన్ని మరొకసారి చేరుకున్నాయి. రూపధరుడి అనుచరులు, కళ్లకు కనిపించిన మాతృదేశం మళ్లీ దూరమైపోయినందుకు పెద్దపెట్టున ఏడ్చారు. ఇక రూపధరుడి నిస్పృహ చెప్ప నలవికాదు.

కాని ఏడ్చి లాభంలేదు, జరగవలిసిన పొరపాటు జరిగే పోయింది. రూపధరుడూ అతని అనుచరులూ మంచినీరు చేరవేసుకుని, వంటలు చేసుకుని తిన్నారు. తరవాత రూపధరుడు తనవెంట మరి ఇద్దరిని తీసుకుని చిత్రాశ్వుడివద్దకు వెళ్లాడు.

అయన ఆశ్చర్యంతో, "నువ్వు బయలుదేరి నీ దేశానికి వెళ్లటానికి తగిన సహాయం



నేను చేస్తినిగదా, మళ్ళీ ఇలా వచ్చావేమిటి?" అని అడిగాడు.

"మహారాజా, ఏం చెప్పను? బుద్ధి పొరపాటున క్షణంసేపు కన్ను మూశాను. వెంటనే మూర్ఖులు, నా అనుచరులు, తిత్తి విప్పి మారుతాలను వదిలిపెట్టారు. మీరు శక్తిమంతులు, నాకు మళ్ళీ సహాయపడి పుణ్యం కట్టుకోండి!" అన్నాడు రూపధరుడు.

"ఛీ, పాపీ! తక్షణం నా ద్వీపాన్ని వదిలి వెళ్లిపో! దేవతలు నీమీద కత్తికట్టారు! అలాటివాడికి నేను ఎంతమాత్రమూ సహాయపడలేను!" అని చిత్రాశ్వుడు రూపధరుణ్ణి నిర్దయగా తరిమేశాడు. రూపధరుడు ఎంత బతిమాలికూడా ఏమీ లాభం లేకపోయింది.

నౌకలు తిరిగి ప్రయాణం సాగించాయి. కాని ఎవరిలోనూ కొంచెంకూడా ఉత్సాహం లేదు. గాలి సహాయం కొంచెంకూడా లేని కారణంచేత నావికులు చేతులు పడిపోయేలాగ తెడ్లు వేయవలసివచ్చింది.

విరామం అన్నది లేకుండా ఆరు రోజులపాటు రాత్రిం బగళ్లు సముద్రం మీద ప్రయాణంచేసి రూపధరుడి బృందం చివరకు ఒక విచిత్రమైన తీరాన్ని చేరారు. ఇది ఉత్తరధృవ ప్రాంతం. ఇక్కడ





పడవను మాత్రం బయటి తీరానే గల కొండరాళ్లకు కట్టిపెట్టాడు.

ఆ తరవాత అతను తన సమీపానే వున్న ఒక శిఖరం ఎక్కి చుట్టూ కలయచూశాడు. కనుచూపుమేరలో ఎక్కడా పచ్చికగాని, ఒక చెట్టుగాని అతనికి కనబడలేదు. కాని చాలా దూరాన ఆకాశంలోకి పొగలేస్తూం డటం అతనికి కనిపించింది. ఆ ప్రాంతాల ఎవరో మనుషులుంటున్నట్టు స్పష్టం కావటంవల్ల అతను తన అనుచరులలో ముగ్గురిని పంపుతూ, "మీరు ఆ పొగ కని పించే దిక్కుగా వెళ్లి ఇక్కడ ఎటువంటి మనుషులు నివసిస్తున్నారో తెలుసుకు రండి!" అన్నాడు.

వారు కొంత దూరం వెళ్ళేసరికి ఒక బళ్లదారిలాటిది కనిపించింది. దానివెంబడే వెళ్ళగా కొన్ని ఇళ్లు వచ్చాయి. ఈ ఇళ్ళకు ఇవతలగా ఒక పిల్ల సెలయేట్లో నీరు తీసు కుంటూ వారి కంటపడింది. "ఈ ఊరికి రాజెవరు? ఆయన ఉండే ఇల్లేది? మేము ఆయనను కలుసుకోవాలి," అని రూపధరుడి అనుచరులా పిల్ల నడిగారు. ఆమె వారి ప్రశ్నకు సమాధానంగా, అంత దూరాన కనిపించే ఒక ఎత్తయిన ఇంటి కప్పు చూపింది.

మాసాలతరబడి పగలుంటుంది. సూర్యుడు అస్తమించిన కాస్సేపటికే మళ్లీ ఉద యిస్తాడు; ఎక్కడ అస్తమిస్తాడో, మళ్లీ ఎక్కడ ఉదయిస్తాడో కొత్తవాళ్లు ఊహిం చనుకూడాలేరు.

రూపధరుడి నౌకలు తీరాన్ని తాకిన చోట దగ్గిర దగ్గిరగా రెండు కొండ శిఖరా లున్నాయి. వీటి మధ్యగా ఒక్క పడవ మాత్రమే పోయే వీలున్నది. కాని వాటి సందుగా వెళితే అవతల సముద్రం సరస్సు ఆకారంలో విశాలంగా వున్నది. అది పడవ లకు మంచి రేవుకూడానూ. మిగిలిన పడవ లను రేవులోకి పోనిచ్చి రూపధరుడు తన

వారా ఇంటికి వెళ్లి లోపల అడుగు పెట్టేసరికి ఎదురుగా ఒక రాక్షసిలాటి స్త్రీ కనిపించింది. ఆమెను చూస్తేనే వారికి వికారం కలిగింది.

ఆ స్త్రీ అప్పటికప్పుడే ఎవరినో పంపి తన భర్తను పిలిపించింది. వాడు వస్తూనే రూపధరుడి అనుచరులలో ఒకణ్ణి పట్టుకుని నేలకేసి కొట్టి చంపి వంటఇంటోకి గిరవాటు వేశాడు. ఇది చూసి మిగిలిన ఇద్దరూ అక్కడినించి కంగారెత్తి పారిపోయి తమ నౌకలను చేరుకున్నారు.

అయితే ఈలోపునే ఆ రాక్షసుడు వీధిలోకి వచ్చి పెద్దపెట్టున సింహనాదం చేశాడు. అది వినగానే వేలకొద్దీ రాక్షసులు ఎక్కడెక్కడినుంచో పరిగెత్తుకుంటూ వచ్చి రేవు చుట్టూ ఉండే కొండలమీదినుంచి రేవులో వున్న పడవలమీదికి రాళ్ళు రువ్వసాగారు. ఆ రాళ్ళు మనిషి కష్టంతో ఎత్తగలిగినంత బరువున్నాయి.

రేవులో వున్న పడవలన్నీ భగ్నమయాయి. రూపధరుడి అనుచరులు రాళ్ళ కిందపడి పోయారు. ఆ రాక్షసులు కేకలుపెడుతూ వారిని తమ ఈటెలకు గుచ్చి ఎత్తి ఇళ్ళకు పట్టుకుపోయారు.

రేవులో జరుగుతున్న దారుణ హత్యాకాండను గమనించి ప్రమాదం తెలుసుకుని రూపధరుడు తన పడవ తాళ్ళను కత్తితో కోసి, ఆ పడవలో ఉన్నవాళ్ళతో, "తెడ్లు వెయ్యండి! బలంకొద్దీ వెయ్యండి! లేకపోతే ప్రాణాలు దక్కవు!" అని బిగ్గరగా అరిచాడు.

వాళ్లుకూడా ఎక్కడలేని సత్తువా తెచ్చుకుని తెడ్లువేసి పడవను సముద్రంమీద తోసుకు పోయారు. ఆ నౌక తప్ప రూపధరుడి మిగిలిన నౌకలన్నీ నాశనమయాయి; వాటిలో ఉన్న గ్రీకులందరూ ఘోర మరణం పాలయారు.

(ఇంకా వుంది)






## 4

[ఫాలలోచనుడనే రాక్షసుడి బారినుండి తప్పించుకున్న రూపధరుడూ, అతని అనుచరులూ నౌకాద్వీపాన్ని చేరి, ఆద్వీపాన్ని ఏలే చిత్రాశ్వుడినుంచి గొప్ప సహాయం పొందారు. ఆయన వారికి మారుతాలన్నిటినీ ఒక తిత్తిలో బంధించి ఇచ్చాడు. రూపధరుడి నౌకలు దాదాపు స్వదేశాన్ని చేరాయి. ఆఖరుక్షణంలో రూపధరుడి అనుచరులు తిత్తిని విప్పి మారుతాలను పైకి రానిచ్చారు. వాటి ప్రభావంచేత రూపధరుడి నౌకలు ధృవప్రాంతానికి కొట్టుకుపోయాయి. అక్కడ ఉండే రాక్షసులు రూపధరుడి అనుచరులనూ, నౌకలనూ సర్వనాశనం చేశారు. రూపధరుడున్న నౌకమాత్రమే వారిపాల పడకుండా తప్పించుకున్నది.]

రూపధరుడు తన మిగిలిన అనుచరులతో బయలుదేరాడు. మృత్యువువాత పడకుండా తప్పించుకున్నందుకు అతనికి ఆనందంతో పాటు, తన మిగిలిన నౌకలూ, వాటిలో వున్న అనుచరులు చాలామంది నాశనమయినందుకు విచారం కూడా కలిగింది.

కొంతకాలానికి రూపధరుడి నౌక ఒక ధీవిని చేరింది. ఈ దీవిపై సుకేశిని అనే ఒక దేవత ఉంటున్నది. ఈమె జుట్టు చాలా అందంగా ఉంటుంది. ఈమె సూర్యుడికీ, వరుణరాజు కుమార్తెకూ పుట్టినది. మనుషుల భాష మాట్లాడుతుంది, కాని ఈమె మనుషులకు మంచి చేసే స్వభావం కలది కాదు.

రూపధరుడి కీమె సంగతులేవి తెలియవు. అతను తన నౌకను తీరాన, రేవుగా ఉన్న





ఉన్న ఇంట్లో ఎవరు నివసిస్తున్నారో కనుక్కుందామనుకున్నాడు. కాని, అంతకంటే తాను తన నౌకవద్దకు తిరిగి వెళ్ళి, అందరూ భోజనం చేసినాక, తన మనుషులను పంపి ఆరా తెలుసుకోవటం మంచిదని అతనికి తోచింది.

కాని భోజనం చెయ్యటానికికూడా ఆహారం లేదు. ఈ విషయం ఆలోచిస్తూ రూపధరుడు తన నౌకకేసి పోతూండగా, ఏ దేవుడో పంపినట్టుగా ఒక దుప్పి అతని దారికి అడ్డంగా వచ్చింది. దాని కొమ్ములు చాలా నిడుపుగా వున్నాయి. ఎండ బాగా కాస్తూండటంవల్ల, సమీపంలో ఉన్న నదిలో దప్పి తీర్చుకోవటానికి అది పోతున్నది.

రూపధరుడు ఆ దుప్పిని సమీపించి తన ఈటెను బలంగా దాని వెన్నులోకి పొడిచాడు. ఆ దెబ్బతో అది కింద పడి, మూలిగి, ప్రాణాలు వదిలింది. రూపధరుడు కొన్ని లతలను పేని తాడులాగా చేసి, ఆ తాడుతో దుప్పి కాళ్ళను బంధించి, తాటిని తన మెడకు తగిలించి, దుప్పిని వీపున మోస్తూ, ముందుకు వంగబడి నడుస్తూ తన నౌక వద్దకు వెళ్ళాడు. ఇలా ఎందుకు చేయవలిసి వచ్చిందంటే, భుజాన వేసుకుపోవటానికా దుప్పి చాలా భారీ అయినది.

చోట కట్టేయించి రెండు పగళ్లూ, రెండు రాత్రులూ తన అనుచరులతో అక్కడే గడిపాడు. ఈ రెండురోజులపాటు గ్రీకులు నిరుత్సాహంలో మునిగిపోయి, నిరాశతో కుంగిపోయారు.

మూడోరోజు తూర్పు తెల్లవారే సమయాన రూపధరుడు తన కత్తీ, ఈటె తీసుకుని, ఒక ఎత్తయిన మిట్ట ఎక్కి చుట్టూ కలయజూశాడు. అతనికి ఎవరూ కనిపించలేదు గాని, దూరాన చెట్లమధ్య నున్న సుకేశిని ఇంటినుంచి పొగ ఆకాశంలోకి లేస్తూ ఉండటం కనబడింది. మొట్టమొదట రూపధరుడు తానే స్వయంగా వెళ్ళి, ఆ చెట్లమధ్య







అతను తాను కొట్టిన దుప్పిని పడవ ముందు పడేసి, తన అనుచరులకు ఉత్సాహం కలిగించే కబుర్లు ప్రారంభించాడు: "మిత్రులారా, మనం ఇంతలో చచ్చిపోయేవాళ్లం కాము. మనకోసం యమలోకం ఇంకా చాలాకాలం కాచుకుని వుంటుంది. ఆహారం వుండగా మనం తిండి మాన నవసరంలేదు. మనం ఆకలికి మాడి చచ్చే ఘడియ ఇంకా రాలేదు!"

ఈ మాటలు వినగానే గ్రీకులకు చైతన్యం వచ్చినట్టయింది. వాళ్లు తమ ముఖాలకు అడ్డం పెట్టుకుని వుండిన బట్టలు తొలగించి, లేచి నిలబడి, రూపధరుడు తెచ్చిన దుప్పికేసి చూశారు. వాళ్లు చేతులు కడుక్కుని దుప్పిని వండటానికి ఉపక్రమించారు. చీకటి పడేవరకూ వారు తింటూ, తాగుతూ గడిపి, ఆ రాత్రికూడా తీరానే పడుకుని నిద్రపోయారు.

మర్నాడు తెల్లవారుతూనే రూపధరుడు తన అనుచరులను సమావేశపరిచి వారితో ఇలా అన్నాడు:

"మిత్రులారా, మనకీ ప్రదేశం కొత్త. తూర్పేదో, పడమర ఏదోకూడా తెలియదు. అలాటప్పుడు మనం ఏం చెయ్యాలి? నా మటుకు నాకేమీ పాలుపోవటంలేదు. కాని చేతులు కట్టుకు కూచోలేం; ఏదో ఒకటి చెయ్యాలి. నేను ఈ సమీపంలో వున్న మిట్ట ఎక్కి చూశాను. ఇదొక లంక. కనుచూపుమేరలో ఎక్కడా మరొక తీరమన్నది నాకు కనిపించలేదు. ఈ లంక చూడబోతే ఇందులో కొండలూ గుట్టలూ అటే లేవు. లంకమధ్య చెట్లతోనూ, పొదలతోనూ కూడిన తోపు ఒకటి కనిపిస్తున్నది. దానిమధ్య ఎవరో వున్నారు. ఎందుచేతనంటే ఆ తోపు నుంచి ఆకాశంలోకి పొగ లేవటం నాకు కనిపించింది!"

ఈ మాటలు వినగానే రూపధరుడి అనుచరుల గుండెలు చల్లబడ్డాయి. ఇలాటి పరి





స్థితిలోనే వారు ఒకసారి ఘాలలోచనుల వాతా, మరొకసారి నరభక్షకులైన రాక్షసుల వాతా పడిఉన్నారు. వారు దుఃఖం ఆపుకో లేక కడపలుగా కన్నీరు కార్చసాగారు.

తరువాత రూపధరుడు తన అనుచరులను రెండు ముఠాలుగా విభజించాడు. ఒక ముఠాకు తాను నాయకుడుగా ఉండి, రెండవ ముఠాకు మాయావి అనే సాహసవంతుణ్ణి నాయకుడుగా పెట్టాడు. తోపులో ఉంటున్నదెవరో చూసి రావటానికి ఏముఠా వెళ్లాలనేది నిర్ణయించటానికి రూపధరుడూ మాయావి వంతులు వేసుకున్నారు. వంతు మాయావిదయింది. వెంటనే మాయావి తన



ఇరవైఇద్దరు మనుషులనూ వెంటబెట్టుకుని గొణుగుతూ, సణుగుతూ బయలుదేరాడు.

కొంతదూరం వెళ్లగా అతనికి ఒక పల్లపు ప్రదేశంలో సుకేశిని ఉండే ఇల్లు కనిపించింది. అది చెక్కుడురాళ్లతో అందంగా కట్టి ఉన్నది. దానిచుట్టూ ఖాళీస్తలం ఉన్నది. ఇంటిచుట్టూ తోడేళ్ళూ, సింహాలూ మొదలైన అడివిజంతువులు ఉన్నాయి. ఇవన్నీ నిజంగా జంతువులు కావు, మనుషులే. సుకేశిని మనుషులకు మందులూ, మాకులూ పెట్టి జంతువులుగా మార్చివేసింది. అందుచేత ఆ జంతువులు మాయావి ముఠామీద విరుచుకుపడటానికి మారుగా, కుక్కల్లా గా తోకలాడిస్తూ ఆపేక్షగా వారిదగ్గిరికి వచ్చాయి. కాని వాటి రహస్యం తెలియని గ్రీకులు ఆ మృగాలను చూసి బెదిరిపోయారు.

వారు ఇంటిని సమీపించక తలవాకిలికి వెలపలనే నిలబడి ఆలకించారు. ఇంటిలో మగ్గం నేస్తూ సుకేశిని శ్రావ్యంగా పాడుకుంటూ ఉండటం వారి చెవుల పడింది. వారిలో ఒకడు, "మిత్రులారా, లోపల ఎవరో స్త్రీ మహచక్కగా పాడుతున్నది. అయితే మనిషి కావాలి, లేకపోతే దేవత కావాలి. ఆవిడతో మాట్లాడదాం! సందేహం దేనికి?" అన్నాడు.







వెంటనే అందరూ గొంతులెత్తి లోపల ఉన్న స్త్రీని పిలిచారు. సుకేశిని బయటికి వచ్చి, వచ్చినవారిని చూసి, లోపలికి రమ్మని ఆహ్వానించింది. వారు ఆమెవెంట అమాయికంగా లోపలికి వెళ్ళారు. మాయావి మాత్రం సుకేశినిని చూడగానే ఏదో మోసం పసికట్టాడు. అందుచేత అతను బయటనే ఉండిపోయాడు.

తనవెంట లోపలికి వచ్చిన వారందరికీ సుకేశిని రుచి అయిన ఆహారపదార్థాలూ, పానీయాలూ వడ్డించింది. అయితే ఆ పదార్థాలలో ఆమె ఏవో మందులు కలిపింది. అందుచేత గ్రీకులు ఆ పదార్థాలు తింటూనే ప్రపంచాన్ని మరిచారు. తరవాత ఆమె తన మంత్రదండంతో ఒక్కొక్కరినే తాకింది. వెంటనే వారంతా పందుల రూపాలు ధరించి గోండ్రుపెట్టసాగారు. వారి రూపాలు పూర్తిగా మారిపోయాయి గాని, వారి మనసులు కొంచెంకూడా మారలేదు. సుకేశిని గ్రీకులను పందులమందగా మార్చేసి ఒక పందుల దొడ్డిలోకి తరిమేసింది. వారా బందిఖానాలో ఉండి పందులు తినే ఆహారమే తినసాగారు.

సుకేశిని మాయలో పడక తప్పించుకున్న మాయావిమటుకు ఒంటరిగా నౌక వద్దకు తిరిగివచ్చాడు. చాలాసేపు అతని నోట మాటే రాలేదు. అతని కంటివెంట అశ్రుధారలు కారుతున్నాయి. రూపధరుడు మొదలైనవారు ఎన్నో ప్రశ్నలు వేసినమీదట అతను తెప్పరిల్లి జరిగినది యావత్తూ వారికి తెలియజెప్పాడు.

"మీరు చెప్పిన ప్రకారమే మేము తోపు కేసి బయలుదేరి వెళ్ళాం. అక్కడ ఒక పల్లపు ప్రదేశంలో చక్కని రాతి ఇల్లు కనిపించింది. లోపల ఎవరో స్త్రీ మగ్గం నేస్తూ మనోహరంగా పాడటం వినిపించింది. మేము ఆమెను పిలిచాం. ఆమె వచ్చి అందరినీ లోపలికి తీసుకుపోయింది. ఏదో మోసం



ఉందని తోచి నేను బయటే ఉండి పోయాను. లోపలికి వెళ్లిన మనవారి జాడ మరిలేదు!"

రూపధరుడీ వార్త వింటూనే చివాలున లేచి తన పెద్దకత్తి—వెండి బుడిపెలు గల కంచుకత్తి—తీసుకుని, విల్లంబులు చేత బట్టి, "ఈ ఇంటికి దారి చూపింతువుగాని, నావెంట బయలుదేరు!" అన్నాడు. మాయావి రూపధరుడి కాళ్లు వాటేసుకుని, "నాయకా, నన్నక్కడికి రమ్మనకండి! మీకు వెయ్యి దణ్ణాలు! నేను అక్కడికి రాను, ఇక్కడేఉంటాను. మీరు తిరిగిరారు. నాకు తెలుసు! మీవెంట వచ్చానంటే నాపనీ అంతే



అవుతుంది. నాలుగు కాలాలపాటు మీరూ, నేనూ, మిగిలినవాళ్లమూ బతికివుండాలన్న కోరిక ఏమైనా ఉంటే, ఈ దిక్కుమాలిన చోటు వదలి వెళ్ళిపోదాం, పదండి!" అని ప్రాధేయపడ్డాడు.

"సరే, మాయావీ, నీయిష్టం! నువు పడవ వద్దనే ఉండి తిను, తాగు! నేను మాత్రం వెళతాను, వెళ్ళితీరాలి!" అన్నాడు రూపధరుడు.

అతను పల్లపు ప్రాంతానికి వచ్చి, దిగువగా వున్న సుకేశిని ఇల్లు చూసే సమయాన ఒక యువకుడు అతనికి ఎదురువస్తూ ఆగి, "పాపం, మళ్లీ ఎక్కడికి బయలుదేరుతున్నావు, నాయనా? ఆ కనిపించే ఇల్లు సుకేశినిది తెలుసా? నీ మనుషులందరూ అక్కడ పందుల రూపంలో నిర్బంధించబడి వున్నారు. నువుకూడా వారిని చేరబోతున్నావా?... అయినా భయంలేదు, నేను చెప్పినట్టు చెయ్యి. నీకొక మూలిక ఇస్తాను. సుకేశిని నీ పానీయంలో మందు కలిపి ఇస్తుంది. ఈ మూలిక ప్రభావంచేత ఆ మందు నీమీద పని చెయ్యదు. తరువాత నిన్ను ఆమె మంత్రదండంతో తాకుతుంది. నువు వెంటనే కత్తిదూసి, చంపబోయే వాడిలాగా ఆమెపైకి ఉరుకు. ఆమె భయ





పడిపోయి, నీకు భార్యగా ఉంటానంటుంది. దీనికి నువు ఒప్పుకోవచ్చు. కాని ముందుగా నువు ఆమెచేత దేవతలమీద ప్రమాణం చేయించి, నీకు ఎట్టి అపకారమూ చేయనని మాట తీసుకో," అంటూ ఆ యువకుడు నేలమీదినుంచి ఒక చిన్న మొక్క పీకి రూపధరుడి కిచ్చాడు. ఆ మొక్కవేరు నల్లగా వున్నది. కాని దాని పువ్వు స్వచ్ఛమైన తెలుపురంగులో ఉన్నది.

యువకుడు వెళ్ళిపోయాక రూపధరుడు దీర్ఘాలోచనలో మునిగిపోయి అడుగులో అడుగు వేసుకుంటూ సుకేశిని ఇల్లు చేరి, గట్టిగా కేక పెట్టాడు. వెంటనే సుకేశిని బయటికి వచ్చి తలుపు తెరిచింది. అతను ఆమెవెంట లోపలికి వెళ్లాడు. కాని అతని గుండె గుబగుబలాడుతూనే ఉంది.

ఆమె అతన్ని ఒక నగిషీ చేసిన కొయ్య కుర్చీలో కూర్చోబెట్టి, కాళ్లకింద పాదపీట పెట్టింది. తరవాత లోపలికి వెళ్లి, మందు కలిపిన పానీయం తెచ్చి అతని ముందు వుంచింది. రూపధరుడు దానిని తాగేశాడు గాని, మూలికా ప్రభావంవల్ల మందు అతని మీద పని చెయ్యలేదు.

సుకేశిని కీ సంగతి తెలియదు. ఆమె మంత్రదండంతో అతనిని తాకుతూ, "వెళ్లు,




పందుల కొట్టంలో ఉండే నీ అనుచరులను చేరు!" అన్నది.

వెంటనే రూపధరుడు కత్తిదూసి ఆమె పైకి లంఘించాడు. ఆమె భయంతో వణికిపోతూ, అతని కాళ్లు పట్టుకుని, "ఎవరు నీవు? ఈ విశాల ప్రపంచంలో ఏ ప్రాంతం నుంచి వస్తున్నావు? మీ నగరం పేరేమిటి? నీ తలిదండ్రు లెవరు? నా మందు నాలుకకు తగిలినాక కూడా మారకుండా ఉండటం మామూలు మనుషుల తరం కాదు. నువు రూపధరుడివై వుండాలి. రూపధరుడు నన్ను చూడవస్తాడని ముందుగానే దేవతలు నాతో అన్నారు. మనిద్దరికీ వైరం



పద్ధు. ఆ కత్తి అవతలపెట్టేసి నన్ను పెళ్లాడు. మనిద్దరమూ సఖ్యంగా వుందాం!" అన్నది.

"నా అనుచరులను పందులుగా మార్చేసి కొట్టంలో బంధించిన నీతో నాకు సఖ్యం ఎలా పొసగుతుంది? నన్నుకూడా పందిగా మార్చాలని ప్రయత్నించి, అది సాగకపోయే సరికి, నా భార్యనవుతా నంటావా? నాకు మరే అపకారమూ తలపెట్టనని ప్రమాణం చేస్తే నీతో సఖ్యంగా వుండటానికి నేను సమ్మతిస్తాను," అన్నాడు రూపధరుడు.

సుకేశిని ఆ ప్రకారమే ప్రమాణం చేసింది. తరవాత ఆమె పరిచారికలు రూపధరుడికి చక్కగా తలంటి స్నానం చేయించారు. అతనికీ, తమ యజమానురాలికీ భోజనం వడ్డించారు. కాని రూపధరుడు ఆ ఆహారాన్ని ముట్టలేదు.

"ఎందుకు సందేహిస్తున్నావు? మళ్లీ ఏదైనా మోసం చేస్తాననా? చెయ్యనని ప్రమాణం చేశాను కానా?" అన్నది సుకేశిని.

"నా అనుచరులు, పందుల రూపంలో వుండగా ఈ విందు ఎలా అరగించేది? వారిని మామూలు మనుషులను చేసి నా ఎదటికి తెచ్చినదాకా నా మనస్సుకు శాంతి ఉండదు!" అన్నాడు రూపధరుడు.

సుకేశిని తన మంత్రదండం తీసుకుని వెళ్లి, రూపధరుడి అనుచరులందరినీ యథా ప్రకారం మనుషులను చేసి వెంటబెట్టుకు వచ్చింది. రూపధరుణ్ణి చూడగానే వారి ఆనందానికి మేరలేదు. వారిలో చాలామంది సంతోషం పట్టలేక ఏడిచారు.

సుకేశిని రూపధరుణ్ణి సమీపించి, "నేను చెప్పినట్టు చెయ్యి. సముద్రతీరానికి వెళ్లు, నీ పడవను తీరంమీదికి లాగించి, నీ సామానూ తాళ్ళూ ఒక గుహలో భద్రం చేయించు. తరవాత, నీ మిగిలిన అనుచరులనుకూడా వెంటబెట్టుకుని యిక్కడికి రా!" అన్నది. రూపధరుడు సరేనన్నాడు.

(ఇంకా వుంది)






## 5

[అనేక కష్టాలుపడి, అనేక నౌకలనూ, అనేకమంది అనుచరులనూ పోగొట్టుకుని రూపధరుడు సుకేశిని అనే దేవత ఉండే దీవిని చేరుకున్నాడు. తన మనుషులను రెండు దళాలుగా విభజించి, మాయావి అనేవాడి నాయకత్వంకింద ఒక ముఠాను దీవి యావత్తూ కలయజూడటానికి పంపాడు. వారు సుకేశిని ఇంటికి వెళ్లారు. ఆమె వారికి ఆతిథ్యం ఇచ్చి తన మాయాజాలంచేత వారిని పందులుగా చేసేసింది. కాని ఆమె ఎత్తులు రూపధరుడిపై పారలేదు. ఆమె అతనికి ఆప్తురాలుగా మారింది.]

ఆమె సలహా చెప్పినప్రకారం రూపధరుడు, సముద్రతీరాన ఉన్న తన అనుచరుల వద్దకు వెళ్ళాడు. వారు నౌకదగ్గిర విచారంగా కూచునివున్నారు. తమ నాయకుణ్ణి చూడగానే వారికి ప్రాణాలు లేచివచ్చినట్టయింది. తల్లిని చూసిన లేగదూడల్లాగా వారు చెంగుచెంగున గెంతుకుంటూ వచ్చి రూపధరుణ్ణి చుట్టుముట్టారు. ఇథకాకు చేరుకున్నా వారంతకంటె ఎక్కువ సంతోషించి ఉండరు. వారి కళ్లవెంట ఆనంద బాష్పాలు కారుతున్నాయి.

"ఏరీ ? మనవాళ్లంతా ఏరీ ?" అని వారు రూపధరుణ్ణి అడిగారు.

"మనవాళ్లు సుకేశిని ఇంట్లో క్షేమంగా ఉన్నారు. సుఖంగా తింటున్నారు, తాగుతున్నారు. ముందు మనం మన నౌకను

గ్రీకు పురాణగాథ



తీరానికి లాగి మన తాళ్లూ, ఇతర సామగ్రీ ఏదైనా గుహలో భద్రం చెయ్యాలి. తరవాత నేను మిమ్మల్నికూడా సుకేశిని ఇంటికి తీసుకుపోతాను," అన్నాడు రూపధరుడు.

వెంటనే వారు పని ప్రారంభించారు. అయితే మాయావి వారితో ఇలా అన్నాడు:

"మూర్ఖులారా! మీరెక్కడికి పోదామనుకుంటున్నారు? సుకేశిని ఇంటికా? ఆమె మిమ్మల్ని సింహాలూ, తోడేళ్లూ చేసేసి, తన ఇంటి చుట్టూ కాపలాకుక్కల్లాగా కట్టేస్తుంది, ఏమనుకున్నారో? ఫాలలోచనుడి గుహలో ప్రవేశించి మనవాళ్లేమయారో కాస్త జ్ఞాపకం తెచ్చుకోండి. అప్పుడూ ఈ రూపధరుడే పుణ్యం కట్టుకున్నాడు. ఇతని అనాలోచనే వాళ్లని నాశనం చేసింది!"

ఈ మాటలు విని రూపధరుడికి మండిపోయింది. అతను కత్తిదూసి మాయావి కంఠం తెగవెయ్యబోయాడు. కాని మిగిలిన వారు అతన్ని వారించారు. "అతనికి రావటం ఇష్టంలేకపోతే, నౌకను కనిపెట్టుకుని ఇక్కడే ఉండనిద్దాం. మేం నీవెంట సుకేశిని ఇంటికి వస్తున్నాం. మమ్మల్ని తీసుకుపో!" అన్నారు వారు రూపధరుడితో. కాని తీరా అందరూ బయలుదేరాక మాయావి కూడా సుకేశిని ఇంటికి బయలుదేరాడు.

సుకేశిని రూపధరుడి అనుచరుల కందరికీ తలంటి స్నానాలు చేయించి, మంచి మంచి బట్టలు కట్టబెట్టింది. అంతకు మునుపే మాయావివెంట వచ్చినవారు అప్పుడే భోజనాలు చేస్తున్నారు. రెండు ముఠాలవాళ్లూ ఒకరినొకరు చూసుకుని సంతోషం పట్టలేక గోలగా అరవసాగారు.

సుకేశిని రూపధరుడివద్దకు వచ్చి, "మీ వాళ్లు గడిచిపోయిన కష్టాలను మరిచిపోతే బాగుంటుంది. నువ్వూ, నీ అనుచరులూ పడ్డ కష్టాలను నేనెరుగుదును. సుఖంగా తినండి, సారా తాగండి; మీ ఇథకాలో ఉన్నట్టే ఆనందంగా ఉండండి," అన్నది.



రూపధరుడు ఆమె సలహాను పూర్తిగా పాటించి ఒక సంవత్సరంపాటు తన అనుచరులతో సహా ఆమెకు అతిథిగా ఉండిపోయాడు. సంవత్సరం పూర్తికాగానే రూపధరుడి అనుచరులందరూ కలిసి, "ఏమిటిది? మనం ఇక ఇంటికి ప్రయాణమై పోయేది లేదా ఏం?" అన్నారు.

రూపధరుడు సుకేశినితో, "నా అనుచరులు స్వదేశానికి పోవటానికి తొందరపడుతున్నారు. నేనిక బయలుదేరటం మంచిది మా ప్రయాణానికి నీ సహాయం కావాలి!" అని అడిగాడు.



"నిన్ను బలవంతాన ఉంచటం నాకిష్టం లేదు. కాని నువు మీ దేశానికి వెళ్లిపోయే ముందు ఇంకొక ప్రయాణం చెయ్యవలసి ఉంది. యములవాళ్లుండే నరకంలో సాంకేతికుడు అనే దివ్యజ్ఞాని ఉన్నాడు. చచ్చిపోయినా అతనికి దివ్యజ్ఞానం పోలేదు. నువు అతణ్ణి ఒకసారి కలుసుకుని అతని సలహా తీసుకోవాలి," అన్నది సుకేశిని.

ఈ మాట వినగానే రూపధరుడు హతాశుడై పోయాడు. "అయ్యో, సుకేశినీ, నరకానికి ప్రయాణం చెయ్యటం నావల్ల అయే పనేనా? ఎవరైనా నరకానికి నౌకలో వెళ్లి ఉన్నారా?" అని అతను అడిగాడు.

"నువు పడవకు చుక్కానిపట్టి దిక్కులు చూస్తూ కూచోనవసరం లేదు. తెరచాప స్తంభం లేపి, తెరచాప ఎత్తి మాట్లాడకుండా కూచో, ఉత్తరవాయువు నీనౌకను నేరుగా నరకం చేర్చుతుంది. నీ నౌక సముద్రం దాటి నాక తీరం వస్తుంది. అక్కడ నరకవృక్షాలుంటాయి. నీ నౌకను తీరాన కట్టేసి యమలోకానికి కాలినడకను బయలుదేరు. కొంత దూరం వెళ్ళాక నీకు ఒక గుట్ట కనిపిస్తుంది. దాని సమీపంలోనే అగ్నినదీ, అశ్రునదీ కలిసి వైతరణీనది అవుతుంది. ఆ రాతి దగ్గిర మూరెడు పొడుగూ, మూరెడు వెడల్పూ గల గొయ్యి తవ్వు. ఆ గోతిలో పితృదేవత





లకు తర్పణాలు విడిచి, పిండప్రదానం చెయ్యి. ఈ విధంగా పితృదేవతలను అర్చించి, నిన్ను క్షేమంగా ఇథకా చేర్చమని వారిని ప్రార్థించు. ఇల్లు చేరినాక వారికి బలు లిస్తానని వాగ్దానం చెయ్యి. సాంకేతికుడికి విడిగా ఒక నల్లగొర్రెపోతును బలి ఇస్తానని దణ్ణం పెట్టుకో. తరవాత ఒక నల్ల అడగొర్రెనూ, నల్లగొర్రెపోతునూ అక్కడ బలియిచ్చి అగ్నిలో వేల్చు. ఇలా చేసి యమధర్మరాజుకూ, నరక వాసులకూ, దణ్ణాలు పెట్టుకో. ఇంతలో పితృదేవతలు బలి అరగించటానికి వస్తారు. వారి లో సాంకేతికుడుకూడా ఉంటాడు. ఆయన నీకు



ఇంటికి పోయే ఉపాయమూ, మార్గమూ చెప్పినదాకా పితృదేవతలెవరూ బలులు అంటకుండా చూసుకో!" అని సుకేశిని రూపధరుడికి వివరించి చెప్పింది.

ఇంతలో తెల్లవారింది. రూపధరుడు తన అనుచరులను నిద్రలేవగొట్టి, "నిద్రలేవండి. ఈ ప్రదేశంనుండి మనం బయలుదేరి వెళ్ళాలి. సుకేశిని మనకొక ప్రయాణం కల్పించింది," అన్నాడు.

పాపం, రూపధరుడి అనుచరులు, ఇంటికి బయలుదేరుతున్నాంగదా అని ఎంతో ఉబలాటపడ్డారు. కాని, తాము పోబోతున్నది యములవాళ్లుండే నరకానికని తెలియగానే వారు మొర్రో అని గోలపెట్టారు. వారిలో కొందరు జుట్టు పీక్కున్నారు. కాని వారు ఆ చోటుకు వెళ్లక తప్పేది లేదు.

అందరూ కలిసి బయలుదేరి నౌకవద్దకు వెళ్ళేసరికి, అప్పటికే సుకేశిని వచ్చి అక్కడ ఉన్నది. ఆమె అ నౌకవద్ద ఒక నల్లని అడ గొర్రెనూ, నల్లని గొర్రెపోతునూ ఉంచి, ఎవరి తోనూ మాట్లాడకుండా తిరిగి వెళ్ళిపోయింది.

గ్రీకులు తమ నౌకను తీరంనుంచి నీటి లోకి లాగారు, తెరచాప స్తంభం ఎత్తి, తెర విప్పారు. నల్లగొర్రెలను తీసుకుని అందరూ నౌకలోకి ఎక్కారు. సుకేశిని అనుగ్రహం



వల్ల ఉత్తరంనుంచి మారుతం వచ్చి తెర చాపను నించింది. నౌక కదిలిపోసాగింది.

గాలిపోసుకున్న తెరచాప గాలిపోసుకున్నట్టే ఉంది. సాయంకాలందాకా నౌక తొణుకూ, బెణుకూ లేకుండా ప్రయాణం సాగించింది. తరవాత సూర్యుడు అస్తమించి, అంతటా అంధకారం అవరించింది. ఆ చీకటిలోనే నౌక తీరాన్ని తాకింది.

రూపధరుడు సుకేశిని చెప్పిన ప్రకారమే అగ్నినదీ అశ్రునదీ కలిసే చోట గుండం తవ్వి, తర్పణాలు విడిచాడు, పిండప్రదానం చేసి, పితృదేవతలను ధ్యానించాడు. తరవాత అతను గొర్రెలను బలిఇచ్చి, అగ్నిలో హోమం చేశాడు.

మరుక్షణమే పితృదేవతలు కోలాహలం చేస్తూ, గుంపులు గుంపులుగా బలులు అరగించటానికి వచ్చారు. అతను యమధర్మరాజుకూ యములవాళ్ళకూ దణ్ణాలు పెట్టి, పితృదేవతలతో, "నేను సాంకేతికుణ్ణి కొన్ని ప్రశ్నలు వేసేదాకా ఎవరూ బలులు ముట్టటానికి వీల్లేదు!" అన్నాడు.

మిగిలినవారిని తోసుకుంటూ ఒక స్త్రీ ముందుకు వచ్చింది. ఆమెను చూసి రూపధరుడు నిర్ఘాంతపోయాడు. ఎందుచేతనంటే, ఆమె రూపధరుడి తల్లే! రూప




ధరుడు ట్రోయ్‌పై యుద్ధానికి బయలుదేరే నాటికి ఆమె జీవించే ఉన్నది. ఆమె ఎప్పుడు చనిపోయినదీ రూపధరుడు ఎరగడు.

ఆమెను చూసి రూపధరుడు కంట తడి పెట్టుకున్నాడు, జాలిపడ్డాడు. అయినప్పటికీ అతను ఆమెను బలులు తాకనివ్వలేదు.

ఆమె వెనకనే సాంకేతికుడు, చేతిలో బంగారుకర్ర పట్టుకుని వచ్చాడు. ఆయన రూపధరుణ్ణి గుర్తించి, "నాయనా, ఎన్నడూ సూర్యకాంతి ఎరగని ఈ పితృలోకానికి నువ్వెందుకు రావలిసివచ్చిందీ? కాస్త అడ్డం తొలిగితే, బలి అరగించి నీకు చెయ్యవలసిన సహాయం చేస్తాను" అన్నాడు.




రూపధరుడు పక్కకు తొలిగి ఆయనను బలి ఆరగించ నిచ్చాడు. తరవాత ఆయన రూపధరుడికేసి తిరిగి, "నాయనా, నువ్వు స్వదేశానికి పోవాలని తహతహ లాడు తున్నావు. నిజానికి స్వదేశంకన్న స్వర్గం ఎక్కడుంది ? అయితే దేవతలు నీపై అలిగి ఉన్నారు. అందుచేత నువ్వు పడరాని పాట్లు పడతావు, తప్పదు. ఎన్నికష్టాలు పడినా నువ్వు క్షేమంగా ఇంటికి చేరుకుంటావు. నువ్వు ఇంటికి వెళ్లే దారిలో త్రినాపియ అనే దీవి వస్తుంది. అక్కడ సూర్యభగవానుడి తాలూకు పశుగణాలుంటాయి. నువ్వుగాని, నీ అనుచరులుగాని వాటిజోలికి పోవద్దు.



ఒకవేళ ఆ పశువులకు అపచారం జరిగిందో నీ అనుచరులుగాని, నీ నౌకగాని ఇథకా చేరటం కల్ల. నువ్వు మటుకు చావు తప్పి కన్ను లొట్ట పోయినంత పని అయి, ఇంకొ కరి నౌకలో ఒంటరిగా ఇంటికి చేరు కుంటావు. అప్పటికీ నీ కష్టాలు అంతం కావు. నీ ఇంటినిండా నీ శత్రువులుండి, తమను పెళ్లాడమని నీ భార్యను పీడిస్తుం టారు. అయితే నువ్వు వీరిని ఎలాగో హత మార్చ గలుగుతావు. ఆ శత్రువుల నందరినీ తుదముట్టించినాక నువ్వు దేవతలపట్ల నీ ధర్మాన్ని నెరవేర్చాలి. అది ఎలా చేయాలో నీకు చెబుతాను. నౌకలు నడిపే తెడ్డు ఒకటి తీసుకుని, అన్నంలో ఉప్పు వాడని వారూ, సముద్రమంటే ఏమిటో ఎరుగని వారూ కనబడేదాకా ప్రయాణం చెయ్యాలి. అటువంటి మనుషులను గుర్తించే మార్గం కూడా నీకు చెబుతాను. వాళ్లు నీ భుజాన ఉండే పడవ తెడ్డును గుర్తించలేక, అది వ్యవసాయపు తెడ్డా అని అడుగుతారు. అటువంటి మనుషులు కనబడిన చోట నీ తెడ్డును భూమిలో గుచ్చి, వరుణదేవుడికి బలులియ్యి. ఒక గొర్రెపోతునూ, ఒక ఎద్దునూ, ఒక ఏదుపందిని బలి ఇచ్చి ఇంటికి తిరిగి వెళ్లు. నువ్వు దీర్ఘకాలం బతికి,



చిట్టచివరకు నువు సముద్రం మూలనే నిశ్చింతగా, సుఖమైన చావు చస్తావు. ఆ సమయంలో నీ అప్తులందరూ నీ చుట్టూ ఉంటారు," అని జోస్యం చెప్పాడు.

"సరే కానివ్వండి. విధిని తప్పించుకోవటం నా వశమా? కాని ఒకటి చెప్పండి. అక్కడ నా తల్లి ప్రేతాత్మ నిలబడి ఉన్నది. ఆమె నాకేసి చూడదు, నాతో మాటాడదు, బలులుకేసి మాత్రమే చూస్తుంది. ఆవిడ నన్ను గుర్తించే మార్గం ఉంటే చెప్పండి!" అన్నాడు రూపధరుడు.

"నాయనా, బలి ముట్టేదాకా పితృదేవతలు నిజం ఏమిటో తెలుసుకోలేరు, చెప్పలేరు. ఆ సంగతి జ్ఞాపకం ఉంచుకో!" అంటూ సాంకేతికుడు యమలోకానికి తిరిగి వెళ్ళిపోయాడు.

రూపధరుడు అక్కడే నిలబడి, తన తల్లి వచ్చి బలి ఆరగించేదాకా వేచిఉన్నాడు. బలి ఆరగించగానే ఆమె తల ఎత్తి చూసి తన కొడుకును గుర్తించి, "నాయనా, బతికి ఉండే ఈ లోకానికి ఎలా వచ్చావురా? అది ఎవరికీ సాధ్యం అయే పని కాదే? ట్రోయ్ నుంచి ఇదే రావటమా? ఇంకా ఇథకాకు వెళ్ల లేదా? నీ భార్యను చూసుకో లేదా?" అని అడిగింది.



"లేదమ్మా! నేను ఇల్లు చేరలేక అష్టకష్టాలూ పడుతున్నాను. ఇక్కడ ఉండే సాంకేతికుడి సలహా కోరి నేనిక్కడికి రావలిసి వచ్చింది! చూడమ్మా, నువు ఎలా చని పోయావు? జబ్బు చేసిందా, లేక అకస్మిక మరణం సంప్రాప్త మయిందా? నాన్న ఎలా ఉన్నాడు? నా కొడుకేం చేస్తున్నాడు? వాళ్లు నన్నే నమ్ముకుని నాకోసం ఎదురు చూస్తున్నారా? లేక నేనిక తిరిగి రాననుకుని ఇంకెవరి పంచనైనా చేరారా? నా భార్య ఏమంటున్నది, ఏం చేద్దామనుకుంటున్నది? కొడుకుతో సహా ఆస్తిని చూసుకుంటున్నదా? లేక, ఎవరినన్నా

మంచివాణ్ణి చూసి పెళ్ళాడేసిందా?" అని రూపధరుడు తల్లిని అడిగాడు.

"అది నీ యింటోనే ఉంటున్నది, నాయనా. దాని ఓర్పు ఎటువంటి దను కున్నావు! అహోరాత్రాలు దాని గుండె దహించుకు పోతున్నదనుకో. నీ ఆస్తీహోదా ఇంకా నీపేరనే ఉన్నాయి. నీ కొడుకు విజ యధ్వజుడు నీ ఆస్తికి హక్కుదారుడుగా ఉంటూ, రాజు చేయవలిసిన పనులన్నీ నిర్వ హించుకుంటూ వస్తున్నాడు. ఇక మీనాన్న ఆ పల్లెవాసం విడిచి బస్తీకి రారు. ఆయనకు చలికాలంలోకూడా ఒక పక్కా, దుప్పటీ లేదు; పశువుల మధ్య మట్టిలో, చలి మంటకు దగ్గిరిగా పడుకుంటారు. ఇక ఇతర కాలాల్లో ద్రాక్షతోటలో ఎక్కడ బడితే అక్కడే ఆయన పడక. ముసలితనానికి తోడు, నువు రాలేదన్న విచారం ఆయనను కుంగదీసేస్తున్నది. ఇక నా చావు మాటంటావా? నేను ఏ జబ్బుతోనూ తీసు కుని చావలేదు, హఠాత్తుగానూ చావలేదు; నీకోసం బెంగపడి చచ్చాను!" అన్నది రూపధరుడి తల్లి.

రూపధరుడు తల్లిని మనసారా ఒక్కసారి కౌగలించుకుందామని ప్రయత్నం చేశాడు, కాని సాధ్యపడలేదు. మూడు ప్రయత్నాలు చేశాడు, మూడూ విఫలమయాయి.

అప్పుడు రూపధరుడు కళ్ళనీళ్ళు పెట్టు కుని తల్లికేసి దీనంగా చూస్తూ, "ఒక్కసారి నన్ను కౌగలించుకో నీవమ్మా! ఎందుకు అందకుండా పోతావు?" అన్నాడు.

"బతికున్నవాళ్ళు చచ్చినవాళ్ళని ఎలా కౌగలించుకుంటారు, తండ్రీ. నువు కౌగ లించుకోదగినదంతా కాష్ఠంలో కాలి బూడిద అయిపోయింది. వెంటనే ఈ చీకటి లోకం విడిచి వెళ్ళిపో, నాయనా! కాని ఇక్కడ చూసిన విషయాలుమాత్రం జ్ఞాపకం ఉంచుకుని, నీ భార్యకు చెప్పు!" అన్నది రూపధరుడి తల్లి. (ఇంకా ఉంది)






# రూపధరుడి యాత్రలు

## 6

[ రూపధరుడు ఒక ఏడాదిపాటు సుకేశినికి అతిథిగా ఉండి, తన అనుచరుల ప్రోద్బలం పైన ఇంటికి ప్రయాణంకట్టాడు. అతను సుకేశిని సలహాపై యమలోకానికి వెళ్లి, అక్కడ తలవనితలంపుగా తన తల్లియొక్క ప్రేతాత్మను కలుసుకుని, ఆమెద్వారా తన కుటుంబ పరిస్థితులు తెలుసుకున్నాడు. ]

రూపధరుడు తన తల్లితో మాట్లాడుతున్న సమయంలో ఇంకా అనేక ప్రేతాత్మలు బలి ఆరగించటానికి మందలు మందలుగా వచ్చాయి. రూపధరుడు అందరి పరిచయమూ చేసుకున్నాడు. ఆ వచ్చిన వారిలో నవద్యోతుడి తల్లీ, భువనసుందరి తల్లీకూడా ఉన్నారు.

బలులు పుచ్చుకున్న ప్రేతాత్మలు చాలా భాగం వెళ్లిపోయాయి. అంతలో అక్కడికి రారాజు ప్రేతాత్మ వచ్చింది. బలి ఆరగించగానే రారాజు రూపధరుణ్ణి గుర్తించి బావురుమని ఏడిచి, రూపధరుడికేసి చేతులు చాచాడు. కాని ప్రేతాత్మ బతికున్నవాణ్ణి ఆలింగనం చేసుకోవటం సాధ్యంకాదు.

రూపధరుడు విస్మయంతో, "ప్రభూ, మీరిక్కడికి ఎప్పుడు వచ్చారు? ఎలా వచ్చారు?" అని అడిగాడు.

"అజబలుడనే దుర్మార్గుడూ, నా భార్యా కలిసి నన్ను హత్యచేయటానికి కుట్రపన్ని, నన్ను అతిథిగా ఆహ్వానించి, భోజనాల




సమయంలో హత్యచేశారు. నాతోబాటు నా పరివారాన్ని కూడా చంపేశారు. నువు యుద్ధంలో అనేక రకాల ఘోరమైన చావులు చూసివుంటావు; కాని భోజనాల ముందు అంతమంది హత్యకావటం ఊహించనుకూడా లేవు," అన్నాడు రారాజు.

"అవును, ప్రభూ! స్త్రీబుద్ధి ప్రళయాంతకమైనది. మీరు యుద్ధంనుంచి తిరిగి రాకపూర్వమే, మిమ్మల్ని హత్యచెయ్యటానికి మీ భార్య అలోచన చేసివుండాలి. ఆడదాన్ని నమ్మరాదు. భువనసుందరి చూడరాదా? ఆమెకోసం ఎంతమంది బలి అయారు!" అన్నాడు రూపధరుడు.



"నీ భార్యమటుకు చాలా గొప్ప సాధ్వి. పాపం, నువు యుద్ధానికి బయలుదేరేసరికి ఇంకా కొత్తపెళ్లికూతురే, తొలిచూలు బాలింతరాలు! ఆ పిల్లవా డీపాటికి పెరిగి పెద్దవాడై ఉండాలి!" అన్నాడు రారాజు.

వారీ విధంగా మాట్లాడుకునే సమయంలో అక్కడికి వజ్రకాయుడూ, పితృకీర్తీ ప్రేతాత్మల రూపంలో వచ్చారు. ట్రోయ్ యుద్ధంలో మరణించిన ఇతర గ్రీకువీరులు కూడా వచ్చారు.

వజ్రకాయుడు రూపధరుణ్ణి గుర్తించగానే పలకరించి, అనేక విషయాలు ముచ్చటించి, "నా కొడుకు క్షేమంగా ఉన్నాడా? అతను ఎలాటి యోధుడు?" అని అడిగాడు.

"నీ కుమారుడు నవయోధుడు చాలా పరాక్రమవంతుడు. నవద్యోతుడి తరవాతా, నా తరవాతా అతనిలాగా వ్యూహరచన చేసినవాడు లేడు. అతను ఎందరినో పరాక్రమవంతులను సమయుద్ధంలో ఓడించాడు. కొయ్యగుర్రంలోకి ఎక్కినవారిలో అతను ఒకడే భయంతో వణకలేదు. మీదుమిక్కిలి, కత్తి చేతబట్టుకుని కూచుని, ట్రోయ్‌మీద పడటానికి అనుజ్ఞ ఇవ్వమని నన్ను ఎంతగానో తొందరపెట్టాడు. యుద్ధంలో ఎందరు చచ్చారో, ఎందరు గాయపడ్డారో చెప్పలేను;





నవయోధుడి ఒక్కడి శరీరానికి మాత్రమే ఒక్క చిన్న గాయంకూడా తగలలేదు!" అన్నాడు రూపధరుడు.

ఈ మాటలు విని వజ్రకాయుడి ప్రేతాత్మ పరమానందం చెంది వెళ్ళిపోయింది. చూడవలసినవారందరినీ చూడటం పూర్తిచేసి రూపధరుడు తన నౌకకు తిరిగివచ్చి తిరుగు ప్రయాణం సాగించాడు. త్వరలోనే నౌక సుకేశిని ఉండే దీవిని చేరుకున్నది.

సుకేశిని రూపధరుణ్ణీ, అతని అనుచరులనూ ఆహ్వానిస్తూ, "మీరు మొత్తానికి భలే వాళ్ళు! అందరూ యమలోకానికి ఒక్క మారే ప్రయాణం చేస్తారుగాని, మీరుమాత్రం రెండో ప్రయాణానికి అవకాశం అట్టేపెట్టుకున్నారు. ఇవాళ మీరు నా అతిథులుగా ఉండి తనివిదీర తినండి, తాగండి; రేపు ఉదయం యిక్కడినుంచి బయలుదేరి పోదురుగాని!" అన్నది.

గ్రీకులు పగలల్లా తినటంలోనూ, తాగటంలోనూ గడిపారు. పొద్దు వాలి చీకటి పడగానే రూపధరుడు తప్ప మిగిలినవారంతా నౌకవద్దకు వెళ్ళి, దాని సమీపాన ఇసకలో పడుకుని నిద్రపోయారు. రూపధరుడు సుకేశిని ఇంటనే ఉండి, యమలోకంలో తాను చూసిన వింతలన్నీ చెప్పాడు.

అంతా విని సుకేశిని ఇలా అన్నది: "అదంతా గతించిన విషయం. ఇక జరగవలిసినదాన్నిగురించి నేను చెప్పేది శ్రద్ధగా విను. నీకు ప్రయాణంలో మొట్టమొదటగా నాగకన్యకలు తగులుతారు. వారి గొంతులకు సమ్మోహన శక్తి ఉన్నది. వారి పిలుపు విన్నవారికి ఆయువు మూడినట్టే! అందుచేత వారుండే దీవి రాకమునుపే నీ అనుచరులందరి చెవులలోనూ మైనం పెట్టేసి నాగకన్యకల పాటలు వినిపించకుండా చెయ్యి. నీకు వారి పాటలు వినాలని కోరిక ఉన్నట్టయితే, నీ అనుచరులు నిన్ను తెరచాప స్తంభానికేసి గట్టిగా బంధించాలి.

నువు ఎంత కేకలు పెట్టినా కట్లు ఊడదీయ వద్దని నీ అనుచరులతో గట్టిగా ముందే చెప్పి ఉంచు. అప్పుడు నువు వారి పాటలు విన వచ్చు; అందువల్ల నీకు ప్రమాదం ఉండదు. నాగకన్యకలుండే దీవి దాటి, వారి గొంతులు వినిపించకుండా పోయాక నీకు సముద్రం మీద రెండు మార్గాలు తగులుతాయి. వీటిలో నువు ఏమార్గం తీసుకుంటావో నేను చెప్ప లేను. ఒక మార్గం రెండు నిటారుకొండల మధ్యగా పోతుంది. ఆ కొండల మధ్యకు ఒక చిన్న పక్షి వచ్చినా సరే అవి ఒకదానితో ఒకటి ఢీకొట్టి చంపేస్తాయి. అవి కదిలే కొండలు. వాటి మధ్యకు వెళ్లి నాశనంకాని నౌక అంటూ ఉండదు. ఇక నీ రెండవ మార్గం విధ్వంసినీపర్వతం పక్కగా ఉంటుంది. ఈ పర్వతం చాలా ఎత్తయినది. దీని శిఖరం అన్నికాలాలలోనూ మేఘాలు కప్పి ఉంటుంది. అందుచేత దానిని చూసిన వారెవ్వరూ లేరు. ఆ పర్వత శిఖరాన్ని ఎక్కినవారుకూడా ఎవరూ లేరు. ఎందు చేతనంటే ఆ పర్వతం నున్నగా, కాలు పెడితే జారిపోతూ ఉంటుంది. ఆ పర్వతం చరియలో ఒక గుహ ఉన్నది. అది పడమటి వేపు చూస్తూ ఉంటుంది. ఆ గుహలో విధ్వంసిని అనే రాక్షసి ఉన్నది. ఆమె అప్పుడే పుట్టిన కుక్కపిల్లలాగా కుంయి





కుంయి మని మొరుగుతుంది. అయినా ఆ మొరుగుడు భయం కలిగిస్తుంది. ఆ రాక్షసికి పన్నెండు కాళ్లూ, ఆరు తలలూ ఉన్నాయి. ఆమెకు గల ఆరు మెడలూ అతి పొడుగైనవి. ఆమె ఉండే గుహ సముద్రమట్టానికి ఎంతో ఎత్తున వుంటుంది. ఎంత గొప్ప విలుకాడు కూడా, అంత ఎత్తు బాణం వెయ్యలేడు. అయినప్పటికీ విధ్వంసిని నడుము పైభాగం గుహలోనుంచి బయటికి పెట్టి, సముద్రంలో గల చేపలను తన నోళ్లతో అందుకో గలదు. ఆమెకు అందుబాటులోకి వెళ్లి ప్రాణాలతో బయటపడిన నావికుడు ఇంతవరకు లేడు. ఈ కొండకు బాణంవేటు దూరంలో ఒక సుడిగుండం ఉన్నది. ఈ సుడిగుండంలో చిక్కుకున్న నౌక నాశనం కాకుండా చేసే శక్తి ఈశ్వరుడికికూడా లేదు. నీ నౌకను ఈ సుడిగుండం మీదుగా తీసుకుపోవటంకంటె, విధ్వంసినీ పర్వతం పక్కగా తీసుకుపోవటం చాలా క్షేమం. నౌక వేగంగా పోయినపక్షంలో, విధ్వంసిని తన ఆరు నోళ్లతోనూ ఆరుగుర్ని పట్టుకున్నప్పటికీ మిగిలిన వాళ్లు దక్కుతారు. సుడిగుండంలో చిక్కిన నీ నౌకకు నామ రూపాలుండవు.

"తరవాత నువ్వు త్రినాసియాదీవి చేరుకుంటావు. అక్కడ సూర్యభగవానుడి ఆవుల మందలూ, గొర్రెలమందలూ వుంటాయి.



మందకు యాభై చొప్పున ఏడు ఆవుల మందలూ, ఏడు గొర్రెలమందలూ వుంటాయి. వాటిని సూర్యుడి కుమార్తె లిద్దరూ కాస్తూ వుంటారు. ఆ మందలకు చావూ, పుట్టుకా లేదు. నువుగాని, నీ అనుచరులుగాని ఆ మందల జోలికి పోవద్దు. అలా పోయి నట్టయితే నీ నౌకా, అనుచరులూ నాశనమై పోతారు. నీకు ఎలాగూ కష్టాలు తప్పవు. అందుచేత వాటిని అనవసరంగా పెంచుకోకు.''

సుకేశిని ఇలా చెప్పిన అనంతరం తూర్పు తెల్లవారింది. రూపధరుడు తన నౌకవద్దకు తిరిగివచ్చి తన అనుచరులను లేపాడు.

త్వరలోనే నావికులు లంగరు ఎత్తి నౌకను బయలుదేరదీశారు. సుకేశిని అనుగ్రహం వల్ల ఆ సమయంలో అనుకూలమైన గాలి వీచి తెరచాపను నించింది.

మొట్టమొదట రాబోయే ప్రమాదం నాగ కన్యకలనుంచి. అందుచేత రూపధరుడు తన అనుచరులతో సుకేశిని చెప్పిన విషయా లన్నీ చెప్పి, వారందరి చెవులలోనూ మైనం కుక్కి వాళ్లను చెవిటివాళ్లుగా చేసేశాడు. తరవాత వారు రూపధరుణ్ణి తెరచాప స్తంభాని కేసి బలమైన మోకుతో కట్టేశారు. "నేను కట్లు విడిపించుకోవటానికి యత్నిస్తే మరింత గట్టిగా కట్టండి!" అని అతను వారితో ముందుగానే చెప్పాడు.

నాగకన్యకలు తమ దీవినుండి రూప ధరుడి నౌకను చూసి గొంతులెత్తి పాడ సాగారు. వారు రూపధరుణ్ణి పేరుపెట్టి పిలిచి, తియ్యని తమ పాటలు విని మరీ వెళ్లమన్నారు. వారి పాట వింటున్నకొద్దీ రూపధరుడికి ఇంకా వినాలనిపించింది. తన కట్లు విప్పమని అతను తన అనుచరులను బతిమాలాడు. అతని వాలకం చూసి వారు అతన్ని మరింత గట్టిగా కట్టారు.

కొద్దిసేపట్లో నౌక దూరం వెళ్ళిపోయింది. నాగకన్యకల గొంతులు ఇక వినిపించటం



లేదు. అప్పుడు రూపధరుడి అనుచరులు తమ చెవులలో పెట్టుకున్న మైనం తీసే శారు, రూపధరుడి కట్లు విప్పేశారు. అంత లోనే రూపధరుడికి అంతదూరాన గుండ్రగా తిరుగుతూ బ్రహ్మాండమైన అల ఒకటి కని పించింది. అదే సుడిగుండం. దాన్ని చూసీ చూడటంతోనే రూపధరుడి అనుచరులు హడలిపోయారు.

"మీరేమీ భయపడకండి. ఫాలలోచ నుడి బారి పడినదానికంటె ఇదేమంత ప్రమాదం కాదు. నౌకను ఆ కనపడే కొండసమీపంగా నడపండి!" అన్నాడు రూపధరుడు.

అతను తన అనుచరులతో ఆ కొండ గుహలో ఉండే విధ్వంసిని గురించి చెప్ప లేదు. చెబితే వారు బెంబేరెత్తి తెడ్లు అవతల పారేసి ఉండేవారే. రూపధరుడుమాత్రం కొండకేసి పరీక్షగా చూశాడు. మబ్బులు ఆవరించి ఉండటంచేత అతనికి రాకసి ఉండే గుహగాని, రాకసి జాడగాని కనిపిం చనేలేదు. మిగిలినవారి కళ్లుమాత్రం సుడి గుండంమీదే ఉన్నాయి.

ఇంతలో రాకసి ఆరు తలలూ చాచి రూపధరుడి అనుచరులను ఆరుగురిని పట్టు కుని తన గుహకేసి లాగేసుకున్నది. మరి



కొద్దిసేపటిలో నౌక కొండను దాటి ముందుకు వెళ్ళిపోయింది.

రూపధరుడు అంతదూరాన చాలా మనో హరమైన దీవిని చూశాడు. ఆ దీవినుంచి ఆవుల అంబారవాలూ, గొర్రెల అరుపులూ వినవస్తున్నాయి. అదే సూర్యభగవానుడి మందలుండే దీవి.

ఈ సంగతి గ్రహించగానే రూపధరుడికి సాంకేతికుడు చేసిన హెచ్చరికా, సుకేశిని చేసిన హెచ్చరికా స్ఫురణకు వచ్చాయి. అతను భయపడుతూ తన అనుచరులతో ఇలా అన్నాడు: "మిత్రులారా, ఈ మనో హరమైన దీవి మీద మనకు అడుగుపెట్టే



ప్రాప్తం లేదు. మీరందరూ ఎంతో అలసట చెంది, సుఖంకోసం తహతహలాడిపోతున్నారని నాకు తెలుసు. కాని ఈ దీవిమీద అడుగు పెడితే ఘోరప్రమాదం తప్పదని నాకు సాంకేతికుడూ, సుకేశినీ హెచ్చరిక చేశారు. కనుక నౌకను దీవికి ఎడంగా నడపండి."

అతని మాటలు విని అతని అనుచరులు నీరుకారిపోయారు. మాయావిమటుకు మండి పడిపోతూ, "రూపధరా, నువు మనిషివి కావు, రాయివి! నీకు విసుగూ విరామమూ అవసరంలేదు. ఇరుగో నీ మనుషులు, నిద్రాహారాలు లేక చావటానికి సిద్ధంగా వున్నారు; కాని వీరిని తీరానికి పోవద్దంటావు, పంట చేసుకుని కడుపునిండా తినవద్దంటావు! రాత్రి పడబోతున్నది. ఒక రాత్రివేళ ఏ ఉప్పెన వచ్చినా రావచ్చు. ఆ ఉప్పెనలో మనం నడిసముద్రంలో వుంటే ఏంకాను? నూరు అరయేదిగాక, ఈ రాత్రికి ఈ తీరాన విశ్రాంతి తీసుకుని వంటలు చేసుకోక తప్పదు. కావలిస్తే రేపు తెల్లవారగానే మళ్లీ బయలుదేరుదాం!" అన్నాడు.

ఈ మాటలకు మిగిలినవారంతా గట్టిగా హర్షించారు. విధివ్రాత తప్పించుకోవటం సాధ్యంకాదని రూపధరుడు గ్రహించాడు. అతను మాయావితో, "మీరంతా ఒకటైతే నేను చేయగలిగినదేమీ లేదు. కాని మీరంతా ఒక ప్రమాణం చెయ్యాలి: మనకు ఆవుల మంద తగిలినా, గొర్రెలమంద తగిలినా వాటి జోలికి పోగూడదు. మనలో ఏ ఒకరు కూడా ఒక్క ఆవునుగాని, ఒక్క గొర్రెను గాని చంపటానికి ప్రయత్నించకూడదు. మనకు సుకేశిని ఇచ్చిన ఆహారం మినహా ఇంకేమీ ముట్టవద్దు. ఆ ప్రకారం మీరంతా ప్రమాణాలు చేశారంటే ఈ త్రినాసియా దీవిమీద అడుగుపెట్టటానికి నేను అంగీకరిస్తాను!" అన్నాడు.

మిగిలినవారంతా ఆ ప్రకారమే ప్రమాణాలు చేశారు. —(ఇంకా వుంది)






## 7

[టైరెసియస్‌తో పితృలోకానికి వెళ్ళి, అక్కడ గ్రీకు మృతవీరుల నెందరినో చూసి, సాంకేతికుడనే జ్ఞానిద్వారా భవిష్యత్తులో తనకు రాగల కష్టసుఖాలు తెలుసుకుని రూపధరుడు తన అనుచరులతో గృహోన్ముఖుడై, దారిలో నాగకన్యలను తప్పించుకుని, సూర్యభగవానుడి పశువుల మందలుండే దీవిని చేరాడు. అతని అనుచరులు ఆ పశువుల జోలికి పోమని ప్రమాణం చేసినమీదట ఆ రాత్రికి ఆ దీవిలో దిగటానికి రూపధరుడు ఒప్పుకున్నాడు.]

గ్రీకులు తమ పడవను ఒక రేవులాటి ప్రదేశం చేర్చి ఒడ్డుకు కట్టేశారు. ఆ సమీపంలోనే ఒక మంచినీటి జలకూడా ఉన్నది. తరవాత అందరూ తీరం మీదికి వెళ్లి వంట చేసుకుని భోజనాలు చేశారు. అనంతరం వారు విధ్వంసిని వాతపడిన తమ అనుచరులను తలుచుకుంటూ నిద్రపోయారు.

ఆ రాత్రి మూడవ జామున బ్రహ్మాండమైన ఉప్పెన అరంభమయింది. ఆకాశమంతటా మేఘాలు కమ్మాయి. దక్షిణం నుంచి తీవ్రమైన గాలి సాగింది. గ్రీకులు తమ నౌకను ఒడ్డుకు లాగి ఒక గుహలోకి ఈడ్చారు. రూపధరుడు తన అనుచరులతో, "మిత్రులారా, మన నౌకలో మనకు చాలెడంత ఆహారమూ, పానీయాలూ ఉన్నాయి. కనుక మనం ఈ దీవి మీద ఉండే పశువుల జోలికి పోవద్దు. అవి సూర్యభగవానుడివి. మనం ఆయనకు ద్రోహం చేసినట్టయితే



63





హోరుగాలి తగలని ఒక ప్రశాంత ప్రదేశంలో కూచుని దేవతలను ధ్యానించుతూ, అలాగే నిద్రపోయాడు.

ఈలోపుగా అక్కడ గుహలో మాయావి మిగిలిన గ్రీకులతో ఇలా అన్నాడు: "మిత్రులారా, మీరంతా చాలా దీనస్థితిలో వున్నారు. అందుచేత నేనొక్కమాట చెబుతాను వినండి. ప్రాణికి ఏవిధమైన చావన్నా భయమే. అయితే అన్ని చావులకన్న పరమ నీచమైన చావు ఆకలిచావు. కనుక మీరు కొంచెంకూడా సంకోచించవద్దు, పశువులను పట్టుకువద్దాం పదండి. మనం ఏనాటికైనా ఇథకా చేరితే అప్పుడక్కడ సూర్యభగవానుడికి గొప్ప ఆలయం కడదాం. ప్రస్తుతానికి మనం ఈ పశువులను తెచ్చి, యథావిధిగా స్వర్గంలోని దేవతలందరికీ బలులిచ్చి, వాటిని తిని మన ప్రాణాలు కాపాడుకుందాం. అప్పటికీ సూర్యభగవానుడు ఆగ్రహించి, మిగిలిన దేవతలు మనని అనుగ్రహించక, నడి సముద్రంలో మనం మునిగిపోతామా, పీడ విరగడ అయిపోతుంది. ఈ నిర్జనమైన దీవిలో ఆకలికి మాడి అనేక రోజులపాటు క్షీణించి చచ్చేకన్న ఇన్ని ఉప్పునీళ్లు మింగి చావటం ఎన్నోరెట్లు మేలుగదా!"

మన ప్రాణాలు దక్కవు! అందుచేత చాలా జాగ్రత్తగా ఉండండి!" అని గట్టిగా చెప్పాడు.

అతని అనుచరులకుకూడా అకారణంగా చాపటం ఇష్టంలేదు; అందుచేత వారు తమ నాయకుడి హెచ్చరికను పాటించారు. నెల రోజులపాటు ఉప్పెనగాలి వీస్తూనే ఉన్నది. నౌకలో ఉన్న ఆహార పానీయాలు అయిపోయాయి. గ్రీకులు ఆహారంకోసం పక్షులను వేటాడవలిసి వచ్చింది, చేపలు పట్టవలిసి వచ్చింది. ఎవరి కడుపులూ నిండటంలేదు.

ఇది చూసి రూపధరుడు దేవతలను ప్రార్థించ నిశ్చయించాడు. అతను తనవారిని విడిచి దీవిలోపలికి చాలాదూరం వెళ్లి,





మాయావి మాటలు విని మిగిలినవాళ్లు పరమానందం చెందారు. వారు ఏమాత్రమూ సంకోచించక, వెంటనే బయలుదేరి వెళ్ళి ఆ దీవిలో వున్న పశువులలో మంచి మంచి వాటిని ఏరి తోలుకువచ్చి, శాస్త్రోక్తంగా దేవతలకు బలులిచ్చి వాటి మాంసంతో వంట ప్రారంభించారు.

ఈలోపుగా రూపధరుడు నిద్ర లేచి తన వారిని చేరుకోవటానికి బయలుదేరి రాసాగాడు. అతను తీరానికి అంత దూరాన వుండగానే మాంసం వండుతున్న వాసన కొట్టింది. తన అనుచరులు సూర్యభగవానుడిపట్ల అత్యాచారం చేశారని అతనికి తెలిసిపోయింది. అతను వారిని మందలించాడు. కాని జరగవలసిన అపచారమేదో జరిగేపోయింది. పశ్చాత్తాపపడి చేయగలది కూడా ఏమీలేదు.

తాము చంపి వండుకున్న పశువుల మాంసాన్ని గ్రీకులు ఆరు రోజులపాటు తిన్నారు. ఏడవ రోజుకల్లా ఉప్పెనగాలి నిలిచిపోయింది. వెంటనే రూపధరుడూ అతని అనుచరులూ తమ నౌకను సముద్రం మీదికి తెచ్చి, అందులో ఎక్కి ప్రయాణమైనారు. కొంతసేపటికి సూర్యభగవానుడి మంద లుండే దీవి కనుచూపుమేర దాటి పోయింది. ఎటు చూసినా సముద్రమూ ఆకాశమూ తప్ప ఇంకేమీ కనిపించటంలేదు.

అలాటి సమయంలో నడిఆకాశం మీదికి ఒక కారుమేఘం వచ్చింది. పడమటినుంచి ఒక్క పెట్టున భయంకరమైన హోరుతో ప్రళయమైన గాలి విసిరింది. దాని దెబ్బకు తెరచాప స్తంభం ఫెళ్ళున విరిగి చుక్కాని పట్టేవాడి శిరస్సుమీద పడింది. వాడు చచ్చి సముద్రంలో పడిపోయాడు. అదే సమయంలో నేరుగా పడవపైన పిడుగుపడింది. ఆ దెబ్బతో పడవ కాస్తా ఛిన్నాభిన్నమై పోయింది. రూపధరుడి అనుచరు లందరూ సముద్రంపాత పడిపోయారు.





65



అయితే రూపధరుడికి తన నౌకతాలూకు వెన్నుదూలం దొరికింది. అతను దానికి తెరచాప స్తంభాన్ని అంటగట్టి, దానిపై తేలి వెళ్ల సాగాడు. ఇంతలోనే పడమటి గాలి నిలిచిపోయి దక్షిణపు గాలి ప్రారంభమయింది. తాను మళ్ళీ సుడిగుండంవేపు వెళ్లి ఆ సుడిగుండంలో మునిగిపోవటమో, విధ్వంసిని అనే రాక్షసివాత పడటమో జరుగుతుందని రూపధరుడు చాలా భయపడ్డాడు. అతను భయపడినట్టే తెల్లవారే సమయానికి అతని తెప్ప సుడిగుండం వద్దకు వచ్చింది. కాని అదృష్టవశాన అతను రెండు ప్రమాదాలనూ తప్పించుకున్నాడు.



రూపధరుడు తొమ్మిది రోజులపాటు ఈ విధంగా గాలికి కొట్టుకుపోయి పదవనాటి రాత్రి ఒగీజియా అనే దీవిపై వచ్చిపడ్డాడు. ఈ దీవిపై సమ్మోహిని అనే దేవత ఒక గుహలో నివసిస్తున్నది. ఆ గుహచుట్టూ గల పరిసరాలు చాలా అందంగా వున్నాయి. గుహచుట్టూ అడవి పొదలున్నాయి. వాటి చుట్టూ పచ్చిక మైదానాలూ, అందమైన సెలయేళ్ళూ వున్నాయి. గుహ ద్వారం మీదుగా ద్రాక్షతీగెలు పాకుతున్నాయి. వాటి నుంచి ద్రాక్షపళ్లగుత్తులు వేలాడుతున్నాయి.

రూపధరుడు ఆ దీవిపై అడుగుపెట్టి, తూలుతూ నడుస్తూవస్తున్న సమయంలో సమ్మోహిని అతనికి ఎదురువెళ్ళి, స్వాగతం చెప్పి, తన గుహకు తెచ్చింది. అతనికి ఆహారమూ, తాగటానికి మంచి సారా ఇచ్చింది. "నీవు ఎప్పటికీ ఇక్కడే నా భర్తగా ఉండిపోయినట్టయితే, నీకు చావూ, ముసలితనమూ లేకుండా చేస్తాను," అని ఆమె వాగ్దానం చేసింది.

ఆ దీవిలో ఆమెను ధిక్కరించి రూపధరుడు చేయగలినదేమీ లేదు. అతను ఆమె ఇష్టప్రకారమే ఆమెను పెళ్లాడి అయిదేళ్ళపాటు ఆ దీవిపై వుండిపోయాడు. అయితే రోజులు గడుస్తున్నకొద్దీ అతనికి స్వదేశానికి







వెళ్ళాలన్న కోరిక హెచ్చిందిగాని తగ్గలేదు. అతను రోజల్లా సముద్రతీరాన దిగులుగా కూచునే వాడు.

అతను తన స్వదేశాన్ని మరిచిపోయే లాగు చేయటం తనవల్ల కాదని తెలుసుకుని సమ్మోహిని ఒకనాడు అతనివద్దకు వచ్చి, "నిన్నుచూస్తే జాలివేస్తున్నది. నేను నిన్ను పంపెయ్యటానికి నిశ్చయించాను, దిగులు పడకు, లేచి చెట్లు నరికి తెప్ప ఒకటి తయారుచేసుకో. నీకు కావలిసినంత ఆహార పానీయాలిస్తాను, బట్టలిస్తాను, అనుకూల వాయువుకూడా ఇస్తాను. వాటి సహాయంతో ఇంటికి వెళ్ళిపో !" అన్నది.

ఈ మాటలు వినేసరికి రూపధరుడి శరీరం జలదరించింది. "ఇందులో ఏదో మోసం ఉన్నది. లేకపోతే ఈ మహాసముద్రాన్ని తెప్పమీద దాటమని నువు నాకు సలహా ఇయ్యేవు. బాగా నిర్మించిన నౌకలకే దిక్కు లేదు. అందుచేత నువు పూర్తి సమ్మతితో సహాయపడి పంపుతున్నావని నాకు నమ్మకం కలిగితే తప్ప నేను వెళ్లను," అన్నాడతను.

"నీ బుద్ధి వక్రబుద్ధి. అందుకే నీ కంత అనుమానం కలిగింది. కావలిస్తే ప్రమాణం చేస్తాను. నీకు సహాయపడాలనే నా ఉద్దేశం. నాది రాతిగుండె అనుకున్నావా? నిన్ను చూస్తే నాకు చాలా జాలిగా ఉంది," అన్నది సమ్మోహిని.

ఆమె అతన్ని తన గుహకు తీసుకు వెళ్లి సమస్తమైన భోజనపదార్థాలూ వడ్డించి భోజనం పెట్టింది. తరవాత ఆమె అతనితో, "నీకు ఇంటికి వెళ్ళాలని ఉండటం మంచిదే గాని, దారిలో ఎన్ని కష్టాలున్నాయో తెలిస్తే నువు నన్ను విడిచి వెళ్లవు. ముసలి తనమూ, చావూ లేకుండా ఇక్కడే ఉండి పోతావు," అన్నది.

దానికి రూపధరుడు, "ఇంటికి వెళ్ళాలని ఎంతో కాలంగా ఎదురుచూస్తున్నాను. ఇప్పటికే ఆ ప్రయత్నంలో అష్టకష్టాలూ





67





యోగించటానికి పనికివచ్చే వస్త్రాన్ని సమ్మోహిని ఇచ్చింది. తెప్పపడవను రూపధరుడు సముద్రంమీదికి చేర్చాడు.

ఇదంతా నాలుగు రోజులు పట్టింది. అయిదవరోజు సమ్మోహిని రూపధరుడిచేత స్నానంచేయించి, ప్రయాణానికి అవసరమైన ఆహారపదార్థాలూ, తిత్తులనిండా మంచి నీరూ, సారాపోసి ఇచ్చింది. రూపధరుడు తన తెప్పమీదికి ఎక్కి చుక్కాని పట్టుకుని కూచున్నాడు. అతనికి అనుకూలంగా మెల్లని గాలి సాగింది. రాత్రి అతను నిద్రపోక నక్షత్రాల సహాయంతో తెప్పను నడపసాగాడు. అతను సముద్రం మీద బయలుదేరేటప్పుడు సమ్మోహిని, "సప్తమహర్షులు నీ ఎడమచేతి వైపున వుండేటట్టుగా ప్రయాణం చెయ్యి," అని హెచ్చరించింది.

రూపధరుడు పదిహేడు రోజులపాటు ప్రయాణించాక సముద్రంమీద మళ్ళీ బ్రహ్మాండమైన తుఫాను బయలుదేరింది. ఆకాశంనిండా మబ్బులు కూడాయి. ప్రచండమైన గాలి సాగింది. రూపధరుడు తన చావు దగ్గిరపడిందనుకున్నాడు.

"నేనెంత అదృష్టహీనుణ్ణి! ట్రోయ్ యుద్ధంలో చనిపోయినవారు నాకన్న ఎన్నో రెట్లు అదృష్టవంతులు. వారి శవాలకు

పడ్డాను. ఒకవేళ దారిలో నా తెప్ప మునిగిపోతే నేను పడిన కష్టాలకు మరొకటి జత అవుతుంది. అంతకన్న ఏమున్నదీ? నేను చాలా ఓర్పుగల మనిషిని!" అన్నాడు.

మర్నాడు తెల్లవారుతూనే సమ్మోహిని రూపధరుడికి రెండువేపులా పదును గల ఒక కంచుగొడ్డలీ, బాడితా ఇచ్చి, తనవెంట అతన్ని ఆ దీవి చివరకు తీసుకుపోయింది. అక్కడ చాలా ఎత్తయిన చెట్లు గల తోపు ఒకటి ఉన్నది. రూపధరుడు ఇరవై చెట్లు నరికి, బాడితతో సాఫుచేసి చిన్నపడవ నిర్మించాడు. దానికి ఒక చుక్కానీ, తెరచాప స్తంభమూ అమర్చాడు. తెరచాపగా ఉప







సంస్కారం జరిగింది. ఈ నడిసముద్రంలో ఒంటరిగా దిక్కులేని చావు చచ్చేకన్న, వజ్రకాయుడు చచ్చినప్పుడే నేనూ పోయి ఉంటే ఎంత బాగుండేది!" అని అతను అనుకున్నాడు.

ఇంతకూ దేవతలు అతనిపై కత్తికట్టారు. గాలిఊపుకు చుక్కాని అతని చేతిలో నుంచి లాగేసినట్టుగా పోయింది. మరుక్షణం తెప్ప గుండ్రగా తిరిగింది. రూపధరుడు తెప్ప మీదినుంచి నీటిలో పడిపోయాడు. అతని దుస్తులు తడిసి బరువెక్కటంచేత అతను నీటి అడుగునుంచి త్వరగా పైకి రాలేక పోయాడు. ఆ బట్టలను ఎలాగో వదిలించుకుని అతను పైకి తేలి మళ్ళీ తన తెప్పను పట్టుకుని, దానిపైకి ఎక్కి కూచున్నాడు. అలల తాకుడుకు తెప్ప ఇంకా గుండ్రగా తిరుగుతూ, సముద్రంమీద బంతిలాగా అటూయిటూ కొట్టుకుంటున్నది.

ఈ సమయంలో రక్షకి అనే ఒక దేవతా స్త్రీ సముద్రపు పక్షిరూపంలో ముక్కున ఒక వస్త్రం పట్టుకుని వచ్చి అతని తెప్ప అంచున వాలి, "రూపధరా, నీకు ప్రాణ భయం లేదు. నిన్ను దేవతలు పీడించ గలరు గాని చంపలేరు, నువు ఇంటికి చేరుకుంటావు. అయితే ఈ తెప్ప కేవలం నిరుపయోగం. అందుచేత ఈ వస్త్రాన్ని నీ రొమ్ము చుట్టూ చుట్టుకుని నీటిలో దూకు. అలా చేసినట్టయితే నువు మునగవు. క్షేమంగా ఒడ్డు చేరుకుంటావుకూడా!" అన్నది.

రూపధరుడికి ఆ మాటలలో కొంచెం కూడా గురి కుదరలేదు. "నా కింకా కొత్త కష్టాలు తెచ్చిపెట్టటానికి ఇది పన్నాగం లాగుంది. మిన్ను విరిగి మీద పడినా సరే నేనుమాత్రం ఈ తెప్పను వదలను!" అనుకుని అతను గట్టిగా తెప్పను అంటిపెట్టుకుని కూచున్నాడు.

కాని మరి కాస్సేపట్లో పెద్ద అల వచ్చి అతని తెప్పను ముక్కలుముక్కలు చేసే





69



సింది. అతనికి ఒక చిన్న దుంగ మాత్రమే దొరికింది. గుర్రాన్ని ఎక్కినట్టు అతను దానిమీద ఎక్కి కూచుని, రక్షకి చెప్పిన ప్రకారమే ఆ వస్త్రాన్ని తన రొమ్ము చుట్టూ చుట్టుకున్నాడు. తరవాత అతను నీటిమీద బోర్లా పడుకుని, తన నిడుపైన చేతులతో ఈదసాగాడు.

అతనా కల్లోల సముద్రంలో రెండు రోజులపాటు ఈదాడు. మూడవనాడు తెల్ల వారేసరికి తుఫాను నిలిచిపోయింది. అంత దూరాన రూపధరుడికి తీరం కనిపించింది. ఇక తన కష్టాలు గడిచాయనుకుని రెట్టింపు ఉత్సాహంతో అతను తీరంకేసి ఈదసాగాడు. కాని ఆ తీరానకూడా తనకు ప్రాణ భయం ఎదురు కాబోతున్నదని అతనికి వెంటనే అర్థమయింది.

ఎందుచేతనంటే ఆ తీరమంతా శిలామయం. సముద్రకెరటాలు ఆ శిలల మీదికి ఉరికి నురుగులు కక్కుతున్నాయి. వాటి హోరు అతనికి వినిపిస్తున్నది. అలలు తనను ఆ రాళ్ళగుట్టల మీదికి విసిరికొట్టితే తన గతి ఏంకాను?

అతను అనుకున్నంతా అయింది. ఒక బలమైన అల అతన్ని అవలీలగా లేవదీసుకుని, అమిత వేగంగా రాళ్ళగుట్టల మీదికి లాక్కుపోయింది. అతను ఒక రాతిని బలంగా వాటేసుకున్నాడు. కాని ఆ అల తిరిగి వచ్చేటప్పుడు అతన్ని బలాత్కారంగా తీసుకుని మళ్లీ సముద్రంవేపు ఈడ్చింది. ఆ లాగుడుకు అతని రెండు చేతులూ ఘోరంగా దోక్కుపోయాయి.

ఈసారి రూపధరుడు తీరంకేసి ఈదటం మానేసి తీరంచుట్టూ ఈదసాగాడు. ఇలా కొంతదూరం ఈదాక అతనికి ఒక నదీ ముఖం ఎదురయింది. అతనికి ప్రాణం లేచివచ్చింది. తనను కాపాడమని నదిని ధ్యానిస్తూ అతను నేలమీదికి వచ్చి, వెంటనే స్పృహతప్పి పడిపోయాడు.—(ఇంకా వుంది)






## 8

[రూపధరుడి అనుచరులు తాము చేసిన ప్రమాణాన్ని నిలబెట్టుకోలేదు. రూపధరుడు దూరాన ఉన్న సమయంలో, మాయావి ప్రేరేపించగా వారు సూర్యభగవానుడి పశువులను చంపి వంట చేసుకు తిన్నారు. దాని ఫలితం త్వరలోనే కనబడింది. నడిసముద్రంలో రూపధరుడి పడవ మునిగిపోయింది. అందరూ సముద్రానికి ఎర అయారు. ఒక్క రూపధరుడుమాత్రం ఒక తీరాన వచ్చి పడ్డాడు.]

ఆ దేశాన్ని ఏలే రాజుపేరు మహామేధి. ఆయనకు వారుణి అనే కుమార్తె ఉన్నది. తెల్లవారుజామున ఆమెకొక వింతకల వచ్చింది. ఆ కలలో అమె స్నేహితురాలొకతె కనిపించి, "ఏమే, వారుణీ? నీకింత సోమరితనమేమిటే? బోలెడన్ని మాసిన బట్టలు ఉతకవలసి ఉందిగదా? రేపు పెళ్లికి మాసిన బట్టలు కట్టుకుంటావా? అంతా చూసి ఏమనుకుంటారు? తెల్లవారుతూనే బట్టలు ఉతకపోదాం పద. నేను కూడా నీ వెంట సాయం వస్తాను. బండి ఒకటి సిద్ధం చేయించమని మీ నాన్నతో చెప్పు. అంతదూరం వున్న చాకి రేవుదాకా నడవటం చాలా కష్టం," అన్నది.

వారుణి వెంటనే నిద్రమేలుకుని తూర్పు తెల్లవారుతూ ఉండటం గమనించింది. ఆమె కలలో చెప్పినట్టు చేయ నిశ్చయించుకుని తల్లివద్దకు వెళ్లి బట్టలు ఉతకబోతానని

గ్రీకు పురాణగాథ




చెప్పింది. తరవాత తండ్రివద్దకు వెళ్లింది. ఆయన అప్పుడే నాయకుల సమావేశానికి పోబోతున్నాడు.

"నాన్నా, నాకొక పెద్దబండీ కావాలి. నేను నదికి వెళ్లి ఈ పూట మనకున్న మంచిబట్ట లన్నీ ఉతుకుతాను. ఎంతోకాలంగా మైల బట్టలు చాలా పేరుకుని ఉన్నాయి. చూడబోతే ఇంటినిండా జనం ఉన్నారు. అందరూ ఎప్పటికప్పుడు చలవబట్టలు తెమ్మంటారు," అన్నదామె తండ్రితో.

మహామేధి, "దానికేం భాగ్యమమ్మా? పనివాళ్ళతో చెప్పి నీకు కావలిసినంత పెద్ద బండి కట్టించుకో," అన్నాడు.



వెంటనే కంచరగాడిదలతోసహా బండీ తయారయింది. వారుణికీ దాసీలకూ సరి పడా భోజనపదార్థాలు తీసుకున్నారు. వారుణి బండీ ఎక్కి కొరడా తీసుకుని కంచరగాడిదలను అదిలిస్తూ బండి తోల సాగింది. చాలామంది దాసీలు కబుర్లాడుతూ బండివెనకే నడవసాగారు.

కొంతసేపటికి వారు నదివద్ద చాకిరేవు చేరుకున్నారు. కంచరగాడిదలను విప్పి నదిఒడ్డున మేతకు వదిలారు. తరవాత వారు మైలబట్టలను పోటీలుపడి ఉతకసాగారు. చాకిపని ముగియగానే వారందరూ సముద్ర తీరానికి వెళ్లి అక్కడ స్నానాలు చేసి, నది ఒడ్డుకు తిరిగి వచ్చి బట్టలన్నీ ఆరవేసి భోజనాలు చేశారు.

తరవాత వాళ్లు పాటలు పాడుతూ బంతి ఆట ఆడసాగారు. ఆటలో బంతి ప్రమాద వశాన నీటిలో పడిపోయింది. అదిచూసి అందరూ ఒక్కసారిగా కేకలు పెట్టారు.

ఈ కేకలకు రూపధరుడు నిద్ర మేలు కున్నాడు. అతను పొదలలోనుంచి బయ టికి వచ్చి వారుణినీ ఆమె దాసీలనూ చూశాడు. మట్టికొట్టుకుని ఉన్న అతని ఆకారాన్ని చూసి వారుణి దాసీలందరూ బెదిరి పారిపోయి చెట్లవెనకా పుట్టలవెనకా








దాగారు. వారుణి మాత్రం నిర్భయంగా వున్నచోటనే నిలబడింది.

రూపధరుడు అంతదూరాన ఆగి వినయంగా, "సుందరీ, నీవు మనిషివో, దేవతవో, నాకు తెలియదు. నీ ఎత్తూ, అందమూ చూస్తే దేవతలాగున్నావు. ఒకవేళ నీవు మనిషివే అయితే నిన్నుకన్న తల్లిదండ్రుల మహాభాగ్యం ఏమని చెప్పాలి! నీ తోబుట్టువులెంత అదృష్టవంతులు! నిన్ను చేపట్టబోయేవాడు ఇంకా ఎంత అదృష్టవంతుడు! నేను అనేక దేశాలు తిరిగాను గాని నీవంటి అందగత్తెను ఎక్కడా చూడలేదు. ఇప్పుడు నేను చాలా దీనస్థితిలో ఉన్నాను. ఇరవై రోజులు సముద్రంమీద పడరానిపాట్లు పడి నిన్ననే ఈ తీరాన వచ్చిపడ్డాను. నాకీ దేశం కొత్త. నన్ను కాపాడితే నువే కాపాడాలి. నన్నూ నాస్థితినీ చూసి కనికరించి నాకు కట్టుకునేటందుకు తగిన వస్త్రం ఒకటి ఇప్పించు, మీ ఊరికి దారి చెప్పు. కరుణించి ఈ సహాయం చేస్తివా నీ పుణ్యం ఊరికేపోదు!" అన్నాడు.

"అయ్యా, నీవు తెలివిగల వాడివిలాగే కనిపిస్తున్నావు. సుఖమన్నది దేవతలు ప్రసాదించ వలసిందే. కాని నీ విప్పుడు మా దేశంలో ఉన్నావు గనక నీకు అన్నవస్త్రాలకు లోటుండదని నేను హామీ ఇస్తున్నాను. మా ఊరికి దారికూడా చెబుతాను. ఇది ఫైయాసియా దేశం, మహామేధి ఈ దేశానికి రాజు. నేనాయన కుమార్తెను," అన్నది వారుణి.

తరవాత ఆమె తన దాసీలను పిలిచి, "ఎందుకలా బెదురుగొడ్డలాగా పారిపోతారు. ఈయన మిమ్మల్ని తినేస్తాడా? పాపం, ఈయన ఇల్లూ వాకిలీ లేనివాడు. ఈయనకు తినటానికేమైనా ఇవ్వండి, నదిలో స్నానం చేయించండి," అన్నది.

దాసీలు రూపధరుడికి స్నానాల రేవు చూపెంచి, స్నానం అనంతరం వంటికి మర్దనచేసుకునే తెలమూ, కటుకోవటానికి







తరవాత దాసీలు రూపధరుడికి భోజనం పెట్టారు. అతను భోజనం చేసి అప్పటికి చాలా రోజులయింది.

ఈలోపుగా జరగవలిసినదాన్ని గురించి వారుణి దీర్ఘంగా ఆలోచించింది. ఆమె యుక్తవయసురాలు, పెళ్లి కానిది. ఆ దేశంలో అనేకమంది యువకులు ఆమెను పెళ్లాడటానికి సిద్ధంగా ఉన్నారు; వారినందరినీ ఆమె అదివరకే నిరాకరించింది. అటువంటి పరిస్థితిలో ఆమె రూపధరుణ్ణి తనవెంట నగరానికి తీసుకుపోవటం భావ్యంగా ఉండదు. ఎవడినో ఊరూ పేరు లేనివాణ్ణి భర్తగా సంపాదించి వెంట తెచ్చుకున్నదని అందరూ ఆడిపోస్తారు.

అందుచేత ఈ కొత్తవ్యక్తి తన అతిథిగా రావటంకంటె, అతనంతట అతనే తన ఇంటికి వచ్చి ఆతిథ్యంకోరటం అన్నివిధాలా మంచిదని వారుణి నిశ్చయించింది.

దాసీలు ఆరిన బట్టలను పోగువేస్తుండగా ఆమె రూపధరుడితో ఇలా అన్నది: "మనం ఇక బయలుదేరి పోదాం. నీవు మిగిలిన వారితోబాటు నా బండి వెనకనే నడిచిరా. ఈ విధంగా కోటగోడలదాకా రావచ్చు. కాని నాతోబాటు నగరంలో ప్రవేశించవద్దు. నలుగురూ నోటికి వచ్చినట్టు మాట్లాడతారు.

బట్టలూ ఇచ్చారు. రూపధరుడు నదిలో దిగి తన శరీరంమీద పేరుకునిఉన్న ఉప్పూ, మట్టీ కడుక్కుని, శరీరమంతా నూనె మర్దనచేసుకుని, రాజకుమార్తె ఇప్పించిన బట్టలు కట్టుకుని, పులికాపు చేసిన విగ్రహంలాగా నిగనిగలాడుతూ ఇవతలికి వచ్చాడు. అతన్ని మొట్టమొదట చూసి వికారంగా ఉన్నాడనుకున్న వారుణి ఇప్పుడతన్ని చూసి స్వర్గంలో వుండే దేవతలాగా ఉన్నాడనుకున్నది. తనకు అటువంటి భర్త దొరికితే బాగుండునని ఆమెకు అనిపించింది. అతను శాశ్వతంగా తమ దేశంలోనే ఉండిపోవాలని ఆమె కోరుకున్నది.





నగరం వెలపల ఒక తోట వున్నది. అందులో విశ్రాంతి తీసుకో. నేను ఇల్లు చేరటానికి కొంత వ్యవధి ఇచ్చి, అప్పుడు బయలుదేరి నేరుగా మా ఇంటికి వచ్చెయ్యి. మా ఇల్లు కనుక్కోవటం ఏమీ కష్టంకాదు, పసి పిల్లలను అడిగినా చెబుతారు. మా ఇల్లు చేరుకున్నాక ఎక్కడా ఆగకుండా నేరుగా లోపలికి రా. అక్కడ నీకు మా నాన్నా, అమ్మా కనిపిస్తారు. నీవు సంకోచించకుండా మా అమ్మను సమీపించి, ఉపాయంగా ఆవిడతో ప్రసంగించి అతిథ్యం కోరు. నీ ధోరణి ఆవిడకు నచ్చిందంటే నీ పని సాను కూలమైనట్టే. మా రాజభవనంలో ఆవిడ మాటకు ఏనాడూ తిరుగులేదు. నీ అదృష్టం బావుండి ఆవిడ అనుగ్రహిస్తే నీకు ఎంత సహాయమైనా లభిస్తుంది."

తరవాత వారుణి బండీ ఎక్కి కంచర గాడిదెలను అదిలించింది. అందరూ బయలుదేరారు. వారు తోటను చేరగానే రూపధరుడు అక్కడ దిగబడిపోయాడు. మిగిలినవారు ముందుకు సాగారు. అప్పటికి సూర్యాస్తమానమయింది. రూపధరుడు తన ఇష్టదేవత అయిన బుద్ధిమతిని చాలాసేపు ధ్యానించి తానుకూడా రాజభవనానికి బయలుదేరాడు.



ఈ లోపుగా రాజకుమార్తె వారుణి ఇల్లు చేరుకున్నది. ఆమె అన్నలు అయిదుగురూ వచ్చి ఉతికిన బట్టలను లోపలికి తీసుకు పోయారు. అప్పుడే పాయిలు రాజేసి వంట ప్రారంభించినట్టు వారుణి తెలుసుకున్నది.

రూపధరుడు నగరంలో ప్రవేశించాడు. కాని చీకటిలో అతన్ని ఎవరూ గమనించ లేదు, పలకరించలేదు. అతనికి ఒక చిన్న పిల్ల నీటికుండతోసహా ఎదురయింది. రూప ధరుడు ఆమెను పలకరించి, "చూడమ్మా, నేను పరదేశిని. నాకు మహామేధి మహా రాజుగారి ఇంటికి దారి చూపగలవా?" అని అడిగాడు.




"నేను చూపిస్తాను రా, బాబయ్యా. నువ్విలా ఇక్కడివాళ్ళను పలకరించ గూడదు, తెలుసా. పరదేశీలంటే ఇక్కడి వాళ్ళకు చాలా అనుమానం. అందుచేత మాట్లాడకుండా, ఎవరికేసీ చూడకుండా, నా వెనకనే రా!" అన్నదా పిల్ల.

ఆమె వెంట రూపధరుడు రాజభవనం చేరాడు. ఆ భవనం దేదీప్యమానంగా ఉన్నది. రూపధరుడు లోపల ప్రవేశించ టానికి జంకాడు. అతను చాలాసేపు అక్కడే నిలబడి అక్కడ ఉన్న దివిటీల వెలుగులో పనులు చేస్తున్న బానిసలనూ, నాలుగెకరాల పళ్ళ తోటనూ చూశాడు.



చివర కతను సాహసించి లోపల ప్రవే శించాడు. వారుణి చెప్పిన ప్రకారమే అతను నేరుగా లోపలికి వెళ్ళాడు.

లోపల ఒక విశాలమైన చావడిలో నగ రపు పెద్దలందరూ భోజనాలకు కూచుని ఉన్నారు. రూపధరుడు చావడికుండా నడిచి వెళ్లగా లోపల అతనికి రాజూ, రాణీ కని పించారు. రూపధరుడు నేరుగా రాణిముందు మోకరించి, "మహారాణీ, నేనొక నిర్భా గ్యుణ్ణి! శరణార్థిగా మీ వద్దకు వచ్చాను. మీరూ మీ పరివారమూ పుత్రపౌత్రాభి వృద్ధిగా వర్ధిల్లాలి! నేను స్వదేశానికి తిరిగి వెళ్ళిపోవటానికి మీరు నాకు సహాయం చెయ్యాలి," అన్నాడు.

అతను ఇలా చెబుతుంటే అక్కడ ఉన్న వారందరూ నిర్ఘాంతపోయి చూశారు. చివర కొక వృద్ధుడు మహామేధితో, "రాజా, మన అతిధి నేలమీద కూర్చునివుండటం మన మర్యాదకు లోపం. అందుచేత నీవు స్వయంగా ఈ పెద్దమనిషిని ఒక ఆసనంపై కూచోబెట్టి మనతోబాటు భోజనానికి ఆహ్వానించు," అన్నాడు.

మహామేధి లేచి రూపధరుడికి చెయ్యి యిచ్చి తీసుకుని వచ్చి తన పక్కనే, తన పెద్ద కుమారుడు కూచుని ఉన్న ఆసనం







మీద కూచోబెట్టాడు. రూపధరుడికోసం అ యువకుడు తన ఆసనాన్ని ఖాళీచేసి వేరే ఇంకొక చోట కూచున్నాడు. తరవాత అందరూ కలిసి భోజనాలు చేశారు.

భోజనాలు అయాక మహామేధి మహా రాజు లేచి నిలబడి పెద్దలతో ఇలా అన్నాడు:

"మీరంతా భోజనాలు చేశారు. ఈ పూటకు ఎవరిమానాన వారు విశ్రాంతి తీసుకుని నిద్రపొండి. రేపు ఉదయం పెంద లాడే మనమంతా సమావేశమై మన అతి థికి వినోదాలు చేకూర్చి తరువాత ఆయన ప్రయాణం సంగతి చూదాం. ఆయన స్వదేశం ఎంతదూరాన ఉన్నా సరే అక్కడి కాయన సుఖంగా, క్షేమంగా చేరే ఏర్పాట్లు చేయటం మన విధి. మనం మంచి ఏర్పాట్లు చేసినప్పటికీ ఆయన కష్టాలు పడాలని రాసి పెట్టి ఉంటే తప్పేది లేదు. ఒకవేళ ఈయన మానవరూపంలో అవతరించిన దేవతే అయినాకూడా అది మనకు కొత్త సంగతి కాదు. దేవతలు అప్పుడప్పుడూ నర రూపంలో మనని చూడవచ్చి మనతో పాటు విందు వినోదాలలో పాల్గొనటం అనా దిగా వస్తున్నదే!"

ఈ మాటలు వినగానే రూపధరుడు, "మహారాజా, మీరలాటి అపోహ పడకండి. నేను దేవతను కాను, మానవుణ్ణే, అందు లోనూ అష్టకష్టాలకు గురిఅయిన మాన వుణ్ణి. బహుశా నేను భరించిన బాధలు ఇంకొకరెవరూ భరించి ఉండరు. అందుచేత యింతటితోనైనా నా కష్టాలను గట్టెక్కించ టానికి తమరు సాయపడండి. నాకు మిగిలి ఉన్న కోరిక ఏమంటే నా దేశాన్నీ, నా వారినీ ఒక్కసారి కళ్ళచూసి మరణించా లని!" అన్నాడు.

ఈ మాటలు విని అందరూ రూపధరుడి పైన సానుభూతి ప్రకటించారు. అందరూ అక్కడినుంచి వెళ్ళాక రూపధరుడూ, రాజూ, రాణీ మాత్రం మిగిలారు.





రాణీ రూపధరుడికేసి తిరిగి అతను ధరించిన దుస్తులు తాను కుట్టినవేనని గుర్తించి, "నాయనా, నిన్ను మొట్టమొదటి ప్రశ్న నేనే అడుగుతాను. నువ్వెవరు? ఎక్కడినుంచి వస్తున్నావు? నీకీదుస్తులు ఎవరిచ్చారు? నువు సముద్రంమీద కొట్టుకు వచ్చానని చెప్పావు కాదూ?" అన్నది.

తాను సమ్మోహిని చెరనుండి బయట పడినది లగాయతు ఈ దేశపు తీరాన వచ్చి పడేవరకూ జరిగిన కథ యావత్తూ రూపధరుడు వివరించి చెప్పాడు. తరవాత వారుణి రావటమూ, తను ఆమెకు తన దీనావస్థగురించి చెప్పుకోవటమూ, ఆమె తనకు తిండీ బట్టా ఇవ్వటమూకూడా దాచకుండా అతను వారితో చెప్పేశాడు.

అంతా విని మహామేధి, "అయ్యో, నా కూతురు చాలా పొరపాటు చేసింది. ఆమె మిమ్మల్ని తనవెంట తీసుకుని వచ్చి ఉండవలిసింది!" అన్నాడు.

"మహారాజా, ఆమెను నిందించకండి. ఆమె నన్ను తనవెంట రమ్మనే అన్నది. కాని మనుషులకు వెరిచి నేనే జంకాను," అన్నాడు రూపధరుడు.

"మీరు మా అమ్మాయిని పెళ్ళాడి ఇక్కడే ఉండిపోతానన్నా నేను అభ్యంతరం చెప్పి ఉండను. మీరు సంకోచించి ఉండవలిసిన అవసరం లేదు. ఈ రాత్రికి నిద్రపొండి. రేపు మీ ప్రయాణం ఏర్పాట్లన్నీ చేసి మీరు క్షేమంగా స్వదేశం పోయేలాగు చూస్తాను. నా ఓడలను మించిన ఓడలు గాని, మా నావికులను మించిన నావికులు గాని మీకు ప్రపంచంలో ఎక్కడా దొరకరు," అన్నాడు రాజు.

వారీవిధంగా మాట్లాడుకుంటూ ఉన్న సమయంలో రాణి రూపధరుడికి పక్క వేయించింది. రూపధరుడు తాను పడిన కష్టాలన్నీ మరిచి ఆ పక్కమీద పడుకుని సుఖంగా నిద్రపోయాడు. —(ఇంకా వుంది)






## 9

[సూర్యభగవానుడి పశువులను చంపి తిన్న పాపాన రూపధరుడి అనుచరులందరూ, నౌకతో సహా, సముద్రం పాలయారు. రూపధరుడు ఒంటరిగా ఒక తీరాన వచ్చిపడి, ఆవేశాన్ని ఏలే మహామేధి మహారాజుకుమార్తె అయిన వారుణి సహాయంతో రాజభవనం చేరుకుని ఆశ్రయం సంపాదించుకున్నాడు. మహామేధి రూపధరుడికి అన్నివిధాలా తోడ్పడతానని మాట ఇచ్చాడు. ఆ రాత్రి రూపధరుడు సుఖంగా నిద్రపోయాడు.]

మర్నాడు తెల్లవారింది. మహామేధితోబాటే రూపధరుడుకూడా నిద్రలేచాడు. ఇద్దరూ కలిసి సభాభవనానికి వెళ్ళారు. ఈ సభాభవనం ఓడలరేవుకు సమీపంలోనే ఉన్నది. అందులో నున్నని రాతితోచేసిన ఆసనాలున్నాయి. మహామేధి ఒక ఆసనంపై కూచుని రూపధరుణ్ణి తన పక్కనే కూచోబెట్టాడు. ఈ లోపుగా రాజుగారి భటుడొకడు రూపధరుడి ప్రయాణపు ఏర్పాట్లు చూడటానికి నగరంలోకి వెళ్ళాడు. అతను పెద్దలనందరినీ పేరుపేరునా సభాభవనానికి ఆహ్వానించి, ఎవరో అపూర్వ పురుషుడు రాజుగారికి అతిథిగా వచ్చినట్టు తెలియజేశాడు.

ఈ కొత్త వ్యక్తిని చూడటానికి పెద్దలందరూ వెంటనే బయలుదేరి వచ్చారు. త్వరలోనే సభాభవనంలోని ఆసనాలన్నీ భర్తీ అయాయి. అక్కడ సమావేశమైన వారితో రాజు ఇలా అన్నాడు:

గ్రీకు పురాణగాథ



63




"మహాజనులారా, నాపక్కన ఆసీనుడై ఉన్న వ్యక్తి నా ఇంటికి అతిథిగా వచ్చాడు; ఆయన ఎవరో నాకు తెలియదు. ఆయన సముద్రంమీద వచ్చాడు: ఆయన తూర్పు నుంచి వచ్చాడో, పడమటనుంచి వచ్చాడో కూడా నాకు తెలియదు. అయితే ఆయన తన ప్రయాణానికి సహాయం చెయ్యమని నన్ను కోరాడు. దానికెన్నడూ అభ్యంతరం లేదు, ఎందుకంటే నాయింటికి అతిథిగా వచ్చి అసంతృప్తితోవెళ్ళిపోయిన వారెవరూ లేరు. కనుక మనం మన అచారం తప్పకుండా ఈ వ్యక్తికి సహాయం చెయ్యవలసి ఉన్నది. మనం ఒక కొత్త నౌకను ఈయన పరంచేసి తెడ్లువేసేవారిని యాభైఇద్దరిని తోడు ఇద్దాం. తెడ్లు వెయ్యటంలో సమర్థులైనవారు బయలుదేరి వెళ్ళి నౌకలో తెడ్లు అమర్చి భోజనానికి మాయింటికి వచ్చేయండి. మిగులిన పెద్దలు కూడా మా ఇంటికే విందుకు రావాలి. విందు ఏర్పాట్లు పెద్ద ఎత్తున చేయిస్తాను. విందు సమయంలో వినోదంగా పాడటానికిగాను తగిన మనిషినిచూసి పిలిపించండి."

మహామేధి మహారాజు సభికులతో ఈ మాటలు చెప్పి, రూపధరుణ్ణి వెంట తీసుకుని తన భవనానికి బయలుదేరి వెళ్ళాడు. వెంటనే పాడేవారికి కబురు వెళ్ళింది. యాభై ఇద్దరు సమర్థులైన నావికులు కొత్తపడవను జలప్రవేశం చేయించి, తెడ్లు అమర్చారు. దానికి వారు ఒక తెల్లని తెరచాప ఎత్తి, నౌకను లోతునీటిలో లంగరువేసి రాజభవనానికి వెళ్ళారు.

రాజభవనంలోని గదులు, చావడులూ, ప్రాంగణాలూ అతిథులతో నిండిపోయాయి. విందుకుగాను గొర్రెలనూ, అడవి పందులనూ, ఎద్దులనూ కోశారు. విందుసమయంలో పాడటానికి ఒక అంధగాయకుడు పిలిపించబడ్డాడు.

అందరూ భోజనాలుచేసే సమయంలో ఆయన పాడిన పాట రూపధరుడి జీవితంలో



జరిగిన సంఘటనకు సంబంధించినవే. ఆ సంఘటన ఏమంటే —

ట్రోయ్‌యుద్ధం ఇంకా ఆరంభం కాలేదు. రారాజు భవిష్యత్తు తెలుసుకునే నిమిత్తమై మైథోపద్ద ఉన్న సూర్యాలయానికి వెళ్లాడు. "ట్రోయ్ పతనమయేలోపుగా నీ యోధుల మధ్య కలహం జరుగుతుంది," అని సూర్య భగవానుడు రారాజుకు తెలియజరిచాడు. అలాగే జరిగిందికూడా. ఒకనాడు భోజనాల దగ్గిర రూపధరుడూ వజ్రకాయుడూ తగాదా పడి ఒకరినొకరు గట్టిగా తిట్టుకున్నారు. రారాజు ఈ తగాదా చూసి విచారించటానికి బదులు చాలా సంతోషించాడు. ఎందుచేతనంటే ఇది తనకు శుభసూచకమని సూర్యభగవానుడు అదివరకే చెప్పి ఉన్నాడు.

అంధగాయకుడు ఈ విందులో పై సంఘటనను పాటకట్టి పాడాడు. కాని ఈపాట వింటుంటె రూపధరుడికి దుఃఖావేశం ముంచుకువచ్చింది. తనకంటినీరు ఇతరులు చూసిపోతారని అతను తన ముఖాన్ని బట్ట కొంగుతో కప్పేసుకున్నాడు. మధ్యమధ్య గాయకుడుపాట నిలిపినప్పుడు రూపధరుడు తన కళ్ళు తుడుచుకుని ముఖానికి అడ్డం తొలగించేవాడు. మళ్ళీ గాయకుడు పాట ఆరంభించగానే అతనికి కంటివెంట అశ్రు



ధారలు కారేవి, అతను ముఖాన్ని తిరిగీ బట్టతో కప్పేసుకునేవాడు.

రూపధరుడి చర్యలను ఇతరులెవరూ గమనించలేదు గాని, అతని పక్కనే కూచుని భోజనం చేస్తున్న మహామేధి గమనించాడు. రూపధరుడు బాధతో మూలగటంకూడా ఆయనకు వినిపించింది.

చిట్టచివరకు మహామేధి తన అతిథులతో, "మిత్రులారా, మనం కడుపునిండా భోజనం చేశాం. ఇక ఈ పాట చాలించి, మనం వ్యాయామక్రీడలు ప్రదర్శింతాం. మల్లయుద్ధంలోనూ, దూకటంలోనూ మన ప్రజ్ఞ ఎంత అసాధారణమైనదో మన అతిథిచూసి



సట్టయితే ఆయన తన దేశవాసులకు చెప్పగలుగుతాడు!" అన్నాడు.

రాజుగారు లేపగానే అందరూ లేచి మైదానానికి బయలుదేరారు. అక్కడ అనేకవేల మంది గుమికూడారు. వ్యాయామక్రీడలలో ఆరితేరిన యువకులంతా పోటీలలో పాల్గొనటానికి సిద్ధంగా ఉన్నారు. మొదట పరుగు పందెం జరిగింది. తరవాత మల్లయుద్ధమూ, దూకటమూ, బరువు విసరటమూ మొదలైనవి జరిగాయి. అన్నిపందాలలోనూ తలా ఒకరూ గెలిచారు. మల్లయుద్ధంలో రాజు కొడుకు గెలిచాడు. అతను తన అనుచరులతో, "ఒరే, మన అతిథి చిన్నతనంలో ఏయే వ్యాయామక్రీడలు అభ్యసించాడో తెలుసుకుందామా? మనిషి చూడటానికి దృఢంగానే ఉన్నాడు. తొడలూ, పిక్కలూ, మెడా బలిష్ఠంగా ఉన్నాయి. చేతులు దృఢంగా ఉన్నాయి. వయసుకుకూడా ముదిసినవాడేమీ కాదు!" అన్నాడు.

రాజకుమారిడితో అతని అనుచరులు, "భేష్! నువే వెళ్లి ఆయనను ప్రశ్నించి, పోటీకి పిలు!" అన్నారు. అతను రూపధరుణ్ణి సమీపించి, "అయ్యా, మీకు వ్యాయామక్రీడలతో పరిచయం ఉన్నట్టయితే ఆటలలోకి రండి. ప్రతి మనిషికీ వ్యాయామక్రీడలు తెలిసివుండాలి. మీరు నిరుత్సాహంగా





వుండవలిసిన పనిలేదు ; మీకోసం నౌకా, నావికులూ కూడా సిద్ధంగా వున్నారు," అని చెప్పాడు.

"అలా ఎందుకంటావు, నాయనా? మీరంతా నన్ను వేళాకోళం పట్టిస్తున్నారు లాగుంది. నా మనస్సులో ఇప్పుడు కష్టాలకు తప్ప, ఆటలకు చోటులేదు. మీ అతిథిగా నేనీ ఆటలపోటీలు చూస్తున్నానేగాని, చూసి ఆనందించటానికి కాదు. నాకు కావలిసిందల్లా మా ఇల్లు చేరటమే!" అన్నాడు రూపధరుడు.

అతన్ని రెచ్చగొట్టే ఉద్దేశంతో ఇంకొక యువకుడు రూపధరుడితో, "కాకపోయినా మీ అవతారం చూస్తే వ్యాయామక్రీడలు తెలిసినట్టు లేదులెండి! ఏ వర్తక నౌకనో నడుపుకుంటూ, బేళ్లు లెక్కించటమూ, జమా ఖర్చులు చూసుకోవటమూ, లాభాలు కూడుకోవటమూ మాత్రమే చాతనయిన మనిషిలాగా కనబడతారు!" అన్నాడు.

రూపధరుడికి నిజంగానే కోపం వచ్చింది. అతను కనుబొమలు ముడివేసి, "అబ్బాయీ, కొందరిని భగవంతుడు వికారంగా సృష్టిస్తాడు, కాని వారు నోరు తెరిస్తే ముత్యాలు రాలుతాయి. వారి మాటలు వినటానికి ప్రజలు ఎగబడతారు. మరికొందరు చూడటానికి అందంగానే వుంటారు గాని వారు

నేను విప్పితే అందరూ చెవులు మూసుకో వలసిందే. భగవంతుడు నీకు అందం ఇచ్చాడుగాని మెదడు ఇవ్వలేదు. నేను చాలా కష్టాలుపడి శుష్కించి వున్నాను. అయినా నాకేపాటి శక్తి ఉన్నదో చూపి స్తాను," అంటూ చివాలున తనువున్న ఆసనంమీది నుంచి లేచి ఒక పెద్ద రాతి గుండు తీసుకుని తన తలపైన ఒకచుట్టు తిప్పి, బలంకొద్దీ విసిరాడు.

దూరం కొలిచే కుర్రవాడు ఆ గుండు పడిన చోటికి వెళ్లి దూరంకొలిచి, "అయ్యా, మిగిలినవాళ్లు విసిరిన గుండ్లన్నిటికన్నా మీరు దూరం విసిరారు. ఇంతదూరం మరెవ్వరూ విసరలేరు, మీరు నిశ్చింతగా వుండవచ్చు!" అని కేకపెట్టాడు.

రూపధరుడికి ఈ మాటలు విని ఆనందం కలిగింది. అతను ఉత్సాహంతో, "అబ్బాయిలూ, చాతనయితే మీరు నాతో పోటీపడి గుండు విసరండి! నేను ఇందులోకి దిగనే దిగాను గనక వెనక్కు తగ్గేదిలేదు. మల్ల యుద్ధమైనాసరే, పరిగెత్తటమైనాసరే-ఎవరు వస్తారో రండి! నాకు విలువిద్యకూడా చాతనవును. యుద్ధరంగంలో ఆ విద్యలో నాకన్న సమర్థుడు ధనధవుడు ఒక్కడే వుండేవాడు. దేవతల మాట చెప్పనుగాని, మానవమాత్రు




లతో ఎవరితోనైనా ఏ విద్యలోనైనా పోటీకి నేను సిద్ధమే!" అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు.

మహామేధి రూపధరుడికేసి తిరిగి, "అయ్యా, మనలను ఇంకొకరు చులకన చేసి మాట్లాడినప్పుడు మన గొప్ప మనం చెప్పుకుంటే అందులో తప్పేమీలేదు. మీ శక్తిసామర్థ్యాలను శంకించే అర్హత ఇక్కడ ఎవరికీ లేదు. మాకు కావలిసినదల్లా మీరు ఇక్కడ కొంత ఆనందంపొంది వెళ్లటమే. కొన్ని విద్యలలో మేము ఘటికులం. మల్ల యుద్ధంలోనూ, ఇతర వ్యాయామక్రీడల లోనూ మాకు ప్రత్యేకమైన నేర్పు లేదు.

మాకు నేప్పున్నది నౌకలు నిర్మించటంలో, నౌకలు నడపటంలో, పాటలు పాడటంలో, నృత్యం చెయ్యటంలో. వీటిని మీరు తిలకించాలని నా కోరిక. స్వగృహం చేరుకుని మీ భార్యాబిడ్డలమధ్య సుఖంగా కూచుని వున్న సమయంలో వీటిని జ్ఞాపకం చేసుకోవటమే మాకు కావలిసినది!" అన్నాడు.

తరవాత నృత్యగానాలు విర్పాటుచేశారు. ఆ దేశంవారు చేసిన బృందనృత్యాలు చూసి రూపధరుడు అద్భుతంచెందాడు. అతను మహామేధితో, "మహారాజా, ఇంత అద్భుతమైన నృత్యాలు నేనెక్కడా చూడలేదు," అన్నాడు వుత్సాహంగా.

తన అతిథి ఆ మాట అనేసరికి రాజు పరమానందంచెందాడు. ఆయన తన దేశంలో ఉన్న పన్నెండుమంది రాజకుమారులను పిలిచి, వారిచేత తన అతిథికి మంచి బట్టలు పెట్టించి, బంగారం బహుమానంగా ఇచ్చాడు. రూపధరుణ్ణి కవ్వించిన యువకుడు, దంతపు ఒరా, వెండి పిడీగల తన కత్తిని రూపధరుడికి బహూకరించాడు.

ఆ రాత్రి భోజనాల దగ్గిర అంధగాయకుడు "కొయ్యగుర్రం" కథ గానం చేశాడు. గ్రీకులు తమ శిబిరాన్ని తగలబెట్టి తమ నౌకలలో వెళ్లిపోవటంతో కథ అరంభమయింది. తరవాత ట్రోజనులు కొయ్యగుర్రాన్ని నగరంలోకి తీసుకుపోవటం మొదలైన వివరాలు వింటూ రూపధరుడు విచారంతో కుంగిపోయి ఏడవసాగాడు.

అది గమనించి మహామేధి పాట నిలుపు చేయించి, రూపధరుడికేసి తిరిగి, "అయ్యా, దాచకుండా నిజం చెప్పండి. మీరెవరు? మీపేరేమిటి? ఊరేమిటి? మీది ఏదేశం? మీరు ఎక్కడినుండి వస్తున్నారు? ట్రోయ్ యుద్ధం కథ మీకెందుకు విచారం కలిగిస్తున్నది? ఆ యుద్ధంలో మీ ఆప్తులెవరైనా మరణించలేదుగద!" అన్నాడు.

(ఇంకా ఉంది)






## 10

[సముద్రం మీద పడవలసిన పాట్లన్నీ పడి, తన నౌకలన్నిటినీ, అనుచరులనందరినీ కోల్పోయి, ఫైయాసియా తీరాన వచ్చిపడిన రూపధరుడికి మహామేధి మహారాజు ఆతిథ్యమూ, అభయమూ ఇచ్చాడు. రూపధరుడి గౌరవార్థం జరిగిన విందులో అంధగాయకుడు "కొయ్యగుర్రం" కథ గానంచేస్తూ ఉండగా రూపధరుడు కంట తడిపెట్టసాగాడు. అది చూసి మహామేధి తన అతిథిని, "మీరెవరు? మీది ఏ దేశం?" అని ప్రశ్నించాడు.]

రూపధరుడు మహామేధి మహారాజుకు తన ఊరుపేరూ తెలుపుకుని, ట్రోయ్ పతనానంతరం తనకు కలిగిన ఇక్కట్లూ, అనుభవాలూ వివరించి చెప్పాడు. అతను తన కథ ముగించాక మహామేధితో పాటు అందరూ అత్యాశ్చర్యంచెందారు.

చివరకు మహామేధి అక్కడ చేరిన వారితో, "మన అతిథికి ఉమ్మడి ఖర్చులో మన మందరమూ బహుమతులు ఇద్దాం. నేను స్వయంగా ఈయనకు కొంత బంగారమూ, ఉడుపులూ, ఇతర కానుకలూ ఇస్తున్నాను," అన్నాడు. దీనికి అందరూ ఒప్పుకున్నారు.

మర్నాడు తెల్లవారుతూండగానే బహుమతులన్నీ రేవు చేరాయి. మహామేధి స్వయంగా దగ్గిర ఉండి వాటిని పడవలో తగినచోట్ల పెట్టించాడు. ఆ పూట రాజభవనంలో రూపధరుడికి బ్రహ్మాండమైన వీడ్కోలువిందు జరిగింది. అందరూ ఎంతో ఉత్సాహంగా ఉన్నారు. కాని ఎప్పుడు

గ్రీకు పురాణగాథ






బయలుదేరి తనదేశం చేరుదామా అని ఆత్రపడుతున్న రూపధరుడు మాత్రం పొద్దుకేసి చూడసాగాడు.

చివరకు భోజనాలు ముగిసి పానీయాలు వచ్చాయి. రూపధరుడు లేచి నిలబడి, "మహాజనులారా, మీ పుణ్యంవల్ల ఇంత కాలానికి నా చిరకాల వాంఛితం ఈడేరి, నా దేశానికి నేను వెళ్లిపోతున్నాను. మీరు నాకు చూపిన ఆదరమూ, చేసిన సహాయమూ, ఇచ్చిన కానుకలూ ఎన్నటికీ మరువలేను. దేవతలు మీకు సంతోషమూ, సౌఖ్యమూ, అఖండ విజయాలూ చేకూర్తురుగాక! మీ దేశానికి ఎలాటి అరిష్టాలూ కలగకుండుగాక!" అన్నాడు. ఈ మాటలకు అక్కడ చేరినవారందరూ హర్షించారు. రూపధరుడు రాణివద్దకూడా సెలవు పుచ్చుకున్నాడు. ఆమె అతనికి అందమైన దుస్తులు బహూకరించింది, దాసీలచేత అతని పడవ వద్దకు పుష్కలంగా రొట్టెలూ, ఎర్రద్రాక్షరసమూ పంపింది.

పడవ నడిపే యువకులు పడవలోపల రూపధరుడికోసం కంబళీ పరిచి పక్కా, దుప్పటీ ఏర్పాటుచేశారు. రూపధరుడు పడవ ఎక్కి ఆ పక్కమీద పడుకున్నాడు. నావికులు తమ స్థానాలలో కూచుని తెడ్లు వేయసాగారు. పడవ కదిలింది.

రూపధరుడికి వెంటనే నిద్రపట్టింది. తన కష్టాలు తీరిపోయాయన్న ఆనందంలో అతను మైమరచి గాఢనిద్రలో మునిగిపోయాడు. పడవ వాయువేగంతో ప్రయాణించి మర్నాడు వేగుచుక్క పొడిచే సమయానికి ఇథకా చేరింది.

ఇథకాతీరాన ఒక మంచి రేవున్నది. ఆ రేవులో చేరిన పడవలు లంగరుకూడా దించవలిసిన అవసరం లేదు. ఈ రేవుకు దగ్గిరగా ఒక పెద్ద చెట్టున్నది. ఆ చెట్టుకు నిడుపైన ఆకులున్నాయి. ఆ చెట్టు పక్కనే ఒక గుహ ఉన్నది. అందులో తేనెపట్లు





న్నాయి, ఎత్తయిన రాతి స్తంభాలున్నాయి. ఈ గుహకు దేవకన్యకలు వస్తారని ప్రతీతి. అందులోకి మనుషులు పోవచ్చు.



పడవ రేవును తగలగానే నావికులు ఒడ్డుకు దూకారు. మైమరచి నిద్రపోతున్న రూపధరుణ్ణి వారు నిద్ర లేపకుండా ఉన్న వాణ్ణి ఉన్నట్టుగా ఎత్తుకువచ్చి తీరాన ఉన్న ఇసకలో, పక్కతో సహా, పడుకో బెట్టారు. తరవాత అతని వస్తువులన్నిటినీ చెట్టుకింద పేర్చిపెట్టి, పడవను నడుపు కుంటూ వారి దేశానికి తిరిగి వెళ్ళిపోయారు.

రూపధరుడు నిద్రలేచి కళ్ళుతెరిచి చుట్టూ కలయజూశాడు. పొగమంచు దట్టంగా అలుముకుని ఉండటంచేత అతనికి తాను ఎక్కడ ఉన్నదీ తెలియరాలేదు. ఎదట ఉన్న రేవునూ, పక్కన ఉన్న కొండలనూ కూడా అతను పోల్చుకోలేకపోయాడు. అతను నిరాశతో, "అయ్యో, మళ్లీ ఎక్క డికో వచ్చిపడ్డానే! ఇక్కడ ఎలాటి మనుషు లుంటారో? వారు క్రూరులూ, నరభక్షకులూ కారుగద? నావెంట ఈ వస్తువులన్నీకూడా దేనికి? వీటిని ఎక్కడ దాచేది? మహామేధి మహారాజు నాకు పూర్తిగా తోడ్పడ్డాడుకాడు; ఇథకా చేర్చుతానని మాట ఇచ్చి ఇంకెక్కడో దిగబెట్టాడు," అనుకున్నాడు.

అతను వస్తువులన్నీ ఎంచి చూసు కున్నాడు; ఒక్కటీ పోలేదు. అతను తన దేశాన్నిగురించి ఆలోచిస్తూ అటూ ఇటూ పచారుచేస్తూండగా అటుకేసి ఒక గొర్రెల కాపరి కుర్రవాడు వచ్చాడు. రూపధరుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. అతనా యువకుణ్ణి సమీపించి, "దేవుడల్లే కని పించావు, నాయనా! నువే నన్ను కాపాడాలి. అబద్ధమాడకుండా చెప్పు, ఇది ఏ దేశం? ఇక్కడ ఎలాటి మనుషులుంటారు? ఇది ద్వీపమా లేక తీరమేనా?" అని అడిగాడు.

దానికి యువకుడు, "అయ్యా, మీకు ప్రపంచజ్ఞానం తక్కువలాగుంది! లేక మీరు



దూరదేశంవారయి ఉండాలి. ఎందుకంటే మా దేశం ఊరూ పేరూ లేనిది కాదు. ఇథకాదేశాన్ని గురించి ట్రోయ్‌నగరంలో కూడా చెప్పుకుంటారు!" అన్నాడు.

రూపధరుడు చాలా చతురుడు. తాను చేరినది ఇథకా అని తెలిసి అతను లోలోపల చాలా పొంగిపోయాడు; కాని ఆ ఆనందాన్ని అణిచిపెట్టుకుంటూ, "అవునవును! క్రీట్ దీవులలోకూడా ఈ దేశంగురించి చెప్పుకోగా విన్నాను. నేను ఒక దుర్మార్గుణ్ణి చంపెయ్యటంచేత పారిపోయి రావలిసివచ్చిందిలే," అంటూ అతను గొర్రెలకాపరికి ఒక కట్టుకథ అల్లి చెప్పాడు.



అతను మాట్లాడుతున్నంతలోనే గొర్రెల కాపరి అంతర్ధానమై, వాడి స్థానంలో బుద్ధిమతీదేవి ప్రత్యక్షమయింది. ఆమె నవ్వుతూ, "నీకన్న జిత్తులమారివాడు మరొకడులేడు! ఎంత అవలీలగా కథలు అల్లగలవు! నీ దేశానికి చేరుకున్నా నీకీ అలవాటు పోలేదు! కాని నేనుకూడా అంతో ఇంతో తెలివి గలదాన్నే! నా దగ్గిర నీ జిత్తులు పారవు. అసలుసంగతేమంటే నిన్ను ఎలాగైతేనేం నీ దేశం చేర్చానుగాని నీ కష్టాలు తీరలేదు. అందుచేత నువు తిరిగివచ్చినట్టు పురుగుకైనా తెలియరాదు, జాగ్రత్త!" అన్నది.

"అమ్మా, ఇది నిజంగా నా ఇథకాయేనా? ఎందుకంటే నేను నమ్మలేకుండా వున్నాను. నీవు నన్ను వేళాకోళం చెయ్యటం లేదుగద?" అన్నాడు రూపధరుడు.

"నీవు ఎవరినీ చూస్తూచూస్తూ నమ్మలేవు. మరొకడైతే ఇంత శ్రమపడి దేశం చేరాక భార్యా బిడ్డలను గురించి ఎన్నో ప్రశ్నలు వేసేవాడు. కాని నీకు నామీదనే నమ్మకం లేకుండా వున్నది. ఇదీ ఒక విధంగా మంచిదే. నీ భార్య అహోరాత్రాలు నీకోసం అలమటించిపోతున్నది. ముందు నీకు నీదేశాన్ని చూపిస్తాను గుర్తించు," అంటూ బుద్ధిమతి తన మహిమచేత అక్కడ



దట్టంగా పట్టివున్న పొగమంచును విచ్చ గొట్టింది. వెంటనే రూపధరుడు తాను పూర్వం ఎరిగిన గుర్తులన్నీ చూడగలిగాడు. తరవాత బుద్ధిమతి గుహలో ప్రవేశించి రూపధరుడి వస్తువులు అందులో దాచివుంచటానికి చోటు చూపించింది. తరవాత గుహకు ఒక రాయి అడ్డంపెట్టి ఇద్దరూ చెట్టుకింద కూచుని సంభాషించుకున్నారు.

"రూపధరా, మూడేళ్ళుగా కొందరు దుర్మార్గులు నీయింట తిష్ఠవేసి నీ సొత్తు తింటూ, నీ భార్యను స్వయంవరం చేసుకోమని వేధిస్తున్నారు. ఈ దుర్మార్గులకు బుద్ధి చెప్పే భారం నీదే. నీ భార్య వారికి ఆగ్రహం రాకుండా ఏవో కబుర్లు చెబుతూ నీ రాక కోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నది," అన్నది బుద్ధిమతి.

"తల్లీ, నీ దయ వుంటే అలాగే వారిని హతమార్చుతాను. ఏంచెయ్యమంటావో చెప్పు!" అన్నాడు రూపధరుడు.

"ముందు నీరూపం పూర్తిగా మార్చేసి ఎవరూ నిన్ను గుర్తించకుండా చేస్తాను. నీభార్యా, నీకొడుకూ కూడా నిన్ను పోల్చుకో కూడదు. నీవు నీ పందులకాపరివద్దకు వెళ్లి అతనివద్ద వుండు. నీ పందుల మందలను కాకులకొండవద్ద అతను మేపుతున్నాడు. ఈలోపుగా నేను నీకొడుకు ధీరమతిని







ఇతనే స్వామిభక్తిపరాయణుడు. అతను ఒక పెద్ద మైదానంలో తానూ, పందులూ ఉండటానికిగాను ఒక ఇల్లు కట్టి, దాని చుట్టూ రాతిగోడ అమర్చి, దాని పైభాగాన నాగజెముడు నాటాడు. అతని రక్షణలో వెయ్యి పందులున్నాయి; అప్పటికే రూపధరుడి ఇంట చేరిన దుర్మార్గులు ఆ మందలో నుంచి చాలా పందులను తెప్పించుకు తిన్నారు. పందులకు కాపలాగా నాలుగు వేటకుక్కలు వున్నాయి.

ఇంటికి చేర్చుతాను. నీ క్షేమసమాచారాలు తెలుసుకునేటందుకుగాను అతను రారాజు వద్దకు వెళ్లివున్నాడు!" అన్నది బుద్ధిమతీదేవి.

తరవాత ఆమె అతన్ని అతి వృద్ధుడులాగా కనిపించేలాగు మార్చివేసింది. అతని చర్మమంతా ముడతలుపడిపోయింది. అతని తల చింపిరితల అయిపోయింది. ఆమె అతనికి ఒక చేతికర్రా, జోలెసంచీ ఇచ్చింది. తరవాత ఆమె రూపధరుడికి కాకులకొండకు మార్గం చెప్పి అంతర్ధానమయింది.

రూపధరుడు అడవులూ, కొండలూ దాటి తన పందులకాపరి ఉండే చోటు చేరుకున్నాడు. రూపధరుడి నౌకర్లందరిలోకీ

రూపధరుడు అక్కడికి వచ్చేసరికి పందులకాపరి తన వాకిట కూచుని తన కాళ్లకు చెప్పులజత తయారు చేసుకుంటున్నాడు. రూపధరుణ్ణి చూడగానే వేటకుక్కలు భయంకరంగా మొరుగుతూ మీదికొచ్చాయి. రూపధరుడు చప్పున తన చేతికర్ర పారేసి, నేలమీద చతికిలబడ్డాడు. ఇంతలో పందులకాపరి లేచివచ్చి కుక్కలను అవతలికి తరిమేసి, "ఏం, ముసలాడా? కాస్తయితే నిన్ను కుక్కలు పొట్టన బెట్టుకునేవే! అసలే నా బతుకంతా వెతలుగా వుంది! బంగారమంటి యజమాని దేశాలు కాని దేశాలు పట్టి కూడు గుడ్డా లేక అలమటిస్తున్నాడు! ఇక్కడ పనికిమాలిన మూక ఒకటి దాపరించి పడి కొవ్విన పంది



నల్లా కోసుకుతింటున్నారు! లోపలి కొచ్చి ఇంత కూడు తిని నీ సంగతేమిటో చెబుదువు రా!" అన్నాడు రూపధరుడితో.

రూపధరుడు భోజనం చేసినంతసేపూ పందులకాపరి తన యజమాని గొప్పతనం గురించీ, అయన రారాజు వెంట ట్రోయ్ నగరం మీదికి యుద్ధానికి వెళ్లి, అచోకీ లేకుండా పోయిన విషయమూ చెప్పాడు.

అంతా విని రూపధరుడు, "అయ్యో, మీ యజమానిగురించి ఇంత గొప్పగా చెబుతున్నావు, ఎవరాయన? నేను చాలా దేశాలు తిరిగాను. నాకా మనిషి తగిలివుంటే వార్త చెబుతాను," అన్నాడు.

దానికి పందుల కాపరి, "నువు వెయ్యి చెప్పేదిగాక, అమ్మగారూ, అబ్బాయిగారూ నీమాటలు నమ్మేది కల్ల! ఇప్పటి కెందరో చెప్పారు—అన్నీ వట్టి అబద్ధాలు. తిండి కోసమో, బట్టకోసమో ఆశపడితే వాళ్లలాగే నాలుగు బొల్లికబుర్లు నువుకూడా చెప్ప వచ్చు," అన్నాడు.

"కూటికీ గుడ్డకూ ఆశపడి అబద్ధాలు చెప్పటం చాలా నీచం. నేను ప్రమాణంచేసి నిజం చెబుతున్నాను విను. అమావాస్య వెళ్లేలోపుగా నీయజమాని తిరిగివస్తాడు. అతని శత్రువులకు పరాజయం తప్పదు.




నాకిప్పుడేమీ బహుమానం వద్దు, నామాట నిజమైనాక ఏదైనా తీసుకుంటాను!" అన్నాడు రూపధరుడు.

"పిచ్చివాడా, ఆయన ఇంకెక్కడ వస్తాడు? ఏనాడో ఆయన పోయాడు. అయన వస్తే ఇంక ఆ భార్యకూ, కొడుక్కూ అంత కంటె కావలిసిందేముంది? నిక్షేపమంటి అబ్బాయి, నాయనలాగే అంతెత్తు పెరిగాడు! ఏం అంటమనుకున్నావు?" అన్నాడు పందుల కాపరి.

తరవాత ఇద్దరూ చాలాసేపు సంభాషించుకున్నారు. రూపధరుడు తన విషయం చెప్పుకుంటూ తాను క్రీట్ దేశస్తుడిననీ,





ట్రోయ్‌యుద్ధంలో పాల్గొన్నాననీ రూపధరుణ్ణి స్వయంగా ఎరుగుదుననీ చెప్పాడు. తాను తిరిగి వచ్చేదారిలో ఒక దేశంలో రూపధరుడు మళ్లీ కలిసినట్టుకూడా అతను చెప్పాడు. అయితే ఆ సంగతులు మాత్రం పందులకాపరి తాను నమ్మననేశాడు.

చీకటి పడేలోపల పందులకాపరి నౌకర్లు మందలతో తిరిగి వచ్చారు. ఆరాత్రి పందులకాపరి తన అతిథికోసం భోజనం బాగా తయారుచేశాడు.

బయట వానసాగింది. ఈదురుగాలి కొట్టింది. రూపధరుడికి చలివేసింది. అతను పందులకాపరితో, "ట్రోయ్ యుద్ధంలో ఒకసారి ఏమయిందనుకున్నావు? ఒక రాత్రి మేము కొంతమందిమి ట్రోయ్ గోడలకింద కాపలా కాయటానికి బయలుదేరి వెళ్ళి పొదలకింద పడుకున్నాం. ఆ రోజుకూడా ఇలాగే విపరీతమైన చలిగాలీ, మంచూ సాగాయి. నా ఒక్కడికే కప్పుకునే దుప్పటి లేదు. ఒక రాత్రివేళ నేను రూపధరుణ్ణి తట్టి లేపి నా దుస్థితి చెప్పాను. ఆయన వెంటనే ఒక యుక్తి పన్నాడు. తనకు పీడకల వచ్చిందనీ, ఎవరైనా వెంటనే బయలుదేరి రారాజువద్దకు వెళ్ళి మరికొందరు మనుషులను పిలుచుకు రావాలనీ అన్నాడు. ఇందుకుగాను ఒకడు లేచి, తన దుప్పటి అక్కడే పడేసి పడవల వద్దకు బయలుదేరాడు. వెంటనే నేనా దుప్పటి కప్పుకుని ఆ రాత్రి గడిపేశాను," అని చెప్పాడు.

"మంచి కథే చెప్పావు, ముసలాడా! ఈరాత్రి నీకు కప్పుకునేటందుకు ఉండక పోదులే!" అన్నాడు పందుల కాపరి.

చలిమంటకు దగ్గిరిగా తోళ్ళపక్క పరిచి రూపధరుణ్ణి దానిమీద పడుకోబెట్టారు. పందులకాపరి అతనిమీద మందమైన గొంగళి కప్పాడు. ఆ పక్కమీద వెచ్చగా పడుకుని రూపధరుడా రాత్రి సుఖంగా నిద్రపోయాడు. —(ఇంకా వుంది)






## 11

[ట్రోయ్‌యుద్ధం ముగిసినాక తన స్వదేశమైన ఇథకాను చేరుకోవటానికి బయలుదేరిన రూపధరుడు అనేక ఏళ్లపాటు చెప్పరాని కష్టాలు పడి, అపాయాలను ఎదుర్కొని, తన అనుచరులనందరనూ కోల్పోయి, ఒంటరిగా స్వదేశానికి చేరాడు. కాని ఇంకా అతని కష్టాలు తీరలేదు. అతని ఇష్టదేవత అయిన బుద్ధిమతీదేవి అతని క్షేమం కోరి రూపధరుడి రూపాన్ని పూర్తిగా మార్చి వృద్ధుడిలాగా కనపడేటట్టు చేసింది. ఈలోపుగా ఇథకాలో—]

ట్రోయ్‌యుద్ధంనుంచి గ్రీకులు తిరిగివచ్చినాక రూపధరుడు దారిలో మరణించాడని వదంతి పుట్టింది. ఇథకాలోనూ, దాని పరిసరాలలో ఉన్న దీవులలోనూ గల రాజకుమారులు నూటపన్నెండుమంది రూపధరుడి ఇంటిపై వచ్చిపడ్డారు. రూపధరుడి భార్య అయిన పద్మముఖిని పెళ్లాడి ఇథకాకు రాజు కావటమే వారిలో ప్రతిఒక్కడి ఆశయమూనూ.

ధీరమతి అప్పుడే యౌవనం పొడచూపుతున్న కుర్రవాడు. అతను పసివాడుగా ఉండగానే రూపధరుడు యుద్ధానికి బయలుదేరి వెళ్లాడు. అందుచేత ధీరమతి తన తండ్రిని బొత్తిగా ఎరగడు. అయితే అతను తన తండ్రి రాకకోసం ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తున్నాడు. ఆయనను గురించి ఏ వార్తా లేకపోవటం అతనిని చాలా బాధించింది. "ఆయన పోయినట్టు నమ్మకంగా

తెలిసినా బాగుండును. మా అమ్మ ఎవరినో ఒకరిని పెళ్లాడేస్తుంది," అనుకున్నాడతను.

ప్రస్తుతం ఈ రాజకుమారులందరూ ధీరమతిని అసహాయుడికింద కట్టేసి, అతని ఇంట తిష్ఠవేసి, రూపధరుడి పశుగణాలను కోసుకు తిని విందులు ఆరగిస్తూ, తాగి తందనాలు వేస్తూ, పద్మముఖి నాభార్య అంటే నా భార్య అని ప్రగల్భాలు పలుకుతున్నారు. వారిని ఎలా వదిలించుకోవాలో ధీరమతికి తెలియలేదు.

ఇక, పద్మముఖికి తన భర్త తిరిగి వస్తాడని గట్టి నమ్మకం. రూపధరుడు చచ్చిపోలేదనీ, అతను తిరిగి వస్తాడనీ జోస్యం ద్వారా ఆమె తెలుసుకుని ఉన్నది. అందుచేత ఆమె తిరిగి పెళ్లాడ నిరాకరించింది. కాని ఆమెను కోరివచ్చిన రాజకుమారులు రూపధరుడు చనిపోయాడని చెప్పి ఆమెను పెళ్లికి తొందర చేయసాగారు. వారిని తప్పించుకొనటానికి ఆమె ఒక యుక్తి పన్నింది; "నేను మా మామగారి శవంపై కప్పటానికి ఒక బట్ట నేస్తున్నాను. అది పూర్తి కాగానే స్వయంవరం చేసుకుంటాను," అన్నది. రాజకుమారులు సరేనన్నారు.

అది మొదలు పద్మముఖి రోజూ పగలల్లా బట్ట నేయుటమూ, రాత్రివేళ నేసినదంతా విప్పదీయుటమూ చేస్తూ రాసాగింది. ఇలా





మూడేళ్లు సాగినాక రాజకుమారులు ఆమె చేసిన మోసం పట్టేశారు. వారి దౌర్జన్యం మితిమీరసాగింది.

ఇది చూసి ధీరమతి ఒక నిర్ణయానికి వచ్చాడు. అతను పైలాస్‌కు వెళ్లి నవ ద్యోతుణ్ణీ, స్పార్టాలో ప్రతాపుణ్ణీ కలుసుకుని తన తండ్రి వార్తలు తెలుసుకుందామను కున్నాడు. అందరికన్న ఆఖరుకు ఇల్లు చేరినవాడు ప్రతాపుడు; అందుచేత ఆయనకు తన తండ్రి వృత్తాంతం కొంతఅయినా తెలిసి ఉండవచ్చు.

"మా తండ్రి పోయినట్టు తెలిస్తేఆయనకు ఉత్తరక్రియలు చేసి మా అమ్మకు స్వయం వరం జరిపిస్తాను. అంతేగాని ఈ దుర్మార్గు లను ఇక ఎంతమాత్రమూ సహించను. నా యీడు యువకులు ఎంతో శౌర్య పరా క్రమాలు చూపిస్తున్నారు. మా తండ్రి బతికే ఉన్న పక్షంలో, యింటచేరిన ఈ దుర్మార్గుల నందరినీ ఏదోవిధంగా కడతేర్చుతాను!" అనుకున్నాడు ధీరమతి.

ఈ విధంగా నిర్ణయించుకున్నవాడై ధీర మతి ఆ రోజు రాజకుమారులతో, "అయ్యో లారా, మీరంతా మా అమ్మను పెళ్లాడగోరు తున్నామంటున్నారు, బాగానే ఉంది గాని, మీ ప్రవర్తన నా కెంతమాత్రమూ నచ్చలేదు. రేపు రచ్చబండలో సమావేశం జరిపి,





మీరంతా నా ఇంట్లో నుంచి వెళ్ళిపోవాలని బహిరంగంగా మిమ్మల్ని కోరబోతున్నాను. మీ ఇళ్ళలో తినండి, తాగండి. ఇక్కడే మీ అగడాలు సాగించదలిచిన పక్షాన మీరు నిర్మూలమై పోగలరు!" అని హెచ్చరించాడు.

అకస్మాత్తుగా ఆ కుర్రవాడు ప్రదర్శించిన సాహసం చూసి ఆ దుర్మార్గులందరూ ఆశ్చర్యపడ్డారు.

మర్నాడు తెల్లవారగానే ధీరమతి చాటింపు వేసేవారిని పిలిచి, రచ్చబండలో పౌరులందరూ సమావేశం కావలిసిందిగా చాటించి రమ్మని ఉత్తరువిచ్చాడు. అతను రచ్చబండవద్దకు ఒక బల్లెం చేతబట్టి, రెండు కుక్కలను వెంటబెట్టుకుని, దేదీప్యమానంగా ప్రకాశిస్తూ వెళ్లాడు. అక్కడ చేరిన పెద్దలు ధీరమతిని అతని తండ్రి కూర్చుంటూ ఉండిన అగ్రస్థానంలో కూచోనిచ్చారు.

అందరూ ఎవరిస్థానాలలో వారు కూచోగానే చాలా వృద్ధుడైన ఐగుప్తుడు లేచి మొదట మాట్లాడాడు. ఈయన కుమారులలో ఒకడు రూపధరుడి అనుచరుడు, ఫాలలోచనుడు చంపితిన్నవారిలో ఒకడు. ఈయన మరొక కుమారుడు పద్మముఖిని పెళ్లాడగోరే రాజ కుమారులలో ఉన్నాడు. ఈ వృద్ధుడు లేచి నిలబడి, "నాయకులారా, ఈ సమావేశం ఏర్పాటుచేసినవా రెవరోగాని, చాలా మంచి పని చేశారు. ఎందుకంటే రూపధరుడు యుద్ధానికి వెళ్లాక ఇథకాలో ప్రజలు సమావేశం కానేలేదు. ఇవాళ మనం ఎందుకు సమావేశమయామో నాకుకూడా తెలుసు కోవాలని ఆత్రంగా ఉంది!" అన్నాడు.

వృద్ధుడి మాటలు ధీరమతిని ఉత్సాహ పరిచాయి. అతను లేచి నిలబడి, "అయ్యా, ఈ సమావేశాన్ని ఏర్పరచినది నేనే. కేవలం నా సొంత కష్టాలు చెప్పుకొనటానికే మిమ్మల్ని ఆహ్వానించాను. నా ఇంటికి రెండు కష్టాలు దాపరించాయి. నేను ప్రసిద్ధుడైన నా తండ్రిని పోగొట్టుకున్నాను; ఆయన



ఒకప్పుడు మీ అందరికీ రాజు. అంతకంటె కూడా పెద్ద ఉపద్రవం మరొకటి వచ్చి పడింది ; మా అమ్మను పెళ్లాడే ఉద్దేశంతో అనేకమంది వచ్చి మా యింటిపై బడి మా ఇల్లు గుల్లచేస్తున్నారు. త్వరలోనే నేను సర్వనాశనమైపోతానని భయంగా ఉన్నది. ఈ పని చేస్తున్నవారిలో ఇక్కడ చేరినవారి కుమారులు కొందరున్నారు. మా తాతగారి వద్దకు వెళ్లి మా అమ్మనిచ్చి వివాహంచెయ్యమని అడగటానికి వారికి ధైర్యం చాలదు. అందుచేత మా ఇంట చేరి మా పశువులను చంపి తింటూ, మా సారా తాగుతూ, యథేచ్ఛగా తందనాలు చేస్తున్నారు. మా నాన్నగారు లేని కారణంచేత మా యిల్లు కుక్కలదొడ్డి అయిపోయింది. మా నాన్నగారు మన దేశానికి ఏమి ద్రోహం చేశాడని మేమీ శిక్ష అనుభవిస్తున్నామో నాకు తెలియటంలేదు. ఇది మీ అందరికీకూడా తలవంపులైన విషయమే !" అన్నాడు.

వెంటనే దుర్బుద్ధి అనేవాడు లేచి, "ధీరమతీ, నీవు చేసిన ఆక్షేపణకు అర్థం లేదు. తప్పంతా మీ అమ్మది అయి ఉండగా మమ్మల్ని దుయ్యబడతా వెందుకు? మూడేళ్లుగా మీ అమ్మ మమ్మల్నందరినీ మోసగించింది. ఆమె మాలో ప్రతి ఒక్కడికీ




ఏదోవిధంగా ఆశ చూపెట్టింది. బట్ట నేయటం పూర్తికాగానే స్వయంవరం చేసుకుంటానన్నది. మూడేళ్లు వెళ్లి నాలుగోఏడు నడుస్తున్నది. ఆ బట్ట నేయటం పూర్తికాదు. రాత్రిపూట దివిటీ పెట్టుకుని, పగలు నేసినదంతా విప్పుతుంటే ఎలా పూర్తి అవుతుందీ? ఆమెను పెళ్లాడగోరేవారి తరఫున నేను చెబుతున్నాను విను. ఆమెను నీ యింటినుంచి పంపేసి తన ఇష్టంవచ్చినవాణ్ణి పెళ్లాడమను. ఆమె ఇలాగే మమ్మల్ని మోసగించ దలిచినట్టయితే, ఆమె ఎవరినో ఒకరిని పెళ్లాడినదాకా మేము నీ యిల్లు వదిలేదిలేదు. ఇది ముమ్మాటికి నిజం!" అన్నాడు.





"నేను నా కన్నతల్లిని ఇల్లువెళ్లగొట్టటం ఎన్నటికీ జరిగేపని కాదు. అదీగాక ఆమె తన తండ్రివద్దనుంచి తెచ్చుకున్న భరణాన్ని తిరిగి ఇచ్చే స్థితిలోకూడా లేను," అన్నాడు ధీరమతి.

ఇంకొక వృద్ధుడు లేచి, "రూపధరుడు యుద్ధానికి బయలుదేరి వెళ్లేటప్పుడే నేను జోస్యం చెప్పాను. బయలుదేరిన ఇరవై సంవత్సరాలకు అతను చాలా కష్టాలుపడి తిరిగివస్తాడని చెప్పాను. ఇప్పటిదాకా నేను చెప్పినది అక్షరాలా జరుగుతున్నది. అతని ఇంట చేరినవారికి రాబోయేవి చాలా చెడ్డ రోజులు!" అన్నాడు.

"నీ జోస్యాలు నీ కొడుకులకు చెప్పుకో. మాకు నీ బెదిరింపులు లక్ష్యంలేదు. రూపధరుడే తిరిగివచ్చినా మమ్మల్ని తన ఇంటనుంచి వెళ్లగొట్ట సాహసించలేడు," అని ఇంకొకడు ప్రగల్భాలు పలికాడు.

చివరకు ధీరమతి, "నేను చెప్పవలసిన మాట చెప్పేశాను. దయచేసి నాకు ఒక నౌకా, ఇరవైమంది నావికులూ ఇప్పించినట్టయితే నేను స్పార్టాకూ, పైలాస్‌కూ వెళ్లి నా తండ్రివార్త తెలుసుకుని వస్తాను. ఆయన బతికి ఉన్నట్టు తెలిస్తే ఇంకొక్క ఏడాదిపాటు ఈ దుర్మార్గాన్ని సహిస్తాను. అలా కాక మా తండ్రి పోయాడని రూఢిగా తెలిస్తే



ఆయనకు ఉత్తరక్రియలు జరిపి మా అమ్మ పెళ్లి నేనే ఏర్పాటుచేస్తాను!" అన్నాడు.

సమావేశం ముగియగానే ధీరమతి ఇంటికి వెళ్లక సముద్రతీరానికి వెళ్లాడు. అక్కడ అతనికి సహనుడు అనేఆయన కన్పించాడు. ఈ సహనుడు రూపధరుడికి మొదటినుంచీ ఆప్తమిత్రుడు. ఆయన ధీరమతిని చూసి, "నాయనా, ఇవాళ నిన్ను చూసి నాకు చాలా ఆనందమయింది; ఆ తండ్రికి కొడుకుననిపించావు. ఇథకాలో చాలా నౌకలున్నాయి. అన్నిటిలోకీ ఉత్తమమైన నౌకగా చూసి నీ ప్రయాణానికీ సంపాదించి పెడతాను. ప్రయాణానికి కావలిసిన నావికులనుకూడా నేనే పోగుచేసుకు వస్తాను. నువుమాత్రం ఇంటికి వెళ్లి ప్రయాణసంబారాలన్నీ పట్టించుకుని రా!" అన్నాడు.

ధీరమతి వెంటనే ఇంటికి వచ్చాడు. అతనిని చూడగానే అతని కొంప గుల్ల చేస్తున్న దుర్మార్గులందరూ ఒకచోటచేరి వేళాకోళం సాగించారు.

"అమ్మ బాబోయ్, వీడు మన రక్తం తాగాలని చూస్తున్నాడురోయ్. ఇంతకాలమూ ఏమిటో అనుకున్నాం!" అన్నాడొకడు.

"వీడు పైలాస్, స్పార్టాలకు పోవటం ఎందుకో తెలుసా? సైన్యాలను తీసుకురావటానికి!" అన్నాడు ఇంకొకడు.





"లేక ఇంత విషం తెచ్చి మన సారాయిలో కలిపేస్తాడో!" అన్నాడు మూడోవాడు.

"వాళ్ల నాన్నలాగే సముద్రాలమీద అదే పోత పోతాడేమో, అదికూడా ఆలోచించండి. వీడి ఆస్తి పంచుకోలేక మనం చావాలి!" అన్నాడు నాలుగోవాడు.

ధీరమతి వారి మాటలు పట్టించుకోక సామానుకొట్టువద్దకు వెళ్లి తనను పెంచిన దాసితో తన ప్రయాణానికి కావలిసిన సంబారాలన్నీ సిద్ధంచేసి ఉంచమన్నాడు.

"నువ్వు వెళ్లకు, నాయనా! నువ్వుకూడా సముద్రాలమీద పోతే మీ అమ్మ వింకాను! ఈ ఆలోచన నీకెందుకు కలిగింది, నా తండ్రీ?" అని ముసలిది శోకాలుపెట్టింది.

"పెద్దమ్మా, ఇది దైవనిర్ణయం. నువ్వు అడ్డాలు చెప్పకు. ఈ రాత్రి మా అమ్మ నిద్రపోయాక బయలుదేరి పోతాను. ఆవిడ అడిగితే తప్ప నా ప్రయాణంగురించి చెప్పనని ఒట్టువెయ్యి! ప్రయాణానికి కావలిసిన తిండీ మొదలైనవన్నీ సిద్ధంగా ఉంచు!" అన్నాడు ధీరమతి.

ఈలోగా సహనుడు వీధులన్నీ తిరిగి ప్రయాణానికి అవసరమైన నావికులను ఏరి సముద్రతీరానికి పంపాడు. మంచి నౌక కూడా దొరికింది. ఇంతలో పొద్దూకిపోయింది. రూపధరుడి ఇంట అందరూ తిని తాగి నిద్రలకు పడ్డారు. ఆ సమయాన సహనుడు వచ్చి ధీరమతితో, "నాయనా, ప్రయాణానికి సర్వమూ సిద్ధంగా ఉన్నది. నువ్వు రావటమే ఆలస్యం!" అన్నాడు.

ఇద్దరూ కలిసి సముద్రతీరానికి వెళ్లారు. నావికులు ప్రయాణసంబారాలను రూపధరుడి ఇంటినుంచి తెచ్చి నౌకలోకి ఎక్కించారు. ధీరమతి నౌకలో ఎక్కాడు. నావికులు తెరచాప ఎత్తి, లంగరు పైకి లాగారు. అనుకూలమైన గాలి కొడుతున్నది. నౌక పైలాస్‌కు బయలుదేరింది.

—[ఇంకా ఉంది]






## 12

[దేశంకాని దేశాలలో రూపధరుడు నానా అగచాట్లూ పడి స్వదేశాన్ని చేరుకునే సమయంలో, అతడి కుమారుడు ధీరమతి తన తండ్రి ఆచోకీ తెలుసుకోవాలని నిశ్చయించాడు. రూపధరుడి భార్యను పెళ్ళాడగోరిన అనేకమంది రాజకుమారులు తన ఇంట చేరి ఇల్లు గుల్లచేయటం అతనికి నచ్చలేదు. ఈ విషయమై ఒక సమావేశం జరిపినా ప్రయోజనం లేకపోయింది. అందుచేత ధీరమతి తన తండ్రి వార్తలు తెలుసుకునేటందుకు నౌకలో ఇథకానుంచి పైలాస్‌కు బయలుదేరాడు.]

నౌక పైలాస్‌తీరాన్ని తాకేసరికి మర్నాడు బాగా తెల్లవారిపోయింది. సముద్రతీరాన ప్రజలు వరుణదేవుడికి నల్లటి ఎద్దులను బలిచేస్తున్నారు. అక్కడ తొమ్మిది జట్లు చేరి ఉన్నాయి. ఒక్కొక్క జట్టులోనూ అయిదేసి వందలమంది ఉన్నారు. తీరం పొడుగునా తొమ్మిది గాడిపొయ్యిలు మండుతున్నాయి; వంటలు సాగుతున్నాయి.

నావికులు తెరచాపలు దింపి పడవను ఒడ్డున కట్టేశాక, ధీరమతీ, అతనివెంట వచ్చిన వృద్ధుడు సహనుడూ ఒడ్డుకు దిగి నడవసాగారు.

"మనం ఇప్పుడు నవద్యోతుణ్ణి చూడబోతున్నాం. నువు బిడియపడకుండా ఆయనతో వచ్చిన పని చెప్పెయ్యి. మీ నాయన వృత్తాంతం అడుగు. మీ తండ్రివార్తలేమైనా

ఆయనకు తెలిశాయా? ఆయన మరణించాడా? మరణిస్తే ఎప్పుడు, ఎక్కడ మరణించాడు? ఈ వివరాలు నవద్యోతుడికి తెలుసునేమో కనుక్కో. నవద్యోతుడికి నిజం తెలియాలేగాని దాచిపెట్టే రకం కాదు; చాలా పెద్దమనిషి. ఈ ప్రశ్నలు ఆయనను నీవే అడగటం భావ్యంగా ఉంటుంది," అన్నాడు ధీరమతితో సహనుడు.

"నేనింకా కుర్రవాణ్ణి. పెద్దవాళ్లతో మాట్లాడటం చాతకాదు, అదే నాకు భయంగా ఉంది," అన్నాడు ధీరమతి. సహనుడు ఆ యువకుడికి ధైర్యంచెబుతూ, నవద్యోతుడూ ఆయన కుమారులూ కూర్చుని ఉన్న శిబిరానికి తెచ్చాడు.

ఎవరో కొత్తవారు వస్తూండటం చూసి నవద్యోతుడి కుమారులు ధీరమతికీ, సహనుడికీ ఎదురువచ్చి స్వాగతం తెలిపారు; తరవాత వారు నవద్యోతుడికి సమీపంగా మెత్తని తోళ్లు ఇసకపై పరిచి, అతిథులను వాటిపై కూర్చోబెట్టి ఆహారమూ, ద్రాక్ష రసమూ ఇచ్చారు.

వారు కడుపునిండా భుజించాక నవద్యోతుడు తన అతిథులకేసి తిరిగి, "ఇప్పుడు చెప్పండి, మీరెవరు? మీరు ఏ దేశంనుంచి సముద్రం దాటి వస్తున్నారు? ఇక్కడికే పని





పెట్టుకుని వచ్చారా? లేక ఇటుగా పోతూ దారిలో ఆగారా?" అని అడిగాడు.

ధీరమతి ధైర్యంగా జవాబిచ్చాడు.

"మహారాజా, మాది ఇథకా. నేను స్వంత పనిమీదనే వస్తున్నాను. ట్రోయ్ యుద్ధరంగంలో మీ సరసను యుద్ధంచేసిన నా తండ్రి రూపధరుడి వార్తలు తెలుసుకునే నిమిత్తమై నేను బయలుదేరి వచ్చాను. యుద్ధానికి వెళ్లినవారందరి వార్తలూ తెలిశాయి, కాని నా తండ్రివార్త చెప్పేవారు లేకుండా ఉన్నారు. ఆయన చనిపోయినట్టు మీకు రూఢిగా తెలిస్తే ఆ సంగతి దయచేసి చెప్పండి. మీరందరూ కలిసి యుద్ధరంగంలో ఎన్నో కష్టాలు పంచుకున్నారు. అందుకైనా మీకు తెలిసిన విషయాలు నాతో దాచకుండా చెప్పండి."

ఈ మాటలు విని అతనితో నవద్యోతుడిలా అన్నాడు:

"నాయనా, ఒక్కసారిగా జరిగిన విషయాలు జ్ఞాపకంచేశావు. వజ్రకాయుడి నాయకత్వంకింద మేము పడవలలో వెళ్లి, ట్రోయ్‌నగరానికి ముట్టడివేసి, తొమ్మిదేళ్లపాటు అతి క్రూరమైన యుద్ధం సాగించాము. మా యోధులలో ఎందరో ఆ యుద్ధరంగాన ప్రాణాలర్పించారు. ఆ సంఘటనలు చెప్పాలంటే అయిదారేళ్లు పడుతుంది.




తొమ్మిదేళ్లు నానా అగచాట్లూ పడి, చిట్ట చివరకు దైవకృపవల్ల విజయం పొందగలిగాం. కాని ఉపజ్ఞలో ఒక్కడుకూడా మీ తండ్రి అయిన రూపధరుడికి చాలలేదు. మా ఇద్దరిమధ్య ఒక్కసారికూడా అభిప్రాయ భేదం రాలేదు. మా సలహాలు ఎప్పుడూ ఒకే విధంగా ఉండేవి. అయిందేదో అయిపోయిందా, తీరా తిరుగుప్రయాణం సాగించే సమయాన మాలో కక్షలు బయలుదేరాయి. రారాజుకూ, ప్రతాపుడికీ మధ్యనే అభిప్రాయ భేదం వచ్చింది. ఇద్దరూ మాటకు మాట అనుకున్నారు. ఇంకేముందీ? మిగిలిన యోధులుకూడా రెండు జట్లుగా చీలిపోయి,



ఆ అన్నదమ్ములలో ఎవరో ఒకరి పక్షమయారు. మర్నాడు ఉదయం సగం మందిమి పడవలలో ఎక్కి ప్రతాపుడివెంట బయలుదేరాం; మిగిలిన సగంమంది రారాజువెంట దేవతల నారాధించటానికి ఉండిపోయారు. మేము టెనెడోస్ చేరగానే మీ నాన్న వెనక్కు తిరిగిపోతున్నానన్నాడు. అతనివెంట కొందరు బయలుదేరారు. నేనూ, దేవమయుడూ మరికొందరూ సూటిగా ఇళ్లకు చేరుకున్నాం. ఇదే జరిగింది, నాయనా; నాకు మిగిలినవారి సంగతి తెలియదు. వజ్రకాయుడి కొడుకు నవయోధుడూ, అతని అనుచరులూ క్షేమంగా చేరారని విన్నాను. మరికొంతమందికూడా వారి వారి దేశాలకు క్షేమంగా చేరుకున్నట్టు తెలిసింది. రారాజు స్వదేశానికి చేరుకోవటమూ, అజబలుడు రారాజు భార్యతో కుట్ర చేసి ఆయనను దారుణంగా హత్యచేయటమూ నువు వినే ఉంటావు. రారాజు కొడుకు గట్టివాడు, అవకాశం సంపాదించి అజబలుణ్ణి చంపేసి తన తండ్రిహత్యకు పగ తీర్చుకున్నాడు."

ధీరమతి నవద్యోతుడితో, "అతను ఎంత అదృష్టవంతుడు! మా అమ్మను పెళ్లాడే ఉద్దేశంతో మా యింట తిష్ఠవేసి మా కొంప





గుల్లచేస్తున్న దుర్మార్గులపై నే నెప్పుడు పగ తీర్చుకుంటానోగదా!" అన్నాడు నిట్టూర్చుతూ.

"అవును, నాయనా, మీ ఇంట చేరిన దుర్మార్గుల సంగతి నేనూ విన్నాను. నువు వారిని ఎందుకు సహిస్తున్నావు? అందరూ నీకు శత్రువులేనా? అయినా ఆ బుద్ధిమతీ దేవి అనుగ్రహం నీపై ప్రసరిస్తే మీ నాన్నలాగే నువుకూడా శత్రువులనందరినీ త్వరలోనే నిర్మూలించగలుగుతావులే!" అన్నాడు నవద్యోతుడు.

వారు మాట్లాడుతూ ఉండగానే పొద్దు వాలింది. ధీరమతి తన నౌకకు తిరిగిపోవటానికి లేచాడు. కాని నవద్యోతుడు ఒప్పుకోలేదు. "ఈ రాత్రి రూపధరుడి కొడుకు పడవలో పడుకోవటమా? నాకు ఇల్లు లేదా? పక్కలూ, మెత్తలూ లేవా?" అంటూ ఆయన ధీరమతిని తన ఇంటికి తీసుకుపోయాడు. సహనుడు మాత్రం మిగిలిన నావికుల క్షేమసమాచారాలు చూడటానికి నౌకకు తిరిగివెళ్లాడు.

మర్నాడు ఉదయం ధీరమతి నిద్రలేచి సుఖంగా స్నానంచేసి బట్టలు మార్చుకున్నాడు. అతనిని ప్రతాపుడుండే చోటికి తీసుకుపోవటానికి ఒక గుర్రపుబండీ సిద్ధం చేశారు. దారిలో తినటానికి భోజనం వెంట పెట్టుకుని నవద్యోతుడి కుమారుడు ఒకడు ధీరమతి వెంట బండిలో వచ్చాడు. వారిద్దరూ ఆ రోజూ మర్నాడూ ప్రయాణంచేసి ప్రతాపుడుండే దేశం చేరుకున్నారు.

సరిగా ఆ సమయానికే ప్రతాపుడు తన కుమార్తెను వజ్రకాయుడి కొడుకుకిచ్చి పెళ్లి చేస్తున్నాడు. ఈ పెళ్లికి పరిసర ప్రాంతాల నుంచి చాలామంది వచ్చారు. ఒక విశాలమైన సావడిలో విందులూ వినోదాలూ జరుగుతున్నాయి. ఇంతలో ప్రతాపుడి అంగరక్షకుడొకడు వచ్చి, "మహారాజా, ఎవరో ఇద్దరు యువకులు బండిలో వచ్చి దిగారు.

వారిని లోపలికి అహ్వానించమన్నారా, లేక మరెక్కడికైనా వెళ్లమని చెప్పనా ?" అని అడిగాడు.

ప్రతాపుడు చిరాకుతో, "నువు ఇంత మూర్ఖుడివని నాకు తెలియదే! మనం పరాయిదేశాలలో దిక్కులేని స్థితిలో ఎన్ని సార్లు ఇతరుల ఆతిథ్యం తీసుకోలేదు ? వెంటనే వెళ్లి ఆ యువకులను భోజనానికి రమ్మను," అన్నాడు.

తరువాత కాస్సేపటికి ధీరమతీ, అతని అనుచరుడూ విందు జరిగే సావడిలోకి వచ్చి ఆశ్చర్యంతో చుట్టూ కలయజూశారు. ఆ సావడిలో సూర్యచంద్రులు ప్రకాశిస్తున్నట్టుగా ఉన్నది. నౌకర్లు వచ్చి వారిని తీసుకుపోయి స్నానాలు చేయించి, బట్టలు కట్టబెట్టి, ప్రతాపుడి సరసనే వారిద్దరినీ భోజనానికి కూచోబెట్టారు.

ప్రతాపుడు వారితో, "నాయనలారా, మిమ్మల్ని చూస్తే రాజకుమారులల్లే ఉన్నారు గాని సామాన్యులలాగా లేరు. ముందు భోజనాలు చెయ్యండి ; మీరెవరో, ఏం పనిమీద వచ్చారో తరవాత చెబుదురు గాని," అన్నాడు.

ఇద్దరూ భోజనం పూర్తి చేశాక ధీరమతి తన అనుచరుడి చెవిలో రహస్యంగా, "ఇక్కడ ఎంత కంచూ, ఎంత వెండీ,





ఎంత బంగారమూ, ఎంత దంతమూ ఉందో చూశావా?" అన్నాడు. ఈ మాటలు ప్రతాపుడి చెవుల పడ్డాయి.

"నాయనలారా, నేనీ సంపద యావత్తూ నానాదేశాలు తిరిగి సంపాదించాను. కాని ట్రోయ్‌కోటగోడల ముందు నా అనుచరులు ఎందరో ప్రాణాలు విడిచారు; వారు బతికి ఉంటే ఈ సంపద లేకపోయినా నేను ఎక్కువ సుఖపడుదును. వారికోసం నేను అప్పుడప్పుడూ ఏడుస్తాను. అయితే అందరి కన్న నేను అధికంగా ఏడ్చేది రూపధరుడి కోసం. ఒక్కొక్కరాత్రి అతను జ్ఞాపకం వచ్చి నేను నిద్రపోలేను. నా సంగతే ఇలా ఉంటే, వృద్ధుడైన అతని తండ్రీ, అతని భార్యా, కుమారుడూ రూపధరుడికోసం ఎంతగా ఏడుస్తున్నారో!" అన్నాడు ప్రతాపుడు విచారంగా.

ఈ మాటలు వినగానే ధీరమతికి దుఃఖం ఆగలేదు. అతను కళ్లు తుడుచుకుంటున్న సమయంలో భువనసుందరి అక్కడికి వచ్చింది.

ధీరమతిని చూస్తూనే ఆమె, "ఈ కుర్రవాడెవరో గాని మూడుమూర్తులా రూపధరుడి లాగే ఉన్నాడుకాదూ?" అన్నది.

"నిజమేసుమా!" అన్నాడు ప్రతాపుడు ధీరమతికేసి చూస్తూ.



నవద్యోతుడి కొడుకు ప్రతాపుడితో, "మహారాజా, మీరన్నది నిజమే. ఇతను రూపధరుడి కుమారుడే. రూపధరుడు లేని కారణంచేత పాపం అతని ఇల్లు కుక్కల దొడ్డిలాగా అయింది. అతను పెద్ద చిక్కులో వున్నాడు. మీరేమైనా అతనికి తగిన సలహా సహకారా లివ్వగలరేమోనని మానాన్నగారు నవద్యోతుడు నా వెంట ఈ కుర్రవాణ్ణి మీవద్దకు పంపారు," అన్నాడు.

"రూపధరుడి కొడుకు నా యింటికి రావటం ఎంత చిత్రం!" అన్నాడు ప్రతాపుడు. తరవాత రూపధరుణ్ణి గురించి చాలా సేపు మాట్లాడుకున్నారు. రూపధరుడు తన ఒంటినిండా దెబ్బవాతలు వేయించుకుని, గ్రీకు శిబిరంనుంచి పారిపోయిన బానిస రూపంలో ట్రోయ్‌నగరం ప్రవేశించటమూ, అలా మారురూపంలో వున్నప్పటికీ తాను అతనిని గుర్తించటమూ గురించి భువనసుందరి చెప్పింది.

తామంతా కొయ్యగుర్రంలో కూచుని ఉన్నప్పుడు భువనసుందరి వచ్చి లోపల ఉన్నవారిని పేరు పేరునా పిలిచినప్పుడు, వారిలో కొందరు బయట పడబోతూండగా రూపధరుడువారించిన వృత్తాంతం ప్రతాపుడు చెప్పాడు. అప్పుడు ధీరమతి, "మహారాజా, మా తండ్రివార్తలు మీకేమైనా తెలుసునేమో కనుక్కుందామనే ఉద్దేశంతో నేను వచ్చాను. మీకు తెలిసినదేమైనా ఉంటే దాచకుండా చెప్పండి," అన్నాడు.

"నాకు తెలిసినది చెబుతాను విను. నేను ఈజిప్టుదేశంలో చిక్కుకుపోయిన సమయంలో నాకు సముద్రాలమీద ఉండే ముసలివాడు తటస్థపడ్డాడు. ఆయన నాకు అనేకమందిని గురించి చెబుతూ, రూపధరుడు తన అనుచరులనందరినీ కోల్పోయి ఏదో దీవిలో బందీగా సమ్మోహినికి చిక్కి ఉన్నాడని తెలిపాడు," అన్నాడు.

—(ఇంకా ఉంది)






## 13

[రూపధరుడి జాడ ఏమీ తెలియనందున అతను చనిపోయాడనుకుని అనేకమంది రాజకుమారులు రూపధరుడి ఇంట బసచేసి, రూపధరుడి భార్యను తమలో ఒకరిని పెళ్ళాడమని నిర్బంధించసాగారు. పసివాడైన రూపధరుడి కుమారుడు ధీరమతి తన తండ్రి వార్తలకోసం ఒక నౌకలో బయలుదేరి నవద్యోతుణ్ణీ ప్రతాపుణ్ణీ చూడబోయాడు.]

ఈలోపల ఇథకాలో, రూపధరుడి ఇంట చేరిన యువకులు నిశ్చింతగా తింటున్నారు, తాగుతున్నారు, జూదాలాటతో కాలం వెళ్ళబుచ్చుతున్నారు. ధీరమతి పైలాస్‌కు ప్రయాణమై వెళ్ళిన సంగతి వారికి తెలియదు. ఇంటిబయట జూదాలాడుతున్న ఈ దుర్మార్గుల వద్దకు ఒక యువకుడు వచ్చి, దుర్బుద్ధి అనేవాడితో, "అయ్యా, పైలాస్ నుంచి ధీరమతి ఎప్పుడు తిరిగివస్తాడో తమకు తెలుసా? ఎందుకంటే అతను నా పడవ తీసుకువెళ్ళాడు. నాకా పడవతో పని వచ్చింది. నేను అవతలి ఒడ్డుకు పోయి ఒక అడవిగుర్రాన్ని తెచ్చుకుందామనుకుంటున్నాను," అన్నాడు.

అందరు ఒకరి మొహాలు ఒకరు చూసుకుని ఆశ్చర్యపోయారు.

దుర్బుద్ధి ఆ యువకుడితో, "ధీరమతి పైలాస్‌కు వెళ్ళాడా? నీ పడవ కాజేశాడా? నిన్నడిగే తీసుకుపోయాడా? ఇదంతా ఎప్పుడు జరిగింది? ఆ పడవకు నావికు





లెవరు? ధీరమతి నౌకర్లా, లేక ఊళ్లో ఉండే యువకులా? అసలు ధీరమతి ఏ పనిమీద పైలాస్‌కు వెళ్లాడు?" అని ప్రశ్నలవర్షం కురిపించాడు.

"నా యిష్టంమీదే పడవను తీసుకు పోయారండి. అంతవారు వచ్చి అడిగితే ఎలా లేదనను? ఊళ్లో ఉండే జమా జట్టీల్లాటి కుర్రాళ్లు నావికులుగా వెళ్లారండి. సహనుడు వాళ్లకు నాయకుడుగా వెళ్లాడు," అని ఆ వచ్చిన యువకుడు దుర్బుద్ధికి జవాబు చెప్పాడు.

దుర్బుద్ధి కళ్లవెంట నిప్పులు రాలాయి. అతను తన అనుచరులకేసి తిరిగి, "ఇది సహించరాని సంగతి! మనందరి కళ్లలోనూ దుమ్ముగొట్టి ఈ కుర్రకుంక పడవ చేసుకుని, నావికులను సమకూర్చుకుని వెళ్లిపోతాడా! శరవేగంతో వెళ్లే పడవ ఒకటి సంపాదించండి. ఇరవైమంది నావికులను పోగు చెయ్యండి; నేను ధీరమతి అంతు తేలుస్తాను," అన్నాడు.

తరవాత నలుగురూ చేరి రహస్యాలోచన చేశారు. ధీరమతి పైలాస్ నుంచి తిరిగి వచ్చే దారిలో పొంచిఉండి, దుష్బుద్ధి అతన్ని చంపెయ్యాలని నిశ్చయించారు.

వాళ్లు చేసే కుట్రనుగురించి పద్మముఖికి నౌకర్లద్వారా తెలిసింది. తన ఇంట చేరిన దుర్మార్గులు తన కొడుకును చంప యత్నిస్తున్నారని వినేవరకు అమెకు ధీరమతి ప్రయాణమై వెళ్లిన సంగతే తెలియదు.

"ఇంతమంది నౌకర్లుండి నా కొడుకు సముద్రాలపై వెళ్లిపోతూంటే ఒక్కరూ నాతో చెప్పలేదు. నాకు తెలిస్తే వాణ్ణి వెళ్ల నివ్వను!" అని పద్మముఖి ఏడ్చింది. ఆమెతోబాటు ఆమెయింటవున్న పరిచారిక లందరూ ఏడ్చారు.

"పెళ్లికూతురు పెళ్లికోసం ఏడుస్తున్న ట్టున్నది. తన కొడుకు పోతాడని తెలియదు, పాపం!" అన్నాడొక దుర్మార్గుడు.



"మీరెవరూ నోరు పారేసుకోవద్దు. ధీరమతి హత్యగురించి పురుగుకైనా తెలియనివ్వకండి," అంటూ దుర్బుద్ధి తన అనుచరులలో సమర్థులను ఇరవైమందిని ఎన్నుకుని, వారితో సముద్రతీరానికి వెళ్లాడు. వారు ఒక పడవలో కత్తులూ కటార్లూ పెట్టుకుని, తెడ్లు అమర్చి తీరానికి దూరంగా లంగరు వేశారు. తరవాత వారు తీరాన భోజనం చేసుకు తిని రాత్రికోసం ఎదురు చూడసాగారు.

ఆ రోజు పద్మముఖి భోజనం చెయ్యలేదు. ఆ రాత్రి ఆమెకు నిద్రకూడా సరిగా లేదు. తాను తన కొడుకునే చూస్తానో, కొడుకు శవాన్నే చూస్తానో అని ఆమె వాపోవసాగింది. ఆ సమయాన ఆమెకు చీకట్లో తన సోదరి ఆకారం కనిపించి, "ఎందుకు దుఃఖిస్తున్నావు, అక్కా? నీ కొడుకుకు ఏ ప్రమాదమూ రాదు," అని చెప్పి చూస్తుండగానే మాయమయింది.

ఆ రాత్రే దుర్మార్గులు తమ పడవను ఒక రాళ్లగుట్టల దీవికి తీసుకుపోయి అక్కడ లంగరువేసి, ధీరమతికోసం ఎదురు చూడసాగారు.



ఈలోపుగా అక్కడ ధీరమతి ప్రతాపుడికి వీడ్కోలుచెప్పి, ఆయననుంచి అనేక బహుమానాలు పొంది బయలుదేరాడు. అతను సముద్రతీరాన్ని చేరుకుని, తన నావికులను కలుసుకుని దేవతలకు బలులిచ్చి నౌకలో ఇంటికి ప్రయాణమయాడు. అయితే అతను నౌకను నేరుగా నగరానికి నడపక మరొక రేవు వద్దకు పట్టించి అక్కడ తాను దిగి, తన అనుచరులతో, "మీరు నగరానికి వెళ్లండి. నేను మా పందులకాపరిని ఒకమారు కలుసుకుని నగరానికి వస్తాను," అని చెప్పాడు.

ధీరమతి పందులకాపరి గుడిసె వద్దకు చేరుకునే సమయానికి రూపధరుడూ, పందులకాపరీ గుడిసెలోనే ఉండి వంట





చేసుకుంటున్నారు. గుడిసె బయట ఉన్న జాగిలాలు నాలుగూ ధీరమతిని చూసి గుర్తించి, తోకలాడిస్తూ, సంతోషంగా అతని పైకి దూకాయి.

"ఎవరో వచ్చారు. నీకు తెలిసినవాళ్లో, నీ స్నేహితులో అయి ఉండాలి. ఎందుకంటే కుక్కలు మొరగటానికి బదులు, మారాం చేస్తున్నాయి," అని రూపధరుడు పందులకాపరితో అన్నాడు.

రూపధరుడు మాట్లాడటం పూర్తిచేసే లోపుగానే ధీరమతి గుడిసెద్వారంలోకి వచ్చి నిలబడ్డాడు. అతన్ని చూస్తూనే పందులకాపరి సంభ్రమంతో లేచి, తన



యజమానిదగ్గిరికి పరిగెత్తి, ఏ దూరదేశం నుంచో తిరిగివచ్చిన కొడుకును కౌగలించుకున్నట్టు కౌగలించుకుని, "వచ్చావా, నాయనా? నిన్ను మళ్లీ ఈ కళ్లతో చూస్తాననుకోలేదు. లోపలికి రా, బాబూ. అసలు నువు నా గుడిసెకు వచ్చేదే అరుదు. పైలాస్‌కు వెళ్లావుటకాదూ?" అన్నాడు. అతని కళ్లవెంట ఆనందబాష్పాలు రాలాయి.

"అక్కడినుంచే వస్తున్నాను, చిన్నాయినా. మా ఇంటి విశేషాలేమిటి? మా అమ్మ క్షేమంగా ఉందా? లేక ఎవరైనా ఆవిడను పెళ్ళాడేశారా?" అని ధీరమతి అడిగాడు.

"అటువంటి దేమీలేదు, బాబూ. ఆవిడ ఎప్పటిలాగే వుంది. అయితే ఆవిడకు రాత్రింబగళ్ళు దుఃఖం తప్ప మరొకటిలేదు," అన్నాడు పందులకాపరి, ధీరమతి చేతిలో వున్న ఈటె తీసుకుంటూ.

ధీరమతి లోపలికి రావటంచూసి రూపధరుడు లేచి అతనికి చోటివ్వబోయాడు. కాని ధీరమతి, "లేవకు, తాతా. నేను కూర్చునేటందుకు ఇంకో ఆసనం దొరక్కపోదులే!" అన్నాడు.

రూపధరుడు మళ్ళీ కూచున్నాడు. పందులకాపరి ధీరమతికోసం ఒక చర్మం





పరిచి కూచోబెట్టాడు. తరవాత ముగ్గురూ కూచుని భోజనం చేశారు. భోజనం అయాక ధీరమతి పందులకాపరితో, "చిన్నాయినా, ఈ కొత్తమనిషి ఎవరు? ఈయనను ఎవరు ఇక్కడికి తెచ్చారు?" అని అడిగాడు.

"బాబూ, ఈయన క్రీట్ దేశస్థుడనని చెబుతున్నాడు. ప్రపంచమంతా తిరిగాడట. ఆయన లోకసంచారం చేయాలని దేవుడు రాసిపెట్టినట్టుంది. ఆయన ప్రమాదంనుంచి తప్పించుకుని నా గుడిసెలో తల దాచుకున్నాడు. ఆయనను నీ చేతుల్లో పెడుతున్నాను, నీ యిష్టంవచ్చినట్టు చెయ్యి," అన్నాడు పందులకాపరి.

"నాకు ఎటువంటి పరీక్ష పెట్టావు, చిన్నాయనా! ఈ అతిథిని నా యింటి కెలా తీసుకుపోగలను? నేను చిన్నవాణ్ణి, నా యింటినిండా శత్రువులేనాయె! వాళ్ళంతా పెళ్ళిచేసుకోమని తొందరపెడుతూంటే ఏమీ నిర్ణయించలేని స్థితిలో ఉన్నది మా అమ్మ. అందుచేత నేను ఈయనకు చేయగల సహాయం ఏమంటే, వేసుకునేటందుకు బట్టలిస్తాను, పాదరక్షలిస్తాను, పదునైన కత్తి ఇస్తాను. ఆయన ఎక్కడికి పోదలిస్తే అక్కడికి వెళ్ళమను; లేదా, నీ గుడిసెలోనే ఉంచుకుని ఆయన యోగక్షేమాలు



చూడు. ఆయన పోషణభారం నీపైన లేకుండా, నే నాయనకు కావలసిన తిండీ బట్టా పంపుతాను. అంతేగాని ఆ దుర్మార్గుల మధ్యకు ఆయన రావటం నాకిష్టం లేదు. వాళ్ళాయనను చాలా హింస పెడతారు. ఆ అవమానాన్ని నేను సహించలేను," అన్నాడు ధీరమతి.

తరవాత అతను పందులకాపరితో, "చిన్నాయనా, నువు వెంటనే మా ఇంటికి వెళ్ళి, మా అమ్మను ఒంటరిగా పిలిచి, నేను పైలాస్‌నుంచి తిరిగివచ్చాననీ, నీ గుడిసెలో ఉన్నాననీ, నాకోసం విచారించవద్దనీ చెప్పు," అన్నాడు.






"బాబూ, మీరు ప్రయాణమై వెళ్ళినది మొదలు మీ తాతగారు అన్నం ముట్టలేదుట. ఆయనకుకూడా మీరు తిరిగివచ్చిన వార్త చెప్పిరానా? పాపం, పెద్దవాడు!" అన్నాడు పందులకాపరి.

"నువు మరెక్కడికీ వెళ్ళకు. వీలు చూసుకుని మా తాతకు ఏ పనిమనిషి ద్వారానో కబురు పంపమని మా అమ్మతో చెప్పి నువు వెంటనే యిక్కడికి తిరిగిరా!" అన్నాడు ధీరమతి.

పందులకాపరి బయలుదేరి వెళ్ళాడు. గుడిసెలో తండ్రికొడుకు లిద్దరు మాత్రమే ఉండిపోయారు.



అకస్మాత్తుగా గుడిసెబయట రూపధరుడికి బుద్ధిమతీదేవి ప్రత్యక్షమై, బయటికి రమ్మని సంజ్ఞ చేసింది. రూపధరుడు ఒంటరిగా బయటికి వెళ్ళాడు. ఆ దేవి అతనితో, "నీ కొడుకుతో నువ్వెవరో చెప్పేసి, అతని సాయంతో నీ శత్రువులనందరినీ నాశనం చెయ్యటానికి ఉపక్రమించు. మీ ఇద్దరికీ నేను అండగా ఉన్నాను గనక, మీరు భయపడ నవసరంలేదు," అంటూ రూపధరుణ్ణి తన దండంతో తాకింది.

వెంటనే రూపధరుడి మొహాన ముడతలన్నీ పోయి పడుచువాడయాడు. అతని దుస్తులుకూడా మారిపోయాయి. ఇలా మారి లోపలికి వచ్చిన రూపధరుణ్ణి చూసి ధీరమతి నిర్ఘాంతపోయాడు. "అయ్యా, మీరెవరు? ఎవరో దేవత అయి ఉండాలి. మామూలు నరులు ఇలా తమ రూపాన్ని మార్చుకోలేరు. అదీగాక నరులకు ఈ తేజస్సు ఉండదు!" అన్నాడు.

రూపధరుడు తనను తాను బయటపెట్టుకున్నాడు.

"నేను నీ తండ్రిని, రూపధరుణ్ణి, నాయనా! చాలా కష్టాలు పడి చివరకు స్వదేశం చేరుకున్నాను," అంటూ అతను కొడుకుతో తన కథ యావత్తూ చెప్పి, "మన





ఇంట ఎంతమంది దుర్మార్గులున్నారో చెప్పు! వారిని మనం కడతేర్చుదాము," అన్నాడు.

"అందరూ కలిసి నూట ఎనిమిదిమంది ఉన్నారు. వీరు గాక ఆరుగురు నౌకర్లున్నారు. వీరందరినీ మనిద్దరమూ ఎలా కడతేర్చగలం, నాన్నా?" అని ధీరమతి అడిగాడు.

"పిచ్చివాడా, మనం ఇద్దరమే అనుకుంటున్నావు గాని, మనవెంట బుద్ధిమతీదేవి సహాయం ఉన్నది. అందుచేత తెల్లవారేసరికల్లా నువు ఇంటికి వెళ్ళు. నేను బిచ్చగాడి రూపంలో మన పందులకాపరి వెంట అక్కడికి వస్తాను. ఆ దుర్మార్గులు నన్ను ఎన్నిరకాల అవమానాలు చేసినా నువు సహించి ఊరుకో. కాని నాకేసి ఒక కన్ను ఉంచు. నేను సంజ్ఞ చేసినప్పుడు నువు గోడలమీద ఉండే కత్తులూ, కటార్లూ తీసి మేడమీద గదిలో ఒక మూల దాచెయ్యి. ఆయుధాలేమైనాయని వాళ్ళెవరైనా అడిగితే, తుప్పుపట్టటంచేత తీసి దాచానని మర్యాదగా చెప్పు. కాని మన ఇద్దరికీ కావలసిన ఆయుధాలు—రెండు ఈటెలూ, రెండు కత్తులూ, రెండు తోలుడాళ్ళూ—అందుబాటులో ఉంచు. నువు జాస్తిగా తాగి ఎవరితోనూ జగడం పెట్టుకోకుసుమా, మన పని కాస్తా పాడవుతుంది. మరొక ముఖ్య




విషయం—నేను తిరిగి వచ్చానన్న సంగతి ఒక్క పురుగుకుకూడా తెలియరాదు—మీ అమ్మకుకూడా చెప్పకు. ప్రస్తుతానికి ఈ సంగతి మన ఇద్దరికి మాత్రమే తెలిసి వుండాలి," అని రూపధరుడు తన కొడుకుతో చెప్పాడు.

ఈలోపుగా, ధీరమతి పైలాస్‌నుంచి తిరిగి వచ్చిన పడవ నగరం చేరింది. ఆ పడవ నడిపినవారిలో ఒకడు రూపధరుడి ఇంటికి వచ్చాడు. ఆ మనిషీ పందులకాపరీ ఒకసారే ఇంటిముందు తారసిల్లారు. పద్మముఖికి ధీరమతి రాకగురించి చెప్పటానికి నావికుడు వచ్చిన సంగతి తెలుసుకుని ఆమె



ఇంట చేరిన దుర్మార్గులు కలవరంచెందారు. ధీరమతిని దారిలో చంపెయ్యటానికి వెళ్లిన వారుకూడా తిరిగివచ్చారు.

వారందరూ కలిసి ఒక రహస్య సమావేశం చేశారు. అప్పుడు వారితో దుర్బుద్ధి ఇలా అన్నాడు :

"ఈసారికి వీడు ప్రాణాలతో బయటపడ్డాడు. కాని వీణ్ణి త్వరలో చంపకపోతే మనకు ప్రమాదం వుంది. అసలే ప్రజలు మనపట్ల విముఖులుగా వున్నారు. వీడు వచ్చి అందరితోనూ మన హత్యాప్రయత్నంగురించి చెప్పేస్తాడు. అప్పుడు ప్రజలు మనల నందరినీ దేశంనుంచి తరిమేస్తారు. అందుచేత మనం ఈ ధీరమతిని నగరం ప్రవేశించే సమయంలో హతమార్చి వాడి ఆస్తిని పంచుకోవాలి. మనలో ఎవడు పద్మముఖిని పెళ్ళాడితే వాడికి రూపధరుడి ఇల్లు దక్కుతుంది. అలాకాక మనం ధీరమతిని బతకనివ్వదలచిన పక్షంలో మనం రూపధరుడి ఇంటవుండే అవకాశంలేదు. ఎవరి ఇంట వారుండి పద్మముఖిని పెళ్ళాడే ప్రయత్నం చేయటం బాగుంటుంది. ఎలా నిర్ణయిస్తారో చెప్పండి!"

ధీరమతిని హత్యచేసే ప్రయత్నానికి కొందరు అభ్యంతరం చెప్పారు. "ధీరమతికి చచ్చే యోగం వున్నదీ లేనిదీ తెలుసుకోకుండా మనం ఏమీ చేయగూడదు. చచ్చే యోగం వున్నట్టు దేవతలు చెబితే ఆ హత్యను నేనే స్వయంగా చేస్తాను. అంతదాకా మనం తొందరపడవద్దు!" అన్నాడొకడు. ఈ సలహాను అందరూ ఆమోదించి ఇంటికి తిరిగి వెళ్ళారు.

ఆ సాయంకాలం పందులకాపరి తిరిగి తన గుడిసెకు వచ్చేలోగా బుద్ధిమతీదేవి మళ్ళీ రూపధరుడి ఆకారాన్ని గుర్తించరాకుండా మార్చేసింది. ఆ రాత్రి భోజనాలయాక ధీరమతి తన తండ్రితో బాటు పందులకాపరి గుడిసెలోనే నిద్రపోయాడు.

—(ఇంకా వుంది)






## 14

[ రూపధరుడి కొడుకైన ధీరమతి తన తండ్రిని గురించి వార్తలు తెలుసుకునేటందుకు పైలాస్ వెళ్ళి, తనను చంపటానికి సముద్రంమీద పొంచివున్న శత్రువులకు అందకుండా తమ పందులకాపరి ఇంటికి వచ్చి అక్కడ తన తండ్రిని కలుసుకున్నాడు. తండ్రికొడుకులిద్దరూ కలిసి శత్రువులను తుదముట్టించటానికి రూపధరుడు ఒక ఆలోచన చేసి, అందుకుగాను ధీరమతి ఏం చెయ్యాలో చెప్పాడు.]

తెల్లవారుతూనే ధీరమతి లేచి నగరానికి ప్రయాణమయాడు. అతను పందుల కాపరితో, "చిన్నాయనా, నేను ఇంటికి వెళ్ళాలి. మా అమ్మ నన్ను కళ్ళ చూసిన దాకా బెంగ మానదు. ఇక ఈ ముసలివాడున్నాడే, ఈయన తిరుగుడుకు అలవాటు పడ్డవాడు. ఈ మూల కూచుంటే ఆయనకేం తోస్తుంది. అందుచేత నగరానికి తెచ్చి దిగబెట్టు. నాలుగు వీధులూ తిరిగి అకలి అయితే ఎక్కడో ఒక చోట ఇంత తిండి ముష్టెత్తుకుంటాడు!" అన్నాడు.

"అవును, నాయనా. నన్నిక్కడ ఉండమన్నా ఉండను. ముష్టెత్తుకునేవాడికి అన్నీ తన ఇళ్లేగా? నువు వెళ్ళు, బాబూ. ఇంకాస్సేపు చలిమంట దగ్గిర కూచుని బయట కాస్త ఎండ ముదిరినాక ఈయనను వెంటబెట్టుకుని నగరానికి పోతాలే. నా వంటిన ఉన్న గుడ్డలు చూడు. ఎలా చీలి




కలూ వాలికలూ అయిఉన్నాయో! అందు చేత చలికి తట్టుకోలేను!" అని రూపధరుడు ధీరమతితో అన్నాడు.

ధీరమతి అతివేగంగా ఇంటికి వెళ్ళిపోయాడు. తన ఇంట చేరిన దుర్మార్గులతో తానూ, తన తండ్రీ కలిసి చేయబోయే యుద్ధంగురించే అతను ఆలోచిస్తున్నాడు. అతను ఇల్లు చేరుతూనే తన చేతిలో ఉన్న ఈటె ఒక స్తంభానికి ఆనించి లోపలికి వెళ్ళాడు. ఇంటి దాసీలు అతన్ని చూసి పరమానందం చెందారు.

ఇంతలోనే పద్మముఖి మేడపైనుండి దిగి వచ్చి, కొడుకును ఆలింగనం చేసుకుని, "వచ్చావా, నాయనా? నిన్ను మళ్ళీ కళ్ళ చూస్తాననుకోలేదు. మీ నాన్న గురించి తెలుసుకుందామనే ఉద్దేశంతో, నాతోకూడా చెప్పకుండా, పైలాస్‌కు వెళ్ళివచ్చావుగదా, ఏం వార్త తెచ్చావు?" అని అడిగింది.

"అమ్మా, నేను వెంట్రుకవాసిలో చావు తప్పించుకున్న మాట నిజమే గాని, మనం కంట తడిబెట్టుతూ కూర్చోవటానికిది సమయం కాదు. నువు వెంటనే చక్కగా స్నానం చేసి, మన పగ తీరేలాగు అనుగ్రహించమని దేవుడికి మొక్కుకో! నేనీలోగా ఒకసారి ఊళ్ళోకి వెళ్ళివస్తాను. అన్నట్టు, పైలాస్‌నుంచి నావెంట ఒక అతిథి వచ్చాడు. అతనిని తీసుకువస్తాను!" అన్నాడు ధీరమతి.

ఈ అతిథి ఒక జ్ఞాని. పైలాస్ రేవునుంచి ధీరమతి బయలుదేరే సమయంలో తనను కూడా పడవ ఎక్కించుకోమని ప్రాధేయపడ్డాడు. ధీరమతి పడవ దిగి పందుల కాపరి గుడిసెకు వెళ్ళాక, అతను మిగిలిన నావికులవెంట బయలుదేరి మరో మార్గాన నగరం చేరుకున్నాడు.

కొడుకు చెప్పినట్టే పద్మముఖి స్నానం చేసి, శుచి అయిన బట్టలు ధరించి తమ శత్రువుల సంహారం నిర్విఘ్నంగా జరిగే



లాగు అనుగ్రహించమని దేవుడికి భక్తి పూర్వకంగా మొక్కుకున్నది.

ఈలోపల ధీరమతి బయటికి వచ్చి, తన ఈటె చేతబట్టి, తన పెంపుడు కుక్కలు రెంటిని వెంటబెట్టుకుని, ఠీవిగా ఊళ్ళోకి బయలుదేరాడు. ఆ సమయంలో అతని ఇంట చేరిన శత్రువులు అతని చుట్టూ మూగి ఎంతో మంచిగా కుశల ప్రశ్నలు చేశారు; కాని వారి హృదయాలలో ద్వేషాగ్ని ప్రజ్వరిల్లుతూనే ఉన్నది.

ధీరమతి వారిని వదిలించుకుని ముందుకు సాగి తన తండ్రి తాలూకు మిత్రులు చేరివున్న స్థలానికి వెళ్ళి, అక్కడ కూచుని వారి ప్రశ్నలకు సమాధానాలు చెప్పసాగాడు.

కొంతసేపటికి అక్కడికి నావికుల పెద్ద అతిథిని వెంటపెట్టుకుని వచ్చాడు. అతను ధీరమతితో, "ప్రతాపుడు నీకిచ్చిన కానుకలు నా ఇంట ఉన్నాయి. మీ దాసీలను పంపి వాటిని తెప్పించుకో!" అన్నాడు.

"మా ఇంటిని పీడలాగా పట్టిన దుర్మార్గులు ఏ క్షణాన నా పీక కోసి నా సొత్తు పంచుకుంటారో అన్నట్టుగా ఉన్నది పరిస్థితి. ఈ కానుకలుకూడా వాళ్ళకు దక్కటం దేనికి? ప్రస్తుతం వాటిని మీ




ఇంటనే ఉండనీ. ఏనాడు నాకీ పీడ వదిలితే ఆనాడు నువే తెచ్చి వాటిని మా ఇంట్లో పడవెయ్యి," అన్నాడు ధీరమతి.

తరవాత అతను తన అతిథిని వెంటబెట్టుకుని ఇంటికి వెళ్ళాడు. హాలులో ఆసనాలన్నిటిమీదా తివాసీలు పరిచివున్నాయి. దాసీలు అతిథిచేత స్నానం చేయించి, బట్టలు కట్టబెట్టాక హాలులో అయనా, ధీరమతీ భోజనాలకు కూచున్నారు. వారు భోజనంచేస్తున్నంత సేపూ పద్మముఖి వారి కెదురుగా ఒక ఆసనంమీద కూచుని వెనక ఉన్న స్తంభానికి చేరగిలబడి కదురుతో సన్నని నూలు వడకసాగింది.



భోజనాలు ముగిశాక ఆమె తన కొడుకుతో, "నాయనా, ఆ దుర్మార్గులు వచ్చే లోపున, మీ తండ్రి వార్తలు ఏమి తెచ్చావో చెబుదూ," అన్నది.

"అంతా చెబుతానమ్మా! నేను పైలాస్‌కు వెళ్ళి నవద్యోతుణ్ణి చూశాను. ఆయనా, ఆయన కొడుకులూ నన్ను ఎంతో ఆప్యాయంగా చూశారు; కాని ఆయనకు నాన్నను గురించిన వార్తలేవీ తెలియవు. అందుచేత నేనొక బండిమీద ఆయన కొడుకును వెంట తీసుకుని ప్రతాపుడుండే దేశం వెళ్ళాను. నేను చెప్పిన కథ అంతా విని ప్రతాపుడు మన ఇంట ఉన్న దుర్మార్గులపై మండిపడి, నాన్న తిరిగివస్తే వీళ్ళందరినీ చిత్రవధ చేస్తాడన్నాడు. నాన్న ఏదో దీవిలో ఉండగా చూసినట్టు సముద్రాలమీద ఉండే ముసలివాడు తనతో చెప్పినట్టు ప్రతాపుడు నాతో అన్నాడు. ఆ తరవాత నేను ఇంటికి తిరిగి వచ్చేశాను. ఇంతకంటె వార్తలేవీ లేవు," అన్నాడు ధీరమతి.

ఈ మాటలు విన్న అతిథి పద్మముఖితో, "అమ్మా, నిజం నేను చెబుతాను విను. నీ భర్త ఈ దేశానికి వచ్చేవున్నాడు. మీ యింట్లో జరుగుతున్న దారుణకాండ గురించిన అన్ని వివరాలూ అతనికి తెలుసు. ఈ దుర్మార్గులకు అతని చేతిలో మూడిం





దని నా అంతర్వాణి చెబుతున్నది," అని జోస్యం చెప్పాడు.

"బాబూ, మీ నోటి చలవవల్ల అలాగే జరగాలి గాని మీకు ఏమి ఇవ్వమన్నా ఇస్తాను!" అన్నది పద్మముఖి.

లోపల ముగ్గురూ ఈ విధంగా మాట్లాడు కుంటున్న సమయంలో ఇంటిముందున్న ఆవరణలో దుర్మార్గులందరూ చేరి వ్యాయామ పరీక్షలు చేసుకుంటున్నారు. కొందరు బరువులు దూరం విసురుతున్నారు. మరికొందరు ఈటెలను గురికేసి కొడు తున్నారు. ఇంతలో వారి ముఖ్య నౌకరు వచ్చి, "మిట్టమధ్యాన్నమయింది, ఆటలు చాలించి అన్నాలకు పదండి!" అన్నాడు. వెంటనే వాళ్ళందరు హాలులోకి పరిగెత్తుకు వచ్చి ఆసనాలపై చతికిలబడ్డారు. వాళ్ళు ఆ రోజు కోయించిన వేటలన్నీ వండి వారికి వడ్డనచేయగా వారు భోజనాలు చేయసాగారు.

ఈలోపల పందులకాపరి రూపధరుడితో, "నిన్ను మా యజమాని నగరానికి తీసుకు పొమ్మన్నాడు గద. పోదాం, బయలుదేరు. ఇప్పటికే ఆలస్యమయింది!" అన్నాడు.

దారివెంట పట్టుకుని నడవటానికి మంచి కఱ్ఱ ఉంటే ఇవ్వమని అడిగి పుచ్చుకుని, తన జోలె భుజంమీదుగా వేసుకుని రూప





ధరుడు పందులకాపరి వెంట బయలుదేరాడు. ముందు పందులకాపరి దారి తీస్తూంటే రూపధరుడు దిక్కుమాలిన బిచ్చగాడి రూపంలో, కర్రమీద బరువు మోపి నడిచే వృద్ధుడిలాగా తన సొంత ఇంటికి బయలుదేరాడు.

వారు ఒక జలపాతం ఉన్న చోటికి చేరేసరికి మంచి మంచి గొర్రెలనూ, మేకలనూ తోలుకుంటూ పోతూ కాళుడనే వాడొకడు అక్కడికి వచ్చాడు. వాడు రూపధరుణ్ణి చూసి వెటకారంగా, "ఎవడీ బిచ్చగాడు? ఒరే పందులు తోలేవాడా, నీకు ఈ పీనుగు ఎక్కడ దొరికాడు. వీళ్ళ తాడు తెగ, ఈ



బిచ్చగాళ్ళు అడుక్కు తినటానికీ, ప్రజలను వేధించటానికీ తప్ప ఇంకెందుకూ పనికి రారు. ఈ దరిద్రుణ్ణి రూపధరుడి ఇంటికి తీసుకుపోయావో, అక్కడ ఉండే పెద్ద మనుషులు వీడి పుటమారుస్తారు! ఛీ, తప్పుడు వెధవ!" అంటూ రూపధరుడి తుంటిమీద బలంగా ఒక్క తన్ను తన్నాడు.

రూపధరుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. చేతిలో ఉన్న కర్రతో ఒక్క దెబ్బకు వాడి తల పగలగొట్టటమో, వాణ్ణి అమాంతం ఎత్తి రాళ్ళకేసి కొట్టి పామును చంపినట్టు చంపటమో చేద్దామనిపించింది. కాని అందుకు అది సమయంకాదని కోపాన్ని దిగమింగుకున్నాడు.

పందులకాపరి మాత్రం ఆశ్చర్యంతో, "నీ కెంత కావరమెక్కిందిరా? యజమాని రానీ నీ ప్రాణాలు తీస్తాడు!" అన్నాడు.

"ఇంకా అయన రావలిసిందే! ఏనాడో చచ్చాడు! దేవతలు ధీరమతినికూడా తీసుకుపోతేనే మంచిది. లేకపోతే ఆ పెద్దమనుషుల చేతిలో తప్పక చస్తాడు!" అంటూ కాళుడు పశువులను తోలుకుంటూ ఇంటికేసి వెళ్ళాడు. వాడు తోలుకుపోతున్న మేకలూ, గొర్రెలూ రూపధరుడి ఇంట చేరిన దుర్మార్గుల విందుకే.





వాడి వెనకగా పందులకాపరీ, రూప ధరుడూ వచ్చి చేరారు. రూపధరుడు తన ఇంటికేసి చూసుకుని, "ఈ ఇల్లు రూప ధరుడిదే అయిఉండాలి. ఇంత ఇల్లు అతడికికాక ఇంకెవరికుంటుంది? లోపల భోజనాలు జరుగుతున్నట్టున్నది, వాసన తెలుస్తున్నది," అన్నాడు.

"వాసన తెలియకేం జేస్తుందిగాని మనం ఏం చెయ్యాలో త్వరగా నిర్ణయించు. ముందుగా నువే లోపలికి పోతావా? లేక నన్ను వెళ్ళిరమ్మన్నావా? నువు ఆటేసేపు బయట తారట్లాడావంటే ఎవరో ఒకరు నిన్ను ఇక్కడినుంచి తరిమేస్తారు!" అన్నాడు పందుల కాపరి.

"నువే ముందు వెళ్లిరా. ఎవరో నన్ను ఏదో చేస్తారని నాకు భయం లేదులే. దేవుడు నన్ను చాలా మొట్టికాయలు మొట్టాడు. ఇంకో మొట్టికాయ తగిలినా ఫరవాలేదు, వాటిలో చేరుతుంది!" అన్నాడు రూపధరుడు.

వారిలా మాట్లాడుకుంటూండగా అంత దూరాన ఉన్న పెంటపోగుమీద పడుకుని ఉన్న ఒక ముసలికుక్క తల ఎత్తి, చెవులు రిక్కించి రూపధరుడికేసి చూసింది. అది అసలు మంచి వేటకుక్క. దాని పేరు




"కాంతి." రూపధరుడు దానిని చిన్న పిల్లగా ఉన్నప్పుడు చేరదీసి పెంచాడు, కాని అది అక్కరకు వచ్చేలోపునే అతను యుద్ధానికి బయలుదేరి వెళ్ళిపోయాడు. ఇప్పుడు కాంతిని గురించి పట్టించుకునే వారు లేరు. అది చాలా ముసలిదైపోయి, పంటినిండా గోమార్లు పట్టుకుని, ఆ పెంట పోగుపైనే ఉంటూ చావుకోసం ఎదురు చూస్తున్నది. అది ఇప్పుడు తన యజమానిని గుర్తించి చెవులు వేలవేసి తోక ఆడించింది; కాని శరీరంలో శక్తి లేని కారణంచేత లేచి అతడి దగ్గిరకు రాలేకపోయింది. దాన్ని చూడగానే రూపధరుడి కంటి



వెంట ఒక బాష్పబిందువు రాలింది. అతను పందులకాపరికేసి తిరిగి, "ఇది చూడ టానికి జాతికుక్కలాగే ఉంది. దీన్ని ఇలా అయిపోనిచ్చారేమిటి ? ఒకవేళ ఇది అంతగా పనికిరాని కుక్కేమో !" అన్నాడు.

"అలాగా ? దాని యజమాని బతికి ఉండగా దాని దర్పం చూడవలిసింది ! వేటకు పోతే అన్ని కుక్కలకంటె ముందు పరిగెత్తి మృగాన్ని పసికట్టేది. దాని యజ మాని ఎక్కడో దిక్కులేని చావు చస్తే, ఇది ఇక్కడ ఇలా దిక్కులేని చావు చస్తోంది !" అంటూ పందులకాపరి ముందుకు నడిచి ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

"కాంతి" తన యజమానిని చూసిన మరుక్షణం, అందుకే బతికి ఉన్నదానిలాగా, కళ్ళుమూసి చనిపోయింది.

పందులకాపరి లోపల అడుగుపెట్టగానే ముందుగా ధీరమతి అతన్ని చూసి, రమ్మని తల ఊపాడు. పందులకాపరి వెళ్ళి ధీర మతికి ఎదురుగా కూచున్నాడు. ఇంతలోనే రూపధరుడుకూడా కర్రమీద బరువు మోపి నడుస్తూ, శతవృద్ధు ఆకారంలో లోపలికి అడుగుపెట్టి, గడపదగ్గిరే మండిగాన్ని అను కుని చతికిలబడ్డాడు.

ధీరమతి బల్లమీదినుంచి పెద్ద రొట్టే, పట్టెడు కూరా తీసి పందులకాపరి కిచ్చి, "దీన్ని ఆ మనిషికి పెట్టు ! అతణ్ణి మిగిలిన వాళ్ళ దగ్గిరకూడా తలా కాస్తా అడుక్కో మను," అన్నాడు.

రూపధరుడు పందులకాపరినుంచి రొట్టే, మాంసమూ అందుకుంటూ, "అయ్యాను దేవుడు చల్లగా చూడాలి ! అయన కోరిక లన్నీ ఈడేరాలి !" అని దీవించాడు. అతను ఆ ఆహారం తిని, తాను చతికిలబడిన చోటి నుంచి లేచి, విందు ఆరగించే దుర్మార్గు లను సమీపించి, నిజమైన ముసలి బిచ్చ గాడిలాగా, ప్రతి మనిషి దగ్గిరా చెయ్యి చాచనారంభించాడు. —(ఇంకా ఉంది)






## 15

[ధీరమతి తన ఇంటికి తిరిగివచ్చి తల్లితో అన్ని విషయాలూ చెప్పాడుగాని తన తండ్రి విషయంమాత్రం చెప్పలేదు. ఆతనివెంట పైలాస్ నుంచి వచ్చిన ఒక జ్ఞాని అతనికి ఆ రోజు అతిథిగా వచ్చాడు. ఆ అతిథి భోజనం చేసినాక రూపధరుడి ఇంట తిష్ఠవేసిన దుర్మార్గులందరూ హాలులో భోజనాలు ప్రారంభించారు. ఆ సమయంలో రూపధరుడు అక్కడికి ముసలి బిచ్చగాడి ఆకారంలో వచ్చి, ధీరమతి ఇచ్చిన ఆహారం తిని, అందరిదగ్గిరా అడుక్కో నారంభించాడు.]

రూపధరుడి ఇంటపడి తింటున్న ఆ దుర్మార్గులకు ఈ ముసలివాణ్ణి చూసి చాలా జాలి కలిగింది. వారు తమకు తోచినది అతని చేతిలో పెట్టారు. "ఈ ముసలి వాడెవడు? వీడు ఎక్కడనుంచి వచ్చాడు?" అని కొందరు ఆశ్చర్యంతో అడిగారు.

అక్కడే ఉన్న మేకలకాపరి కాళుడు, "బాబుల్లారా, ఈ ముసలివాణ్ణి యిక్కడకు వచ్చే దారిలో ఇంతకుముందే నేను చూశాను. మన పందులకాపరి వెంటబెట్టుకు వచ్చాడు," అన్నాడు.

ఈమాట విని దుర్బుద్ధి పందులకాపరి కేసి తిరిగి, "నీ కిదేం పొయ్యేకాలంరా? ఈ నగరంలో తిరుగుబోతులూ, బిచ్చగాళ్లూ తక్కువయారని ఈ ముసలిముండాకొడుకును వెంట తెచ్చావా? మీ యజమాని

గ్రీకు పురాణగాథ



సొత్తు తినేటందుకు బిచ్చగాళ్లు తక్కువయారనా?" అన్నాడు.

"బాబయ్యా, తమరు గొప్పవారైతే కావచ్చు గాని, మా నౌకర్ల విషయంలో మీరు మహా కఠినంగా ఉంటున్నారు. ఎవరైనా బిచ్చగాళ్లను కావాలని వెంట తెస్తారా? కాకపోయినా నాకు తమతో పనేమిటి? నన్ను మా యజమానురాలూ, చిన్న యజమానీ నాలుగు కాలాలపాటు చల్లగా చూడాలి, అంతే!" అన్నాడు పందులకాపరి.

ధీరమతి పందుల కాపరితో, "ఎందుకు నీకీ అనవసర ప్రసంగం? అతని నోరే అంత. అతన్ని చూసి మిగిలినవాళ్లుకూడా పరుషంగా



మాట్లాడటం నేర్చుకుంటున్నారు," అని దుర్బుద్ధికేసి తిరిగి, "మనం బలం గల వాళ్లం గనక ఈ ముసలివాణ్ణి బయటికి గెంటమంటావు! అదేనా నీ సలహా? అలా ఎన్నటికీ జరగదు. నేను చెబుతున్నాను. దానం చెయ్యి. కాని నీకు తినటంలో ఉన్న ఆసక్తి పెట్టటంలో లేదు!" అన్నాడు.

"అబ్బో, చాలా పెద్ద ఉపన్యాసం ఇచ్చావే? నేను ఈ ముసలాడి కిచ్చేదే అందరూ ఇస్తే వీడు మళ్లీ ఈ ఇంటి చాయలకు రాడు!" అంటూ దుర్బుద్ధి బల్లకింద తన కాళ్ల అడుగున ఉన్న పీటను వంగి పైకి తీశాడు.

ఈలోపల రూపధరుడు అందరిదగ్గిరా తలా కాస్త పుచ్చుకుని తన జోలెలో వేసుకుని, దుర్బుద్ధిని సమీపించి, "అయ్యా, ఈ అందరిలోకీ మీరు గొప్పవారులాగా కనిపిస్తున్నారు. అందుచేత అందరికన్నా ఎక్కువగా ఇవ్వాలి. నేనుకూడా ఒకప్పుడు బాగా బతికినవాణ్ణి. నాకింద అనేక వేలమంది కింకరులుండేవాళ్లు. కాని దేవతలు నాపట్ల ఆగ్రహించి, నన్ను సముద్రాలపై దొంగతనాలు చెయ్యటానికి పంపారు. ఈజిప్టులో నా అనుచరులంతా శత్రువుల చేతుల్లో హతమయ్యారు. నేను దిక్కులేని వాణ్ణయిపోయి



ఈ విధంగా ఒంటరిగా దేశాలుపట్టి తిరుగు తున్నాను!" అన్నాడు.

"ఏమిటీ పీడ? తిండికూడా హాయిగా తినటానికి లేకుండా! దూరంగా నిలబడు! బిచ్చగాడివై ఉండి నీకెంత కావరం! నిన్ను మళ్లీ ఈజిప్టు పంపగలను జాగ్రత్త! వాళ్లంతా ఇవ్వకేం జేస్తారూ? వాళ్ల సొత్తు కాదుగా?" అన్నాడు దుర్బుద్ధి.

"అయ్యా, తమరు చూడటానికి గొప్పగా ఉన్నా బుద్ధిమాత్రం చాలా చిన్నదిలాగుంది. మీ సొత్తు కానప్పుడే ఇంత పెట్టలేనివారు మీ సొత్తయితే ఉప్పు నలుసుకూడా విదిలించేట్టు లేరే? ఇక్కడ ఇంత తినటానికి ఉన్నది గదా, ఒక చిన్న రొట్టెముక్క పారెయ్యగూడదా, బాబూ?" అంటూ రూపధరుడు అక్కడినుంచి కదిలాడు.

"ఎంత మాట అన్నావురా?" అంటూ దుర్బుద్ధి తన చేతిలో ఉన్న పీట రూపధరుడిపైన విసిరాడు. అది రూపధరుడి వీపున కుడిభుజంపైన బలంగా తగిలింది.

కాని రూపధరుడు ఆ దెబ్బకు చలించ లేదు. అతను తల తిప్పి దుర్బుద్ధికేసి ఒక్కసారి రోషంగా చూసి, వాకిలివద్ద తన స్థానానికి తిరిగి వెళ్లి ఇలా అన్నాడు: "ఈ ఇంటావిడను పెళ్లాడగోరే బాబుల్లారా! నా మాట



వినండి. తన సొత్తును సంరక్షించుకునే ప్రయత్నంలో మనిషి దెబ్బతింటే అందులో విశేషం ఏమీలేదు. కాని ఒక మనిషి పొట్ట కోసం పాకులాడుతూ దెబ్బ తినటం చాలా ఘోరం. మా బిచ్చగాళ్లను కాపాడే దేవుడెవడైనా ఉంటే ఈ దుర్బుద్ధి పల్లకీ ఎక్కటం అబద్ధమూ పాడె ఎక్కటం మాత్రం నిజమూ అవుతుంది!"

"నోరు మూసుకు కూచుని తింటావా, తిను. లేదా బయటికి నడు! అంతే గాని, ఇలా పేలావంటే నిన్ను అందరమూ కలిసి తాట వొలుస్తాము, జాగ్రత్త!" అన్నాడు దుర్బుద్ధి కోపంగా.



ఆ ముసలి బిచ్చగాడిపట్ల దుర్బుద్ధి అంత క్రూరంగా ప్రవర్తించటం మిగిలినవారికి కూడా అంతగా నచ్చలేదు. "ఆ ముసలి వెధవను కొట్టటమేమిటి?" "ఒకవేళ బిచ్చగాళ్ల దేవుడున్నాడేమో!" "ఒక్కొక్కసారి దేవుళ్లే ఇలాటి రూపంలో వస్తారు!" అని తలా ఒకమాటా అన్నారు.

ఆ మాటల్లో ఏఒక్కటీ దుర్బుద్ధి వినిపించుకోలేదు.

కాని తన తండ్రికి తగిలిన దెబ్బ చూసి ధీరమతికి మండిపోతున్నది. అతను తన దుఃఖాన్నీ, ఆగ్రహాన్నీ బలవంతాన అణచిపెట్టుకున్నాడు.



హాలులో జరిగిన సంగతులు పద్మముఖికీ, ఆమె వెంట ఉన్న పరిచారికలకూ తెలిశాయి. ఆమె పందుల కాపరిని పిలిపించి, "ఆ బిచ్చగాణ్ణి ఒకసారి పిలుచుకు వస్తావా? ఆయన చాలా దేశాలు తిరిగాట్ట, నాభర్త సమాచారం ఏమైనా చెబుతాడేమో! అడిగి చూస్తాను," అన్నది.

పందుల కాపరి రూపధరుడి దగ్గిరికి వెళ్లి, "అమ్మగారు నిన్నొకసారి రమ్మంటున్నారు. మా యజమాని వార్తలు నీకేమైనా తెలిస్తే వింటారట!" అన్నాడు.

"మీ యజమాని వార్తలు నాకు చాలా తెలుసు. కాని అవన్నీ చెప్పేందుకు ఇది సమయం కాదు. పొద్దూకినాక ఎవరూ లేనప్పుడు వస్తానని ఆవిడతో చెప్పు!" అన్నాడు రూపధరుడు.

పందులకాపరి పద్మముఖికి ఈ మాట చెప్పివచ్చి ధీరమతితో, "చిన్నబాబూ, ఇక నేను వెళ్లి నా పందులను చూసుకోవాలి. ఆ ముసలాణ్ణి కాస్త జాగ్రత్తగా చూసుకో! చూశావుగా దుర్బుద్ధి అతన్ని ఎంత లావు దెబ్బ కొట్టాడో?" అన్నాడు.

"ముసలాడి భయం నీకేమీ వద్దులే. నువు మాత్రం భోజనంచేసి మరీ వెళ్లు!" అన్నాడు ధీరమతి.





పందులకాపరి భోజనంచేసి వెళ్లేసరికి అపరాహ్ణమయింది. అందరూ పాటలలో, నృత్యాలలో మునిగి జల్సా చేస్తున్నారు. ఆ సమయానికి అక్కడికి మరొక బిచ్చగాడు వచ్చాడు. వాడు నగరంలో ఎప్పుడూ అడుక్కుతినేవాడే. వాడు అందరికీ సమాచారాలు చేరవేయుటంచేత వాణ్ణి "దూత" అని పిలిచేవారు.

ఈ దూత లోపలికి వస్తూనే రూపధరుణ్ణి చూసి, "ఏయ్, ముసలాడా! ఎవడవురా నువు? అవతలికి పోతావా, లాగి పారెయ్యమన్నావా?" అని గద్దించాడు.

"నేను నిన్నేమైనా అన్నానా, పెట్టానా? నాజోలి నీకెందుకు? నీమానాన నువు అడుక్కోరాదా? లాగటం మాటవస్తే, ముసలివాణ్ణయినా, నేనే నిన్ను లాగి పారెయ్యవచ్చు," అన్నాడు రూపధరుడు.

"ఏమిరా నీ పొగరూ? లేచి నిలబడు! ఎవరి బలమో తేల్చుకుందాం! ముసలి తొత్తువు నావంటి పడుచువాడిమీదికి కాలు దువ్వుతావా?" అన్నాడు దూత.

ఇద్దరు బిచ్చగాళ్లూ కాట్లకుక్కల్లాగా తయారుకావటం చూసి దుర్బుద్ధికి పరమానందమయింది. "స్నేహితులారా, వీళ్లిద్దరిలో ఎవరు గెలుస్తారో తేల్చుకుందాం. వీళ్ల




పోట్లాట ఇవాళ మనకొక కొత్త వినోదం!" అన్నాడతను.

అందరూ లేచి వచ్చి బిచ్చగాళ్ల చుట్టూ మూగారు. "మీ ఇద్దరిలో ఎవరు గెలిస్తే వాళ్లు రాత్రిదాకా ఇక్కడ ఉండి నిశ్చింతగా కావలిసినంత తినవచ్చు. ఓడిపోయినవాణ్ణి ఇక్కడ ఉండనివ్వం!" అన్నాడు దుర్బుద్ధి.

"అయ్యలారా, అసలే ముసలివాణ్ణి, పోట్లాడవలిసింది పడుచువాడితో. మీలో ఎవరూ నన్ను పక్కదెబ్బ కొట్టనని మాట ఇవ్వండి. అలా ఈ దూతకు మీరు సహాయం చెయ్యకుండా ఉంటే నా శక్తికొద్దీ పోరాడతాను!" అన్నాడు రూపధరుడు.






మధ్యలో అన్యాయం చెయ్యమని అందరూ ప్రమాణాలు చేశారు. తరవాత ధీరమతి రూపధరుడితో, "ఈ ఇంటిపెద్దను నేను. మిగిలినవారిలో కూడా పెద్దలున్నారు. మేమంతా నీకు అన్యాయం జరగకుండా చూస్తాం!" అన్నాడు.

తరవాత రూపధరుడు తన చింకిదుస్తులను కాళ్లమీదా చేతులమీదా ఎగదీసి కట్టాడు. అతని బలమైన తొడలూ, పిక్కలూ జబ్బలూ చూసి అందరూ నిర్ఘాంతపోయారు. "ఇవాళ మన దూతగాడు యమదూతల పాలే! కొరివితో తల గోక్కున్నాడు, వెధవ!" అని వారనుకున్నారు.



ఇక దూత స్థితి వర్ణనాతీతంగా ఉన్నది. వాడు భయంతో వణికిపోతున్నాడు. వాడి బట్టలు ఎగగట్టటానికి నౌకర్లు సహాయపడవలసి వచ్చింది. రూపధరుడితో పోట్లాడటానికికూడా వాణ్ణి బలవంతాన తొయ్యవలసి వచ్చింది. ఈ దూతను ఒక్క గట్టి గుద్దుతో యమలోకానికి పంపటమా, లేక చిన్న దెబ్బతో పడగొట్టటమా అని రూపధరుడు వితర్కించుకున్నాడు. ఒక్క దెబ్బతో తాను దూతను చంపేసినట్టయితే ఆ దుర్మార్గులకు తనను గురించి అనుమానం రావచ్చు. అందుచేత చిన్న దెబ్బే కొడదామని రూపధరుడు నిశ్చయించాడు.

ఇద్దరు యోధులూ ఒకరినొకరు ఎదుర్కోగానే దూత రూపధరుడి కుడిభుజాన్ని కొట్టబోయాడు. కాని రూపధరుడు దూత దవడ మీద ఒక్క దెబ్బ కొట్టేసరికి, వాడి దవడ ఎముక విరిగింది. వాడు నోట నెత్తురు కక్కుతూ కింద పడిపోయి కాళ్లు గిలగిలా తన్నుకున్నాడు. ప్రేక్షకులు చేతులు పైకెత్తి అల్లరిగా నవ్వారు.

రూపధరుడు దూత కాలు పట్టుకుని జరజరా బయటికి ఈడ్చుకుపోయి వాణ్ణి గోడ నానించి కూచోబెట్టి, వాడి కర్ర వాడి చేతిలో పెట్టి, "కుక్కలూ, పందులూ లోపలికి





రాకుండా చూస్తూండు. బిచ్చగాళ్ల కందరికీ నువే చక్రవర్తిననుకోకు. ఇంకా నయం, ఇవాళ తేలికలో పోయింది!" అన్నాడు. తరవాత అతను తిరిగివచ్చి వాకిలివద్ద తన యథాస్థానంలో కూచున్నాడు.

సాయంకాలం కాగానే పద్మముఖి, ఎన్నడూ రానిది, హాలులోకి దిగి వచ్చింది. ఆమె సౌందర్యం చూసి అందరూ తన్మయత్వం చెందారు. ఆమె తన కుమారుడితో, "ధీరమతీ, అంతకంతకూ నువ్విలా అయిపోతున్నావేమిటి, నాయనా? పరాయివాడు మన పంచన చేరితే అతనిపైన చెయ్యి చేసుకోనిస్తావా? ఆ మనిషికేదైనా ప్రమాదం లాటిది జరిగితే మనకు నలుగురిలో అప్రతిష్ఠ కాదా?" అన్నది.

"నీకు కోపం రావటం సహజమేనమ్మా! వీళ్లంతా నాచుట్టూ మూగి నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నారు. నేనేం చేసేది? ఇంతకూ ఈ వృద్ధుడిపైన చెయ్యిచేసుకున్న దూతకు మంచిశాస్తి అయిందిలే!" అన్నాడు ధీరమతి.

దూరంనుంచి విపులయోధుడనేవాడు, "పద్మముఖీ, నీ అందాన్ని దేశంలో ఉండే జనమంతా చూడగలిగితే అందరూ రేపు మీ ఇంటనే ఉంటారు! అందరూ నిన్ను పెళ్లాడ



గోరతారు! నిజంగా ఈ దేశపు స్త్రీలకు నీవు అణిముత్యానివి!" అన్నాడు.

"నా అందమంతా నాభర్త వెళ్లిపోయిన నాడే హరించుకుపోయింది. వెళ్లిపోయేటప్పుడాయన నాతో తాను మరణించిన పక్షంలో మరొకరిని వివాహమాడమని చెప్పినమాట నిజమే. కాని నా స్వయంవరం ఇంత అవమానకరంగా ఉంటుందని ఎన్నడూ అనుకోలేదు. ఇలాటిది ఎక్కడైనా ఉన్నదా? వరులుగా వచ్చేవారు వధువుకు అభరణాలూ, పశువులూ కట్నాలుగా తెస్తారు. అంతే గాని ఆమె ఇంట తిష్ఠవేసి ఆమె ఆస్తి యావత్తూ తినెయ్యరు," అన్నది పద్మముఖి.





ఆమెకు దుర్బుద్ధి ఈవిధంగా సమాధాన మిచ్చాడు. "నీవన్నమాట నిజమే, పద్మ ముఖి. అందరమూ మాకు తోచిన కట్నాలు తెప్పించి ఇయ్యమంటే ఇస్తాంగాని, మాలో ఒకరిని నువు భర్తగా వరించేదాకా మే మిక్కడినుండి మాత్రం వెళ్లిపోము!"

తరవాత అందరూ తమ మనుషులను పంపించి పద్మముఖికి వెలలేని కట్నాలు తెప్పించి ఇచ్చారు. వాటన్నిటినీ తన దాసీల చేత పట్టించుకుని పద్మముఖి తన గదికి వెళ్లిపోయింది.

చీకటిపడగానే హాలులో మూడు చోట్ల అగ్నిహోత్రాలు చేశారు. దివిటీలు వెలిగించారు.

చాలాసేపు అందరూ తాగి నానా అల్లరీ చేశారు. విపులయోధుడు రూపధరుడికి ఉద్యోగం ఇస్తానన్నాడు. "అయితే నువు చాలా దొంగవెధవవి! కష్టపడి పనిచేసే బాపతు కాదు!" అన్నాడతను.

"పొలం దున్నటంలోగాని, కొడవలి తీసుకునీ గడ్డి కొయ్యటంలోగాని మనం ఎప్పుడైనా పందెం వేసుకుందాం. ఎవరు ఎక్కువ పనిమంతులో తెలుస్తుంది. నువు వట్టి వదరుబోతువు. ఆ రూపధరుడు తిరిగి వస్తే నీ బతుకు తెలుస్తుంది!" అన్నాడు రూపధరుడు.

విపులయోధుడు ఆగ్రహించి అతనిపై ఒక పీట విసిరాడు. రూపధరుడు తప్పుకోగా అది ఇంకొకడికి తగిలింది. వాడు అరవ సాగాడు. అదిచూసి ఒక్కసారిగా అందరూ కేకలుపెట్టారు.

ధీరమతి అధికారంతో, "ఏమిటీ అల్లరి? మీకు చెడతాగి కైపెక్కి వెర్రివాళ్లలాగా ప్రవర్తిస్తున్నారు. ఇదేమీ బాగాలేదు. తిన్నారు, తాగారు, ఇక వెళ్లి పడుకోండి!" అన్నాడు. అందరూ లేచి వెళ్లిపోయారు. ఆ హాలులో రూపధరుడూ, ధీరమతీ మాత్రమే మిగిలారు.

—(ఇంకా వుంది)






## 16

[ఇరవై ఏళ్లకు స్వదేశానికి తిరిగివచ్చిన రూపధరుడు తన ఇంట్లో అడుగు పెట్టటానికి ఒక ముసలి బిచ్చగాడి రూపం ధరించవలిసి వచ్చింది. అతని రహస్యం అతని కుమారుడైన ధీరమతికి ఒక్కడికే తెలుసు. రూపధరుడి భార్య అయిన పద్మముఖిని పెళ్లాడే ఉద్దేశంతో అతని ఇంట చేరి అతని ఆస్తిని తిని తాగేస్తున్న దుర్మార్గులు ఈ ముసలి బిచ్చగాణ్ణి ఎంతో అవమానించారు. కాని రూపధరుడు దానిని సహించి ప్రతీకారం కోసం వేచివున్నాడు. ఆ రాత్రి అందరూ వెళ్లిపోయి హాలులో రూపధరుడూ, ధీరమతీ మాత్రమే మిగిలారు.]

రూపధరుడు ధీరమతికేసి తిరిగి, "నాయనా, గోడలమీద ఉన్న ఆయుధాలన్నీ తీసి సామాన్లగదిలో దాచెయ్యి. అవి ఏమయాయని ఎవరైనా అడిగితే, దాచానని చెప్పు," అన్నాడు.

ధీరమతి తన తల్లివద్ద ఉన్న దాసీలలో పెద్దదయిన బహుకీర్తి అనే ఆమెను పిలిచి, "నానమ్మా, దాసీలందరినీ తమ గదులలోకి వెళ్లి తలుపులు వేసుకోమను. మా నాన్న వెళ్లిపోయాక ఈ ఆయుధాలకేసి చూసిన వారు లేరు. ఇవి చూడు ఎలా బూజుపట్టి పోయాయో! పెద్దవాణ్ణయాను గనక వాటిని కాపాడే బాధ్యత ఇక నాదేగా!" అన్నాడు.

"నాతండ్రి! ఇంటి పెత్తనమంతా నువే తీసుకో, బాబూ!" అన్నది బహుకీర్తి. ఈ ముసలిది చిన్నతనంలో రూపధరుడికి దాది.




అమె వెళ్లిపోగానే రూపధరుడూ, ధీరమతీ లేచి గోడలకు తగిలించిఉన్న డాళ్లూ, శిరస్త్రాణాలూ, ఈటెలూ తీసి సామాన్లగదికి చేరవేశారు. ఈ పని ముగిసినాక రూపధరుణ్ణి హాలులో వదిలేసి ధీరమతి తన పడకగదికి వెళ్లిపోయాడు.

కొద్దిసేపట్లో పద్మముఖి దిగివచ్చి హాలులో ఒక అసనం పైన కూర్చున్నది. దాసీలు చలి కుంపట్లలో కొత్తకట్టెలు వేసి మంటలు చేశారు. ఒక దాసీ రూపధరుణ్ణి చూసి, "ఇంకా ఇక్కడే ఉన్నావా, ముసలాడా? తిన్నది చాలలేదా?" అని అవమానంగా మాట్లాడింది.



"బుద్ధితక్కువదానా, ఏమిటా పేలాపన? నేనీయనతో మాట్లాడబోతున్నానని తెలిసి కూడా ఎందుకలా నోరు పారేసుకుంటున్నావు?" అని ఆ దాసీని మందలిస్తూ పద్మముఖి రూపధరుడికోసం తన ఎదురుగా ఒక కుర్చీ వేయించింది. రూపధరుడు అందులో కూచున్నాక అమె, "అయ్యా, నువ్వెవరవు? మీది ఏ దేశం? మీ కులగోత్రాలేమిటి?" అని అడిగింది.

రూపధరుడు ఆమెకు తననుగురించి ఏదో ఒక కట్టుకథ చెప్పి, తన దేశం సిసిలీ అనీ, యుద్ధానికి బయలుదేరి వెళ్ళేటప్పుడు రూపధరుడు తన ఇంటికి వచ్చి అతిథిగా ఉన్నాడనీ చెప్పాడు. అమెకు నమ్మకం కుదిరేలాగ అతను రూపధరుడు అప్పుడు ధరించి ఉన్న దుస్తులనూ, అతని సేవకులనూ వివరించాడు. ఆ దుస్తులు పద్మముఖి తన భర్తకు ప్రయాణసమయంలో ఇచ్చినవే. ఆ వర్ణన వింటుంటే పద్మముఖికి దుఃఖం ఆగలేదు. ఆమెకు ఈ ముసలి బిచ్చగాడి మాటలలో చాలా గురి కుదిరింది.

ఆమె బహుకీర్తిని పిలిచి, "ఈ అతిథి మీ యజమానికి స్నేహితుడు. ఈయనకు కాళ్ళు కడుగు," అన్నది. బహుకీర్తి ఒక పెద్ద గిన్నెలో వేడినీళ్ళూ, చన్నీళ్ళూ పాళా





లుగా కలిపి తీసుకువచ్చి అతిథికి కాళ్ళు కడగ నారంభించింది. రూపధరుడు తన బట్టను మోకాళ్ళపైకి తీశాడు. అతని కాలిపై ఉన్న మచ్చ బహుకీర్తికి కనిపించింది. ఆమె రూపధరుణ్ణి గుర్తించింది. ఆమె చేతిలో ఉన్న నీటిగిన్నె దభీమని కింద పడి నీరంతా ఒలికిపోయింది. ఆమె అరవటానికి నోరు తెరిచింది, కాని రూపధరుడు చప్పున ఆమె నోరుమూసి, "నానమ్మా, నా రహస్యం బయటపెట్టి నన్ను నాశనం చెయ్యకు. ఇరవైఏళ్లు అష్టకష్టాలూ పడి ఇంటికి చేరుకున్నాను. ఇంకా కొద్దికష్టాలు మిగిలి ఉన్నాయి. అవి గడిచినదాకా నా రహస్యం కాపాడు," అన్నాడు రహస్యంగా.

బహుకీర్తి ఇందుకు సమ్మతించి మళ్లీ నీరు తీసుకురాబోయింది.

ఆమె చూసి గుర్తించిన గాయం రూపధరుడికి చిన్నతనంలో ఈ విధంగా కలిగింది : అతను కుర్రవాడై ఉండగా కట్నకానుక లిస్తామని అతని మేనమామలు పిలిపించారు. ఒకరోజు రూపధరుడు తన తాతగారితోనూ, మేనమామలతోనూ వేటకు వెళ్లి అందరికన్న ముందుగా ఒక అడవిపందిని చూసి దాన్ని వేటాడి చంపేశాడు. అయితే అతని ఈటెదెబ్బ తగిలి చచ్చేలోపల ఆ



పంది రూపధరుణ్ణి తన కొమ్ముతో కోరింది. ఆ గాయం మాని మచ్చపడింది.

బహుకీర్తి తన యజమానిని గుర్తించటం పద్మముఖికి తెలియదు. రూపధరుడు కాళ్లు కడగటం పూర్తి అయి తిరిగిరాగానే ఆమె అతనితో, "అయ్యా, నాకొక గడ్డుసమస్య వచ్చిపడింది. ఇదివరకల్లా నా కొడుకు పసివాడు, నా కొంగు పట్టుకుని వదలలేదు. అందుచేత నేను మళ్లీ పెళ్లాడి ఈ ఇంట్లో నుంచి వెళ్లిపోవలిసిన అవసరం లేకపోయింది. ఇప్పుడు వాడు పెద్దవాడయ్యాడు. వాడి కిప్పుడు నాకన్నకూడా వాడి ఆస్తి ముఖ్యం. నన్ను స్వయంవరం చేసుకోమని




65




నిర్బంధించే ఈ రాజకుమారులు తన సొత్తంతా తినేస్తూ ఉండటం వాణ్ణి చాలా బాధిస్తున్నది. కనక నేను పెళ్లిచేసుకు తీరాలి. ఇందుకు ఒక ఉపాయం ఆలోచించాను. నా భర్త పన్నెండు గొడ్డలితలలు బారుగా పెట్టి వాటన్నిటినుంచీ దూసుకుపోయేలాగా బాణం వేసేవాడు. నా భర్త బాణం ఎక్కుపెట్టి, పన్నెండు గొడ్డలితలల కుండా బాణం వేసినవాణ్ణి పెళ్లాడదామని నాలోనేను నిశ్చయించుకున్నాను!" అన్నది.

తరవాత ఆమె తన గదికి వెళ్లిపోయి పడుకున్నది. రూపధరుడు హాలు ముందు భాగంలో ఎద్దుచర్మంమీద గొర్రెతోళ్లు



పరుచుకుని పడుకున్నాడు. అతనికి నిద్ర రాలేదు. తెల్లవార్లూ అతను ప్రతీకారం గురించి ఆలోచించి తెల్లవారగానే తన పక్క తోళ్ళు చుట్టిపెట్టి, దేవుణ్ణి ప్రార్థించాడు.

తెల్లవారగానే ఎవరి పనులమీద వారు బయలుదేరారు. పందులకాపరి మూడు బలిసిన పందులు తోలుకువచ్చాడు. అతను రూపధరుణ్ణి చూసి, "ఇక్కడ చేరిన మూక నిన్ను సరిగా చూస్తున్నారా, బాబూ? లేక వారి బుద్ధి పోనివ్వటంలేదా?" అని అడిగాడు.

"వాళ్ళకు కాస్తయినా అభిమానం లేదు. ఇంకొకరి ఇంట చేరి ఇలా ప్రవర్తించే నీచులను దైవం తప్పక శిక్షిస్తాడు!" అన్నాడు రూపధరుడు.

వారు మాట్లాడుతుండగా గొర్రెలకాపరి కాళుడు వచ్చాడు. తన కొత్తయజమానులు కోసుకు తినగలందులకు వాడు బలిసిన మేకలనూ, మేకపిల్లలనూ తెచ్చాడు. వాడు వాటిని బయట కట్టివేస్తూ రూపధరుణ్ణి చూసి, "ఇంకా ఇక్కడే ఉన్నావా, అడుక్కు తినేవాడా? అడుక్కోవటానికి ఇంత నగరంలో నీకు మరే ఇల్లూ కనబడలేదా?" అన్నాడు. రూపధరుడు ఈ మాటలకు జవాబు చెప్పలేదు. అతని కోపాగ్ని రగులుతున్నది.





ఇంతలో అక్కడికి సుఖప్రాప్తి అనే పశువులకాపరి ఒక పాడి ఆవునూ, కొన్ని మేకలనూ వెంటపెట్టుకుని వచ్చాడు. వాడు రూపధరుణ్ణి చూసి అయన ఎవరు, ఏ దేశస్థుడని పందులకాపరిని అడిగాడు. ఏమంటే ఆ ముసలి బిచ్చగాడి అవతారం చూస్తూనే వాడికి తన యజమాని గుర్తుకొచ్చాడు, వాడి కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. "అయ్యో, మా యజమానికూడా నీలాగే కుళ్ళుగుడ్డలు కట్టుకుని ఎక్కడన్నా దిక్కులేకుండా తిరుగుతున్నాడేమో! ఆ మహారాజు ఎప్పటికైనా తిరిగి రాకుండా పోతాడా అన్న ఆశతో ఇంకా ఇక్కడ ఉన్నానేగాని, లేకపోతే ఈ తిండిపోతుల కొలువు ఒక్కనాటికి చేసేవాణ్ణా?" అన్నాడు వాడు రూపధరుడితో.

రూపధరుడు వాడితో, "నువు బుద్ధిమంతుడిలాగా కనబడుతున్నావు. భయపడకు. నువ్విక్కడ ఉండగానే మీ యజమాని తిరిగి వచ్చి వీళ్ళందరినీ మట్టుబెడతాడు," అన్నాడు.

"అంత పనే జరగాలిగాని నా చేతులూరుకుంటాయా?" అన్నాడు సుఖప్రాప్తి.

సరిగా ఇదే సమయాన దుర్మార్గులు ధీరమతిని హత్యచేయటానికి ఒక పథకం ఆలోచిస్తున్నారు. మధ్యలో ఒకడు, "అన్నలారా,




అపశకునాలు కనబడుతున్నాయి. ఈ పథకం పనిచెయ్యదు. ధీరమతి హత్యసంగతి తరవాత చూడవచ్చు, భోజనాలకు పోదాం పదండి!" అన్నాడు. అందరూ లేచి హాలులోకి వచ్చారు. కొందరు పశువులను కోసి నిప్పుమీద కాల్చసాగారు. రొట్టెలూ, పానీయాలూ వచ్చాయి. అందరూ తినటానికి ఉపక్రమించారు.

వాకిలికి పక్కగా ధీరమతి రూపధరుడికి ఒక పాత కుర్చీ, బల్లా వేయించాడు. అతను తన తండ్రి ముందు ఆహారమూ, పానీయమూ పెట్టించి, "సుఖంగా భోజనం చెయ్యి. నిన్ను ఎవరూ అవమానించకుండా



67



చూస్తాను. ఇది నడివీధి కాదు, నా తండ్రి ఇల్లు, ఇప్పుడు నా ఆస్తి. అందరూ బుద్ధిగా మసులుకోమని మనవి చేస్తున్నాను. లేక పోతే నే నూరుకోను!" అని గట్టిగా అన్నాడు.

ఈ మాటలు విని అందరూ ఆశ్చర్య పోయారు. దుర్బుద్ధి తన మిత్రులకేసి చూసి, "వాడి బెదిరింపు విన్నారా? ఇవాళ వాడికి మంచి రోజు. మనకు అపశకునాలు జరగకపోయినట్టయితే ఈపాటికి వాడి నోరు మూసేవాళ్ళం!" అన్నాడు. ఈ మాటలు ధీరమతి విన్నాడుగాని, లక్ష్యపెట్టలేదు.

ఆ దుర్మార్గులలో అశ్వనిపుణుడు అని పొగరుబోతున్నాడు. వీడు చాలా స్థితిపరుడు. పద్మముఖి తన సంపద చూసి తనను పెళ్ళాడుతుందన్న ఆశతో వీడు దూర ప్రాంతంనుంచి వచ్చాడు. వాడిప్పుడు తన అనుచరులతో, "అబ్బాయిలూ, ఒక్కమాట ఆలకించండి. ఈ ముసలిబిచ్చగాడు మనతో సమంగా కూచుని తింటూ, తాగు తున్నాడుగదా. కాని వీణ్ణి ఇంకొక మెట్టు పైకి పంపిద్దాం. వీడికి నేనిచ్చే బహుమానం చూడండి," అంటూ ఒక ఆవు గిట్టల జోడు తీసి రూపధరుడి తలకేసి విసిరాడు. రూప ధరుడు తలను పక్కకు తిప్పి దెబ్బ తప్పించుకున్నాడు.

ధీరమతి కోపంగానూ వ్యంగ్యంగానూ మాట్లాడుతూ, "అశ్వనిపుణుడా, చాలా గురిగా గురితప్పావు! కాని మన అతిథి తలను పక్కకు తిప్పుకోవటం చూశాను. అతని తలకు దెబ్బే తగిలి ఉంటే నా బల్లెం నీ గుండెలను గుచ్చిఉండేది. నేనిదే చెబు తున్నాను, మీరు బుద్ధిగా మసులుకోండి. నేను గ్రాహికం వచ్చినవాణ్ణి. మీరిలా విచ్చలవిడిగా నా పశువులను కోసుకు తిన టమూ, చెడతాగి తందనాలు వేయటమూ నేను సహించను," అన్నాడు.

కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు. చివ రకు ఒకడు, "మిత్రులారా, ఆ బిచ్చగాడి



జోలికి పోకండి. ధీరమతీ, మేము కోరేదల్లా ఒకటే: మీ అమ్మ స్వయంవరం. అది జరిగితే మాకిక్కడ ఏమీ పనిలేదు. ఆవిడ దేనికోసం ఎదురుచూస్తున్నది? మాలో ఒకరిని ఎందుకు పెళ్లాడదు?" అన్నాడు.

వాకిలికెదురుగా ఆసనం వేసుకుని కూచుని ఉన్న పద్మముఖి ఈ సంభాషణ అంతా విన్నది. ఆమె లేచివెళ్లి తన భర్త తాలూకు వస్తువులుండే గది తలుపు తాళం తెరిచింది. ఆ గదిలో రూపధరుడి ధనుస్సూ, అంబులపొదీ ఉన్నాయి. ఈ ధనుస్సును రూపధరుడికి ఎవరో బహుమానంగా ఇచ్చారు. యుద్ధానికి బయలుదేరేటప్పుడు రూపధరుడు దానిని వెంట తీసుకుపోలేదు. పద్మముఖి ఆ ధనుస్సును కాస్సేపు తన ఒడిలో పెట్టుకుని ఏడ్చింది. తరవాత ఆమె కళ్లు తుడుచుకుని ధనుస్సునూ, అంబుల పొదినీ తీసుకుని కిందికి దిగివచ్చింది. నౌకర్లు గొడ్డలి తలలను ఒక పళ్లెంలో పేర్చి ఆమె వెనకనే తెచ్చారు.

పద్మముఖి హాలుద్వారంలో నిలబడి తన చెంపకు మేలిముసుగు అడ్డంగా పెట్టుకుని ఇలా అన్నది:

"అందరూ శ్రద్ధగా వినాలి. మీరందరూ నన్ను పెళ్ళాడ వచ్చి, మా ఇంటికి ముట్టడి




వేసి, మా సొత్తంతా తింటున్నారు. తాగుతున్నారు. నన్ను పెళ్ళాడగోరటం తప్ప మీ అర్హత ఏమిటో మీలో ఒక్కరుకూడా బయట పెట్టలేకపోయారు. మీ అర్హత ప్రదర్శించి నన్ను బహుమానంగా పొందండి. ఇదుగో నా భర్త ధనుస్సు. మీలో ఎవరు ఈ ధనుస్సుకు తాడు తగిలించి, బాణం ఎక్కుపెట్టి ఈ పన్నెండు గొడ్డలి తలల గుండా బాణాన్ని వేస్తారో వారిని నేను పెళ్ళాడతాను."

ఈ మాట చెప్పి ఆమె పందులకాపరిని పిలిచి, అతని చేతికి ధనుస్సూ, గొడ్డలి తలలూ ఇచ్చి, వాటిని అందరికీ చూప



69



మన్నది. వాటిని చేతిలోకి తీసుకుంటూ పందులకాపరి కంట తడి పెట్టుకున్నాడు. దూరాన నిలబడి చూస్తున్న సుఖప్రాప్తికి కూడా దుఃఖం ఆగలేదు. దుర్బుద్ధి వారిద్దరినీ చూసి వెటకారంగా, "అడముండల్లాగా అలా ఏడుస్తారేం? తింటారా కూచుని తిండి తినండి. ఏడవదలిస్తే బయటికి పోయి ఏడవండి! మా కిక్కడ గట్టిపని పడింది. ఎందుకంటే ఈ విల్లు వంచటం అంత తేలికపని అనుకోను రూపధరుడివంటి . బలశాలి ఇక్కడ ఎవరూ లేరు. నేను చిన్నతనంలో ఆయనను చూసేవాణ్ణి! ఆయన బలం నాకు తెలుసు," అన్నాడు.

అతను పైకి అలా అన్నాడేగాని, తానా విల్లును వంచి, తాడు తగిలించి, బాణం గొడ్డలి తలలకుండా దూసుకుపోయేటట్టు కొట్టగలనన్న ధైర్యం అతనికున్నది.

ధీరమతికి ఒక్కసారిగా వెర్రిఆవేశం వచ్చినట్టయింది. "ఓహో, మా అమ్మ పెళ్లాడి అత్తవారింటికి వెళ్ళేసమయం వచ్చింది! అది చూసి నేను వెర్రివాడికిమల్లే ఆనందిస్తున్నాను. మా అమ్మలాటిది భూప్రపంచంలో ఎక్కడా లేదు. కాని ఆ మాట నేను అని ఏం లాభం? ఏదీ, మా నాన్న ధనుస్సు నేను ఎక్కుపెట్టగలనేమో చూస్తాను!" అంటూ అతను లేచి గొడ్డలి తలలను అతి చాకచక్యంతో ఒక సోల్పులో అమర్చి తరవాత ధనుస్సును నిలువుగా నేల మీద నిలబెట్టి, దానికి తాడుతగిలించటానికి మూడుప్రయత్నాలు చేశాడు. ఇంకా గట్టిగా ప్రయత్నిస్తే తాడు తగులుకుంటుందని అతనికి తోచిందిగాని, రూపధరుడు ప్రయత్నించవద్దని అతనికి కళ్ళతో హెచ్చరిక చేశాడు. అతను విరమిస్తూ, "ఎబ్బే, నేను వట్టి అర్భకుణ్ణి, ఎందుకూ పనికిరాను. లేక నాకు అయం చాలదేమో! పెద్దలంతా ఉన్నారుగదా, మీ బలపరాక్రమాలు ప్రదర్శించండి, చూస్తాను!" అన్నాడు. —(ఇంకా ఉంది)






## 17

[తనను పెళ్ళాడమని వేధించే యువకులలో ఎవడైనా తన భర్త బాణాన్ని ఎక్కుపెట్టి, తన భర్తలాగా పన్నెండు గొడ్డలి తలలకుండా బాణం కొట్టగలిగితే అలాటి మనిషిని పెళ్ళాడటానికి పద్మముఖి నిశ్చయించుకున్నది. ముసలి బిచ్చగాడి రూపంలో వచ్చిన తన భర్తను గుర్తించక ఆమె ఈ నిశ్చయాన్ని ఆయనతోనే చెప్పేసింది. మర్నాడు ఈ విషయాన్నే ఆమె తన యింట పడి తింటున్నవారికికూడా చెప్పి, రూపధరుడి విల్లునూ, బాణాలనూ తెచ్చి వారి ఎదట ఉంచింది.]

ఒక్కొక్కరే వంతుప్రకారం వచ్చి ధనుస్సుకు నారి సంధించే ప్రయత్నం చేసి ఓడిపోసాగారు. ఇది చూసి దుర్బుద్ధి, కాళుణ్ణి పిలిచి, "ఒరే, ఈ విల్లుకు కొవ్వు రాచి నిప్పుదగ్గిర కాచు!" అన్నాడు. కాళుడు అలాగే చేశాడు. కాని అందువల్ల ఏమాత్రం ప్రయోజనం లేకపోయింది. ఈ విధంగా ధనుస్సుతో దుర్మార్గులు సతమతమవుతూ ఉన్న సమయంలో పందులకాపరీ, పశువులకాపరీ బయటికి వెళ్ళారు. ఇది గమనించి రూపధరుడుకూడా బయటికి వెళ్ళాడు. అతను వారిని దగ్గిరికి పిలిచి రహస్యంగా "నేను చెప్పేది శ్రద్ధగా వినండి. మీ యజమాని అయిన రూపధరుడు వస్తే మీరు అతనికి ఏమి సహాయం చేస్తారు? ఆ లోపల ఉన్న వాళ్ళందరినీ ఎదిరించి అతని పక్షాన







పోరాడతారా? దాపరికం లేకుండా నిజం చెప్పండి," అన్నాడు.

పోరాడతామని ఇద్దరూ ప్రమాణాలూ, శపథాలూ చేసినాక రూపధరుడు వారితో, "నేనే రూపధరుణ్ణి! నేను తిరిగి వచ్చినందుకు సంతోషించేవారు మీరిద్దరే నాకు కనబడుతున్నారు. దేవుడి దయవల్ల నేను నా శత్రువులను నాశనం చెయ్యగలిగితే మీకు గొప్ప బహుమానా లిస్తాను—పొలాలిస్తాను, ఇళ్ళిస్తాను. నేను రూపధరుణ్ణి కాదని అనుమానం ఉంటే ఈ మచ్చ చూడండి!" అంటూ అతను తన కాలిమీది మచ్చ చూపాడు.



ఇద్దరు సేవకులూ తమ యజమానిని చూసి ఆనందబాష్పాలు రాల్చారు.

"ఇప్పుడు సంతోషానికీ, కన్నీరుకూ వ్యవధి లేదు. నేను ముందు లోపలికి పోతాను. తరవాత మీరిద్దరూ ఒక్కొక్కరుగా రండి. నేను విల్లుకోసం అడుగుతాను. వాళ్ళు ఇవ్వరు. అప్పుడు పందులకాపరి ఆ విల్లు తెచ్చి నాచేతి కివ్వాలి, తరవాత ఆడవాళ్ళుండే చోటికి వెళ్ళి వాళ్ళు తమ గదుల లోకి వెళ్లి తలుపులు బిగించుకోవాలనీ, గడబిడ జరిగినా బయటికి రాగూడదనీ హెచ్చరిక చెయ్యాలి. సుఖప్రాప్తీ, నువు బయటికి వెళ్ళి సింహద్వారం బంధించాలి. తెలిసిందా?" అన్నాడు రూపధరుడు.

తరవాత ఆ ముగ్గురూ ఒకరి తరవాత ఒకరుగా లోపలికి వెళ్లి తమ స్థానాలలో కూచున్నారు. ఈ సమయానికి విపుల యోధుడు ధనుస్సుపైన తన బలం చూపుతున్నాడు. దానిని వంచటం అతనివల్ల కాలేదు. అతను నిరాశతో మూలిగి, "మనం ఎంత దౌర్భాగ్యులం! పెళ్లిమాట అటుంచండి, పెళ్లాడాలంటే ఈవిడ కాకపోతే ఇథకానిండా ఆడవాళ్లున్నారు. కాని రూపధరుడితో పోల్చితే మనం ఇంత బలహీనులమా అని నాకు విచారంగా ఉన్నది.



మన తరంవాళ్లను చూసి రాబోయే తరాల వాళ్లు ఏమనుకుంటారు ?" అన్నాడు.

దుర్బుద్ధి ఈ మాటలకు, "చాదస్తంగా మాట్లాడకు. ఇవాళ పర్వదినం. మనం ధనుస్సులజోలికి పోనేకూడదు. దాన్ని అలా పెట్టెయ్యి, మరొకనాడు దాని సంగతి చూడవచ్చులే !" అన్నాడు.

ఈ మాట అందరికీ నచ్చింది. అందరూ భోజనాలు ముగించాక రూపధరుడు, "అయ్యలారా, ఆ విల్లు ఒకసారి నా చేతికి ఇప్పిస్తారా ? ఇవాళకు మీరు దాని జోలికి పోవటంలేదుగద ! నా బలం ఏపాటి అయినదీ చూస్తాను. అయినా నా బలం ఏనాడో హరించిందిలే !" అన్నాడు.

అందరికీ ఆగ్రహం వచ్చింది. ఆ ముసలివాడు విల్లును వంచుతాడేమోనని వారికి భయంకూడా కలిగింది. దుర్బుద్ధి కోపంతో, "నీచుడా, నీకేమైనా మతి పోయిందా ? సారా తలకెక్కినట్టుందే ? నిజంగా నువ్వా ధనుస్సు వంచితే నీ ప్రాణాలు దక్కుతాయనుకున్నావా ?" అన్నాడు.

"దుర్బుద్ధీ, నా కొడుకు తెచ్చిన అతిథికి ధనుస్సు ఎందుకు నిరాకరిస్తున్నావు? ఆయన విల్లు వంచేసి నన్ను పెళ్లాడతానంటాడనా నీ భయం? అలాటి ఉద్దేశం ఆయన



కున్నదని ఎందు కనుకోవాలి ?" అన్నది పద్మముఖి కోపంగా.

"మాకలాటి భయమేమీ లేదు, దేవీ. కాని మేము వంచలేకపోయిన వింటిని ఈ నామరూపాలు లేని ముసలివాడు వంచి గొడ్డలితలలకుండా బాణం కొట్టాడనుకో, మాకందరికీ ఎంత అవమానం !" అన్నాడు విపులయోధుడు.

"అమ్మా, నీకీ గొడవలన్నీ దేనికి ? నేనీ విల్లును నా యిష్టం వచ్చినవాడికి దానం ఇచ్చినా నన్ను అడగగల మగవాడీ దేశంలో లేడు, సరేనా? నువ్వు వెళ్లి నీ పని చూసుకో !" అన్నాడు ధీరమతి.





ఈ మాటలు పద్మముఖికి ఆశ్చర్యమూ, ఆనందమూకూడా కలిగించాయి. తన కొడుకు సమర్థుడవుతున్నాడని సంతోషిస్తూ ఆమె తన గదికి వెళ్ళిపోయింది.

ఈ లోపల పందులకాపరి ధనుస్సును తీసుకుని రూపధరుడివద్దకు బయలుదేరాడు. ఇది చూసి అందరూ గోలగా అరిచారు. వాళ్ల అరుపులకు పందులకాపరి బెదిరి విల్లు కింద పడేశాడు. కాని ధీరమతి అతన్ని ప్రోత్సహించి, "వాళ్ల వాగుడుతో నీకేమిటి ? నీ పని నువు చెయ్యి," అన్నాడు.

పందులకాపరి ధనుస్సును రూపధరుడికిచ్చి స్త్రీలుండే చోటికి వెళ్లి, బహుకీర్తితో, "చిన్నబాబుగారు చెప్పమన్నారు, ఆడవాళ్లంతా గదుల్లోకి పోయి తలుపులు వేసుకోవాలట; గడబిడ జరిగినా బయటికి రాకూడదట !" అన్నాడు. ఇదంతా ఏమిటో ఆమెకు బోధపడలేదు, అయినా ఆమె పందులకాపరి చెప్పినప్రకారం ఏర్పాటు చేసింది. సుఖప్రాప్తి చల్లగా బయటికి జారుకుని తలవాకిలి బంధించివచ్చాడు.

ఈలోపుగా రూపధరుడు విల్లును తన చేత పట్టుకుని అటూ ఇటూ తిప్పి పరీకించాడు. అందరి కళ్ళూ అతనిపైనే ఉన్నాయి. "బాణాల సంగతి తెలిసినవాడల్లే నే కనబడుతున్నాడు...అటువంటి



బాణం చెయ్యాలని చూస్తున్నాడులాగుంది... దానికి తాడు తగిలించి బావుకునేదేమిటో బావుకోనీ!" అంటూ వాళ్లు రకరకాలుగా వ్యాఖ్యానించారు.

రూపధరుడు ధనుస్సును పరీక్షించటం పూర్తిచేసి, సునాయాసంగా దానికి తాడు తగిలించి, ధనుస్సును కుడిచేత పట్టుకుని ఎడమ చేత తాడు మీటాడు. అది చక్కని నాదంచేసింది. అందరూ దిగ్భ్రమచెందారు. రూపధరుడు ఒక మంచి బాణాన్ని అంబుల పొదినుంచి తీసి ఎక్కుపెట్టి గురిచూసి అన్ని గొడ్డలితలలకుండానూ దూసుకు పోయేటట్టు కొట్టాడు.

తరవాత అతను తన కొడుకుతో, "నాయనా, ధీరమతీ! నేను నీకు అప్రతిష్ఠ తీసుకురాలేదు. అవలీలగా వింటికి తాడు తగిలించాను, గురిగా బాణం కొట్టాను. ఈ పెద్దమనుషులు ఏమంటే ఏం గాక, నా బలం తగ్గలేదు. చీకటి పడబోతున్నది. ఈ పెద్దలకు రాత్రిభోజనం సిద్ధంచేయించు. తరవాత క్రీడావినోదాలూ, నృత్యగానాలూ ఉండనే ఉన్నాయి," అంటూ సైగచేశాడు.

వెంటనే ధీరమతి ఒకచేత కత్తీ, ఇంకొక చేత పదునైన ఈటె తీసుకుని తన తండ్రి పక్కనే వచ్చి నిలబడ్డాడు. రూపధరుడు తన చింకిగుడ్డలు తీసి ఎడంగా పారేసి





ఒక్క గంతుతో వెళ్లి గడపమీద నిలబడి మిగిలిన బాణాలను తన కాళ్ళవద్ద నేల మీద పరిచి, "అసలు ఆట ఆరంభ మయింది. నే నీసారి ఇంకొక గురి కొట్ట బోతున్నాను. దాన్ని ఎవరూ లోగడ కొట్టి ఉండలేదు!" అంటూ బాణం ఎక్కుపెట్టి దుర్బుద్ధికేసి కొట్టాడు.

ఆ బాణం తనకు తగులుతుందని దుర్బుద్ధిగాని మిగిలినవారుగాని కలలో కూడా ఊహించలేదు. దుర్బుద్ధి పెద్ద కూజాలో ఉన్న సారాయిని రెండు చేతులా ఎత్తి తాగుతుండగా బాణం వచ్చి అతని కంఠంలో గుచ్చుకున్నది. కూజా అతని చేతిలోనుంచి కింద పడింది, అతను పక్కకు పడిపోయాడు.

మరుక్షణం హాహాకారాలు చెలరేగాయి. అందరూ తమ అసనాలమీదినుంచి లేచి అయుధాలకోసం గోడలకేసి చూశారు. గోడ లన్నీ బోడిగా ఉన్నాయి.

"మనిషిని కొడతావురా, దుర్మార్గుడా! చూడు నీ ప్రాణాలు తీస్తాం!" అని వారు రంకెలు పెట్టారు.

అప్పటికికూడా వారు నిజం గ్రహించ లేదు. ఆ బిచ్చగాడు ప్రమాదవశాన దుర్బుద్ధిని కొట్టాడనే వారి నమ్మకం.

రూపధరుడు కనుబొమలు ముడేసి వారితో ఇలా అన్నాడు:

"కుక్కల్లారా, నేను ట్రోయ్‌నుంచి తిరిగి రానని ఆశపడ్డారు. ఆ ధైర్యంతోనే మీరు నా ఇంటిపై పడి నా సొత్తంతా తినేశారు, నా దాసీలను మీ ఉంపుడుగత్తెలు చేసుకున్నారు, నేను బతికి ఉండగానే నా భార్యను పెళ్లాడ టానికి సిద్ధపడ్డారు. మీకు దైవభీతి లేదు, నా భయమూ లేదు. యమపాశాలు మీ కంఠాలకు తగులుకున్నాయి!" అన్నాడు.

భయంతో ఎవరి నోటా మాట రాలేదు విపులయోధుడుమాత్రం, "నువ్వు నిజంగా రూపధరుడివే అయితే నీ మాటలలో నిజం



ఉన్నది. మావల్ల చాలా అక్రమాలు జరిగాయి. వీటికన్నిటికీ మూలకారకుడు దుర్బుద్ధి. వాడు కేవలం భార్యకోసం ఇక్కడికి రాలేదు. నీ కొడుకును చంపి ఆస్తి కాజెయ్యాలనే దుర్బుద్ధితో వచ్చాడు. నీకు నష్టపరిహారం చేస్తాం; తాగిన సారా అంతా ఇచ్చేస్తాం, చందాలు వేసుకుని డబ్బు పోగు చేస్తాం, తలకు ఇరవై ఎద్దుల వంతున ఇచ్చుకుంటాం. నష్టపరిహారం ముట్టేదాకా నీకు మాపైన ఆగ్రహించే అధికారం ఉన్నది!" అన్నాడు.

"దుర్మార్గులారా మీరు చేసిన అకతాయితనానికి ఒకటే పరిహారం—మీ ప్రాణాలు. మీలో ప్రతిఒక్కడి ప్రాణాలూ పుచ్చుకుంటాను. మీకు పారిపోయే అవకాశం కూడా లేదు," అన్నాడు రూపధరుడు.

విపులయోధుడు తన అనుచరులతో, "అన్నలారా, ఇతను తెగబడ్డాడు. కత్తులు దూసి అందరమూ ఒక్కసారిగా కలియబడదాం పట్టండి. ఎంతమందినని చంపగలడు! మనం వీధిలోకి వెళ్లి కేక పెట్టామంటే అందరూ వస్తారు, వీడి ఆట కట్టవుతుంది!" అన్నాడు.

ఇలా అంటూనే అతను కత్తి దూసి ఒక పెడబొబ్బతో రూపధరుడివేపు లంఘించాడు.




మరుక్షణం రూపధరుడి బాణం అతని ఛాతిలో దిగబడిపోయింది.

మిగిలినవాళ్ళుకూడా రూపధరుడిపైకి కలియబడ వచ్చారు. కొందరిని ధీరమతి తన ఈటెతో పడగొట్టాడు. తరవాత అతను తండ్రితో, "నాన్నా, నీకూ పందులకాపరికీ, పశువులకాపరికీ ఆయుధాలు తీసుకు వస్తాను!" అన్నాడు.

"బాణాలు అయిపోకముందే పట్టుకురా!" అన్నాడు రూపధరుడు. ధీరమతి సామాన్ల గదికి వెళ్ళి నాలుగు డాళ్ళూ, ఎనిమిది ఈటెలూ, నాలుగు శిరస్త్రాణాలూ తీసుకుని క్షణంలో తిరిగివచ్చాడు.

వీటిని నలుగురూ ధరించి వాకిలికి అడ్డంగా నిలబడ్డారు.

బాణాలు అయిపోయాక రూపధరుడు విల్లును అవతల పెట్టి, ఈటెలు పట్టాడు. అప్పటికి కొందరు చచ్చారుగాని ఇంకా కొందరు మిగిలి ఉన్నారు. ఈ సమయానికి కాళుడు తన యజమానులకు సహాయం చేశాడు. వాడు వెనకదారిన వెళ్ళి సామాన్ల గదినుంచి ఒక డజను ఈటెలూ, డజను డాళ్ళూ తెచ్చి అందరికీ పంచిపెట్టాడు.

ఈ సంగతి గమనించి రూపధరుడు, "ధీరమతీ, వాళ్ళకి ఇంట్లో దాసీలెవరో సహాయం చేస్తున్నారు!" అన్నాడు.

"తప్పు నాదే, నాన్నా! సామాన్లగది తలుపు తాళం వెయ్యటం తొందరలో మరిచాను!" అంటూ ధీరమతి, పందులకాపరిని వెళ్ళి సామాన్లగది మూసిరమ్మని పంపాడు. రెండవసారి సామాన్లగదిలో ప్రవేశిస్తూ కాళుడు పందులకాపరికి దొరికిపోయాడు.

తరవాత ఉభయపక్షాలకూ ఈటెలతో యుద్ధం జరిగింది. అదృష్టవశాత్తూ శత్రువుల ఈటెలలో ఒక్కటికూడా రూపధరుడికిగాని ధీరమతికిగాని తగలలేదు. కాని వారి ఈటెలకు శత్రువులు పడిపోయారు. ఈటెలు అయిపోయాక రెండుపక్షాలవారూ దొమ్మియుద్ధానికి తలపడ్డారు.

ఆ రోజు దేవతలు రూపధరుడి పక్షాన ఉన్నారు. అతని శత్రువులందరూ చివరకు చచ్చారు. ఇద్దరినిమాత్రం అతను ప్రాణాలతో వదిలిపెట్టాడు; వారు అమాయకులు.

హాలంతా పీనుగుపెంటలతో నిండిపోయింది. రూపధరుడు ముసలిదాదిని పిలిచి, "దాసీలచేత ఈ హాలంతా కడిగి శుభ్రం చేయించు. ఈ శవాలన్నిటినీ బయటి ఆవరణలో చేర్చమని నౌకర్లకు చెప్పు," అన్నాడు. హాలు శుభ్రంగా కడిగినాక ధూపం వేయించాడు.

(వచ్చే సంచికలో ముగింపు)






## 18

[రూపధరుడి పని ముగిసింది. తన భార్యను పెళ్లాడే ఉద్దేశంతో ఇంట చేరి తన సొత్తంతా తినేస్తున్న గ్రీకు రాజకుమారులందరినీ అతనూ, అతని కొడుకూ కలిసి అటకాయించి మారణహోమం చేసేశారు. ఇందుకుగాను రూపధరుడు కేవలం తన పరాక్రమంపైనే ఆధారపడలేదు, తన యుక్తిపైనకూడా ఆధారపడ్డాడు. దేవతలుకూడా అనాడు అతనిపక్షాన ఉన్నారు. కాని అప్పటికీ రూపధరుడి సమస్యలు సాంతం తీరిపోలేదు.]

ఇదంతా జరుగుతున్నంతసేపూ పద్మముఖి నిద్రపోతున్నది. బహుకీర్తి ఆమె శయ్యామందిరానికి వెళ్లి, "లే, లే! ఇంకేం నిద్రపోతావు? నీ భర్త వచ్చాడు. దుష్ట సంహారం పూర్తి అయింది. నీకు మంచి రోజులు వచ్చాయి!" అని ఆమెను హడావిడిగా నిద్రలేపింది.

మొదట పద్మముఖి తన చెవులను నమ్మలేకపోయింది. ఆమె అనుమానంతో లేచి, "విధిచర్యలు చాలా ఆశ్చర్యకరంగా ఉంటాయిగద. అయినా, ఆ దుర్మార్గులను కడతేర్చిన మనిషిని చూస్తాం పద!" అన్నది. ఆమె ముసలిదాన్ని వెంట బెట్టుకుని కిందికి దిగివచ్చి రూపధరుడికి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నది. ఆమె ముఖాన ఏ భావమూ లేదు. ఆమె తనను పలకరిస్తుందనుకున్న రూపధరుడు ఆమె మౌనం చూసి ఆశ్చర్యపోయాడు.



"అమ్మా, నువు మనిషివా, రాయివా? నాన్నను పలకరించక, బెల్లం కొట్టిన రాయి లాగా ఉండిపోయావేం?" అన్నాడు ధీరమతి తల్లితో.

"ఏం మాట్లాడమన్నావు, నాయనా? నా గుండె మొద్దుబారిపోయి ఉన్నది. ఆయన నిజంగా మీ నాన్నే అయితే నే నాయనను తెలుసుకోలేకపోను. ఈ ఇంట్లో మా యిద్దరికి మాత్రమే తెలిసిన రహస్య విషయాలు చాలా ఉన్నాయి," అన్నది పద్మముఖి.

రూపధరుడు కొడుకుతో, "మీ అమ్మను వేధించకు. ఆవిడ నన్ను పరీక్ష చెయ్యనియ్యి. నేనెవరో ఆమె సులువుగానే తెలుసుకుంటుందిలే. ఈ కుళ్ళుగుడ్డలు చూసి నేను మరెవరో అనుకుంటున్నది. మనం కర్తవ్యం ఆలోచించాలి. నువు ఒక్క మనిషిని చంపితేనే అతని బంధు మిత్రులకు వెరిచి దేశం వదిలి పారిపోవాలి. మనం ఈ రోజున ఇథకాలో ఉండే ప్రముఖ యువకుల నందరినీ దారుణంగా చంపేశాం. ఆ మాట జ్ఞాపకం ఉంచుకో!" అన్నాడు.

"అయితే ఏం చెయ్యాలో నువే ఆలోచించు. ఆలోచనకు నిన్ను మించిన వాడెవడున్నాడూ?" అన్నాడు ధీరమతి.

"సరే, నా ఆలోచన విను. మొదట అందరూ స్నానాలు చేసి మంచి బట్టలు

వేసుకోవాలి. తరవాత నృత్యగీతాలు వాయించాలి; అవి విని లోపల పెళ్లి జరుగుతున్నదని బయటివాళ్లు అనుకోవాలి. వీళ్లంతా చచ్చిన మాట పైకి ఏమాత్రమూ పొక్కరాదు. ఈలోపల మనం ఊరు దాటి పల్లెలలోకీ, అరణ్యాలలోకీ వెళ్లిపోదాం," అన్నాడు రూపధరుడు.

రూపధరుడు చెప్పిన ప్రకారమే అందరూ స్నానాలు చేసి మంచి బట్టలూ, నగలూ ధరించి వాద్యాలతో సహా నృత్యాలు చేయసాగారు. బయట వీధిలో నడిచే జనం, "ఓహో, ఇంతకాలానికి ఈ ఇంటావిడకు మనువు కుదిరినట్టుందే. వెళ్లిపోయిన మొగుడికోసం వేచి ఉండలేకపోయింది కాబోలు!" అనుకున్నారు.

రూపధరుడు స్నానం చేసి శరీరమంతా తైలం మర్దించుకున్నాక మరొక మనిషిలాగా అయిపోయాడు. అతను భార్యతో, "ఏం మనిషివి? ఇరవై ఏళ్ల తరవాత ఇంటికి వచ్చిన భర్తను మరొకతె అయితే ఎంత ఆప్యాయంగా ఆదరించును!" అని, ముసలి దాదితో, "నానమ్మా, నాకు పక్క వెయ్యి, పడుకుంటాను!" అన్నాడు.

వెంటనే పద్మముఖి దాదితో, "నానమ్మా, ఆయన మంచం ఇవతలికి తెచ్చి, దానిపైన తోళ్లూ, కంబళ్లూ పరుచు!" అన్నది.





రూపధరుడికి ఈమాట వినగానే కోపం రెచ్చిపోయింది. "నా మంచాన్ని ఎవరు కదిలించారు? అది కదిలే మంచం కాదే!' అన్నాడు అతడు.

ఈ మంచంలో ఒక కిటుకున్నది. రూపధరుడు ఆ ఇల్లు కట్టినప్పుడు, అతని పడక గదిలో ఒక చెట్టుండేది. ఆ చెట్టును కొట్టినప్పుడు అతను దాని బోదెను భూమిలోనే ఉంచి, ఒక కోడులాగా తయారుచేసి మిగిలిన కోళ్ళూ, పట్టెలూ దానికి అమర్చి మంచం తయారుచేశాడు. ఈ రహస్యం అతనికి తెలుసునో లేదో బయటపెట్టించటానికే పద్మముఖి ఆ మాట అన్నది. రూపధరుడన్న మాటతో ఆమె సందేహం నివారణ అయింది. ఆమె తన భర్తను కౌగిలించుకుని, "నాపైన ఆగ్రహించకండి. ఎవరు నన్ను మోసగించుతారో అని నేను భయపడి చస్తున్నాను," అన్నది.

తన భార్య తీసుకున్న జాగ్రత్తకు రూపధరుడు చాలా సంతోషించాడు. ఆ రాత్రి పద్మముఖి తన భర్తనోట అతనికి కలిగిన అనుభవాలన్నీ విన్నది. తెల్లవారే సమయంలో రూపధరుడు తన వంటికి కవచం వేసుకుని ధీరమతిని నిద్ర లేపి అతనితోసహా బయలుదేరాడు. ఎవరూ చూడకుండానే వారు నగరం దాటారు.

వారిద్దరూ రూపధరుడి తండ్రి అయిన పిపీలకుడు ఉండే చోటు చేరారు. ఒకప్పుడు రాజరికం నిర్వహించిన పిపీలకుడు అక్కడ ఇల్లు వేసుకుని, చెట్లూ చేమలూ పెంచుతూ, దారిద్ర్యంలో నివసిస్తున్నాడు. రూపధరుడు తన తండ్రి నౌకర్లతో విందు భోజనం తయారుచెయ్యమని చెప్పి తోటలోకి వెళ్ళాడు.

అక్కడ ముసలి పిపీలకుడు ఒక మొక్కచుట్టూ పాదు తవ్వి బాగుచేస్తూ కనిపించాడు. ఆయన ధరించివున్న చొక్కా నిండా మాసికలే.






అయనను చూడగానే రూపధరుడి కంట నీరు తిరిగింది. వెంటనే వెళ్ళి అయనను కౌగలించుకుని తన సంగతులన్నీ చెప్పేద్దామనుకున్నాడుగాని ఆయన తనను గుర్తిస్తాడో గుర్తించడో చూడాలన్న కోరిక కలిగింది. అందుచేత అతను తండ్రిని సమీపించి, "ఏం, తాతా? నీ తోటలో మొక్కలన్నిటికీ ఇంత బాగా పోషణ చేస్తున్నావు గాని, నీకేమీ పోషణ జరుగుతున్నట్టు లేదే? నీ యజమానికి నువు చేసే చాకిరి తృప్తికరంగా లేదాఏం?" అన్నాడు.

"ఎవరు, నాయనా, నువూ? మీది ఏ దేశం?" అని పిపీలకుడు అడిగాడు.

"మాది సంచారదేశంలే, తాతా. అయిదేళ్ల కిందట రూపధరుడనేవాడు నాకు తగిలాడు. ఇది అయన ఉండే దేశమేనటగా? మళ్ళీ కనిపిస్తాడేమో బహుమానా లిచ్చిపుచ్చుకుందామని చూస్తున్నాను!" అన్నాడు రూపధరుడు.

ముసలివాడు తన కొడుకు పేరు వినగానే మట్టిచేతులు ముఖానికి నొక్కుకుని ఏడవసాగాడు. రూపధరుడికి గుండె అవిసిపోయింది. అతను తన తండ్రిని కౌగలించుకుని, "నేనే, నాన్నా! నాకోసం ఇంకా ఎందుకేడుస్తావు? ఇరవై ఏళ్లు యమయాతనలు అనుభవించి దేశానికి తిరిగివచ్చాను. నా ఇంట చేరి నా భార్యను పెళ్లాడమని పీడించే దుర్మార్గుల నందరినీ చంపేశాను," అన్నాడు.

"ఎంత పని చేశావురా, నాతండ్రీ! ఇథకా వాళ్లు నిన్ను బతకనిస్తారా? ఇరుగు పొరుగు దేశాలవాళ్లనుకూడా సాయం తెచ్చి నీపైకి వస్తారే!" అన్నాడు పిపీలకుడు.

"భయపడకు, నాన్నా. వెళ్ళి భోజనం చేద్దాం పద. వంట చెయ్యమని చెప్పాను!" అంటూ రూపధరుడు తండ్రిని ఇంటికి తీసుకువచ్చాడు. అక్కడ రూపధరుడి పందులకాపరీ, పశువులకాపరీ వంట సిద్ధం చేసి ఉంచారు. పిపీలకుడు స్నానం చేసి



వచ్చేసరికి ఎంతో దృఢంగానూ నిబారుగానూ ఉండటం గమనించి రూపధరుడు ఆశ్చర్య పోయాడు. తరవాత వారంతా కలిసి కూచుని భోజనాలు చేశారు.

ఈలోపల ఇథకా నగరంలో రూపధరుడు చేసిన హత్యలవార్త కార్చిచ్చులాగా వ్యాపించింది. అనేకమంది హహాకారాలు చేస్తూ, ఏడుస్తూ రూపధరుడి ఇంటి చుట్టూ మూగారు. ఎవరి శవాలను వారు గుర్తించి పట్టుకుపోయారు.

చాలా దూరప్రాంతాలనుంచి వచ్చిన వారు తమ బంధువుల శవాలను వాటివాటి దేశాలకు పడవలమీద పంపేశారు.

తరవాత నగరంలో సభ జరిగింది. దుర్బుద్ధి తండ్రి అందరినీ రెచ్చగొట్టాడు. "స్నేహితులారా, ఈ మనిషి చేసిన హత్యాకాండ దారుణమైనది. ఇతను ఎన్నో పడవలనూ, ఎంతోమంది పైకి రావలిసిన యువకులనూ వెంటబెట్టుకుని యుద్ధానికి పోయి, పడవలన్నిటినీ పాగొట్టుకున్నాడు. మనుషులందరినీ పోగొట్టుకున్నాడు. ఇప్పుడు ఒంటరిగా తిరిగివచ్చి దేశంలో ఉన్న మంచి యువకులందరినీ తన పొట్టన పెట్టుకున్నాడు. ఈ దుర్మార్గుడు ఏ పైలాస్‌కో, ఎలిస్‌కో పారిపోకముందే మనం పగ తీర్చుకోవాలి. మన కుర్రవాళ్లను చంపిన హంతకు



లను శిక్షించకపోతే మన వంశాలకు అది తీరని కళంకమవుతుంది. నామటుకు నేను చావనైనా చస్తాను గాని అలాటి అవమానం సహించను. ప్రతీకారానికి ఉపక్రమించండి! కదలండి!" అన్నాడాయన.

ఆయన మాటలు వింటుంటే, ఆయన కన్నీరు చూస్తూంటే ప్రేక్షకుల గుండెలు నీరయాయి. అయితే సరిగా ఆ సమయానికే అక్కడికి ఒక మనిషి వచ్చాడు. రూపధరుడు చంపకుండా విడిచిన ఇద్దరిలో ఇతను ఒకడు. అతను ఆ సభతో, "ఇథకా పౌరులారా, నామాట ఒకటి వినండి. ఆ హత్యాకాండ జరిగినప్పుడు నేనక్కడే ఉన్నాను. రూపధరుడి పక్కన బుద్ధిమతీ దేవి నిలబడిఉండటం నేను కళ్లారా చూశాను. ఈ హత్యాకాంత దైవనిర్ణయంతో జరిగింది!" అన్నాడు.

ఈ మాటలకు అక్కడ చేరినవారందరూ వెలవెల పోయారు.

ఇంకొక వృద్ధుడు లేచి, "జరిగిపోయిన దేదో జరిగిపోయింది. ఇంకా ఎందుకు రక్తపాతం చేస్తారు? ఇంతటితో పోనివ్వండి! అసలు తప్పు మీ కొడుకులది. వారిని నిగ్రహించమని నేను మీతో ఏనాడో చెప్పాను; మీరు లక్ష్యపెట్టలేదు. రూపధరుడు తిరిగి రాడన్న ధైర్యంతో మీవాళ్లు అతని ఇల్లు



కొల్లగొట్టి అతని భార్యకు తీరని అవమానం కలిగించారు; అందుకు అనుభవించారు. ఇందులో మరెవరి తప్పూ లేదు," అన్నాడు.

ఈ మాటలతో సగంమంది తృప్తిపడి సభనుంచి వెళ్లిపోయారు. మిగిలిన సగం మందీ ప్రతీకారానికే నిశ్చయించారు. దుర్బుద్ధి తండ్రి నాయకత్వాన వీరు ఆయుధాలు తీసుకుని బయలుదేరారు. వారు పిపీలకుడుండే చోటికి చేరుకునేసరికి రూపధరుడూ, అతని తండ్రీ మిగిలినవారూ ఆయుధాలు తీసుకుని వారిని ఎదుర్కోవటానికి సిద్ధమైనారు.

ధీరమతి తన తండ్రితో, "నాన్నా, ఇవాళ వీరందరికీ నా ప్రతాపం చూపిస్తాను చూడు!" అన్నాడు.

పిపీలకుడు పరమానందంతో, "ఈశ్వరా, ఇది నా జీవితంలో ఎంత పర్వదినం! నా కొడుకూ, మనవడూ ప్రతాపంలో పోటీ పడుతున్నారు!" అన్నాడు. ఆయనకు ఎక్కడ లేని ఉత్సాహమూ వచ్చింది. ఆయన తన ఈటెను ఎత్తి బలంగా దుర్బుద్ధి తండ్రిపైకి విసిరాడు; ఆయన ఆ దెబ్బకు పడిపోయాడు. రూపధరుడు మొదలైనవారు మిగిలినవారిపై పడ్డారు.

కాని అంతలోనే వారికి బుద్ధిమతీదేవి వాక్కు వినిపించింది:

"ఇక చాలు పౌరులారా! ఈ రక్తపాతం ఇంతటితో ఆపండి!"

ఆ కంఠం వినగానే అందరూ తెల్లబోయారు. వారి చేతులనుంచి ఆయుధాలు జారి కింద పడిపోయాయి. రూపధరుడిపైన పగ తీర్చుకోవచ్చినవారు వెనక్కు తిరిగి నగరానికి వెళ్లిపోయారు.

తరవాత రూపధరుడికి శత్రుభయం లేకుండా పోయింది. అతను తన భార్యతోనూ, కుమారుడితోనూ, తండ్రితోనూ సుఖంగా జీవించాడు.

—(అయిపోయింది)



